○ ఓం ○

శివరామ దీక్షిత అచల గురుపీఠ రాజయోగాశ్రమం, నర్సంపేట.

(రి. నెం. 1338/83)

# కైవల్యరహిత అచలబోధ సిద్ధాంతము




గ్రంధకర్త: నిత్యానంద జంగాలక్ష్మినర్సయ్య గారు

ఓం

శ్రీ సద్గురువేనమః

శ్రీ శివరామ దీక్షిత అచల గురుపీఠ రాజయోగాశ్రమం
నర్సంపేట
(రి. నెం. 1338/83)

# కైవల్యరహిత అచలబోధ సిద్ధాంతము

రచయిత:
జంగా లక్ష్మనర్సయ్య రాజయోగి

1500 ప్రతులు

జూన్: 1992 వెల: 20-00

## శ్రీ శివరామదీక్షిత అచల గురుపీఠ సాంప్రదాయికులు



శ్రీ పూర్ణానంద గట్ల వెంకటరామయార్య రాజయోగిగారు

శివరామ దీక్షిత అచల గురుపీఠ రాజయోగాశ్రమం, నర్సంపేట.
రి నెం. 1338/83)

# కైవల్యరహిత అచలబోధ సిద్ధాంతము



గ్రంధకర్త: నిత్యానంద జంగాలక్ష్మినర్సయ్య గారు

॥ ఓం ॥

గురుభ్యో నమః

# ఉపోద్ఘాతము

శ్రీ సద్గురు ప్రభువరేణ్యులగు శ్రీమద్ పూర్ణానంద 'గట్ల వెంకటరామయార్య రాజయోగీశ్వర మహరాజు గారు మరియు శ్రీమద్ దయానంద పొన్నాల రాజయోగీశ్వర మహరాజు గారి సేవాభాగ్యమున నేను పొందిన విజ్ఞాన సంపద-సంపద అనగా! ఒకదానిని వేరొకటి పోషించుచుండు అనేక పదార్థముల నన్నింటిని, ఒకటిగా ప్రోగుచేయబడిన ననేకమును, సంపదయందురు ఇది జ్ఞానసంపద శ్రీవారిముఖమునుండి వెడలిన, ఒక్కొక్క వాక్యమునందలి పదార్థములు అంతఃకరణమున కూర్చుకొన్న సంపద, ఈ సంపద దుఃఖః నివారణజేయుటయేగాక, జన్మరహితమును పొందించుటలో. ఇంద్రునిచేత వజ్రాయుధమునకన్న, శ్రీహరి చేతినుండి (వెడలిన) విడువబడు చక్రజ్వాలలకన్న గొప్పది. రుద్రమూర్తియగు శంకరులవారిచే, విడువబడిన త్రిశూలముకన్న వాడిమి గలది. సూర్యుని తేజస్సు యేలాతమమును పోగొట్టునో! అంతకన్న అధికశక్తిచే? అజ్ఞానమును పోగొట్టుటకు, మిన్న అటువంటి సంపదను మీముందుంచుచున్నాను మీ యందలి ప్రేమయే! నాలో దాగి (అనిగి) వెలుగుచున్న యీ సంపదను వెలికిలాగుచున్నది. ఇటువంటి బృహద్బ్రహ్మ జ్ఞాన సంపదను కేవలము జన్మరహితమునకు గొప్పదయినప్పటికి, దానినినగ్నముగా, లోకులముందుకు తీసుకొనివచ్చుచో, అది మన అధఃపతనమునకే కారణమగుట సత్యము, గురుపదేశించిన విద్యలన్నియు, యిష్టఫలమునిచ్చునవేయైనను నాలుగు వీధులు కలయుకూడలి (సంటర్‌లో ఆ విద్యను బిగ్గరగా ఉచ్చరించుచో। అదికూడా అరిష్టము కలిగించును, అందువలన గురుద్రోహమే కాగలదు, అలాయని అవిగ్రంధస్తము చేయకున్న, జిజ్ఞాసులగు పరమభక్తులకు ఏలా తెలియును. గాన ఈరహస్యము, అనగా జ్ఞానము, కేవలము త్రికరణశుద్ధిగా! ప్రవర్తించు భక్తులకేలా తెలియును. వారు మాత్రమే అనుభవించుటకు యోగ్యమైయుండునటుల, ఆశాపీడితులగు అభక్తులకు, తెల్యుటకు ఏమాత్రము వీలుకలుగకుండుటకు, రచన సంపదమీముందుంచుచున్నాను. అభిమానరహితులగువారు తెలియని విషయములు తెలిసినవారిచే తెలుసుకోగలరు. వారికి సుసాధ్యమే, అభిమాన సహితులగువారు, యీ అనుభవము అందక,

వారు చెడునదేగాక, వారిని నమ్మిన వారుకూడా, యీ అమృతస్వరూపజ్ఞాన సంపద, మృత్యువునే యివ్వగలదు మీకు తెలియజేయునంతజ్ఞానము నాయందులేదు, సూర్యునిముందు పెద్దమిగుడుబువ్వ ప్రకాశించునటుల, మీముందు యీ విషయములనుంచుచున్నాను, నన్ను మీకరుణామృత దృష్టిచేతజూచి దీనియందుండు నిజత్వమును పరిశీలించి, తగు విజ్ఞానము నొసంగుదురని ప్రార్థిస్తున్నాను. మిమ్ముల ప్రేమిస్తున్నాను. గానా, మీరుకూడా, తమపుత్రునిభంగి నన్ను ప్రేమించుడు, అనివేడుచు, వచ్చీరానీ యీ భాషచే, నా గురుదేవుడిచ్చిన యాజ్ఞ ప్రకారము, నావిధినేను నెరవేర్చుటకే ప్రయత్నించితిని, కానీ ఆ గురు మహరాజుగారు, నాకందించిన విషయములు, ఉన్నదున్నట్లు మీకందించలేకపోతినని చింతిస్తున్నాను. ధైర్యమేమనగా, మీరు వీటిని జూచి తర్కవితర్కములచే, నాహృదయమును కుదిపితిరే అందులో దాగియున్న జ్ఞానరసత్వము తప్పక రాగలరుని మిమ్ము ప్రార్థిస్తున్నాను ఈ గ్రంథములో, పరిపూర్ణము, యెరుక అని, రెండు పదార్థముల జ్ఞానము, అందు పరిపూర్ణమనునది, అచలమై, సృష్టి, స్థితి, లయాదులకతీతమై, త్రిడువతులుగానున్న దానియందు, భ్రాంతిచే, పాముగా గ్రహించు వారలకు, పాము నిజస్వరూపము, దానిలేని ఉనికి, దాని బుసలు పడిగెత్తి ఆడుచున్న విధముగా, నటనలుగా, సృష్టి స్థితి లయాదులు, మరియు విస్థిర్ణాకర్షలచే నొప్పుచు, తనస్థితిని తెలియనీయక, వేదశాస్త్రపురాణేతిహాసంబుల, తనగొప్ప నెంచుటకు, యాకత్ప్రపంచమంతట, తానేయని చాటుచున్నది. దాని నిజానిజంబులు, తెలుసుకోగలందులకు పిండ బ్రహ్మాండములు (2) వీటియందు ఉండు, జీవ ఈశ్వరుడనే అహములు, ఖండములుగా, బ్రహ్మమనునది అఖండముగా తెలిసిన స్థూలశరీరము, సూక్ష్మశరీరము, కారణశరీరము, మహాకారణ శరీరము, పంచకోశములు, వ్యష్టి సమిష్టి దేహములు, విరాట్టు! హిరణ్యగర్భ! అవ్యాకృత! ఈశ్వరులు! మొత్తము అష్ట తనువులు రహితరమొనర్చుటకు, పరిపూర్ణబోధతెలియుటకు, ప్రస్తుతముతానుండుటకు కైవల్య శరీరనిర్ణయము, పరాకాశ పద్ధతి, పంచాకాశములు, కాలకర్మ చక్రములతో

సహా, పరిపూర్ణమునంమలేనని నిజము తెలుపనైనది అది ఏలననగా!

కం॥ పరిపూర్ణ యెరుకలిపియని? గురువరుడెరిగించ రెండుగురై రిగెరుకన్ నా
పుచ్చుకున్న మృషయును. పరిశుద్ధపు బోధయిది పాటించికనరా! శివరాములా
పద్ధతియిదెరా! నరులుకొందరుబల్కి, రెరుకానుభ్రమింగి యీ పరిపూర్ణామయ్యే
మంచెరుగాక చెడుటకై, పాటించికనరా శివరామూల పద్ధాతియిదెరా!

ఈసృష్టియంతా యెరుకయనే భగవంతుడు చేసినాడు పరిపూర్ణములో ఇది లేదు లేకనే తోచినదిగానా దీనిని స్వయంభువః యనిశ్రుతులెన్నినవి దీనికి మూలము పరిపూర్ణముకాదు మరియేదియు మూలంలేదుగానా మూలములేని గుర్తెరిగే శరీరమని దీక్షిత సాంప్రదాయకులు నుడువుచున్నారు అట్టిదానిని భగవంతుడని దీనికనేక నామములు పెట్టినారు సరే ఈ సృష్టియంతా భగవంతుడే చేసినాడని అనేక శృతులు చెప్పుచున్నవి ఈ సృష్టి చేయుటకు అచల పరిపూర్ణ పరబయలందు లేక తోచిన యెరుకే (భగవంతుడే) అనిన అతడు ఈసృష్టి చేయుటకు పదార్థములు పనిముట్లు ఎక్కడతెచ్చినాడు అనే సంశయము రాగలదు సృష్టిచేయుటకు భగవంతుడు యే పదార్థములు ఏపరికరములు ఎచ్చటనుండి తేలేదు తానే అనేక రూపములుగా పరిణమించి జీవ ఈశ్వర జగత్తులుగా నిలిచారు గానా మనమేది చూచిన యేది అనుభవించిన పూజించినా అంతా భగవంతుడే? సర్వరూపములు సకలదేశములు సర్వవస్తువులు తానే ఊర్ణనాభి విధముగా। తానే అయ్యి తనకు అవిపేరు అని అన్నిటికి నేనుపరమని అన్నింటినిభరించి ధరించువాడనని అన్నింటియందు తానే ఉన్నానని వేదశాస్త్రపురాణాదులయందు చాటుచున్నారు, దీనిని బట్టి భగవంతుడు తప్ప మరేమియులేదు కావున భగవంతుడు వేరేదో వస్తువును తీసుకొని దానినుండి విశ్వమంతా సృష్టి చేసినాడని తలంచరాదు ఈ సృష్టియంతా భగవంతుడే ఆయను ఆయనే వివిధ రూపాలలో ఉద్భవించి అనేక రూపాలుపొంది ఈ విశ్వమంతా తానే ఆయను కదా! ఉన్నదేదో తెలియక తనకుతానే పంచభూతములుగా ఉన్నాడు కొందరు అభిప్రాయమేమనగా చీకటి లేకుండా విత్తనములు లేవు జీవములేదు విశ్వములేదు ఈశ్వరుడులేడు అంతా అంధకారమై చీకటి? శూన్యము? అందుకని యేమిలేక పోవును అనువానికి మూల సూత్రమైయున్నది ఈ విశ్వమంతా! ఒకే వస్తువుయని తెలియబడుచున్నది? సృష్టియంతా తానేయై దానికి పేరుగా నున్నాడని శాస్త్రవేత్తలు చీకటిని ఏకమని వెలుతురు అనేకమని ఈ రెండు కలిసి ఏకమనేకమని నిర్ణయించుకొని శాస్త్రములు వ్రాసినారు మరికొన్ని శాస్త్రములు వెలుతురు బ్రహ్మమని చీకటిని మాయయని వ్రాసినారు మరికొందరి అభిప్రాయము ఈవిశ్వమందు ప్రతివస్తువుయొక్క ఉద్భవానికి ముందువున్నది అణువు అనగా నేను అనునది అణువుతో నిక్షిప్తమైనది. అన్ని పత శక్తివంతమైన శక్తిమాత్రమే ఒక అంధకారము తప్ప మిగిలినవన్నియు ఈ శక్తివల్లనే ఉద్భవించినవే.

ఈ రెండు వస్తువులు ఒకటే. ఈ రెంటి సమ్మేళనమే సృష్టి దీని విషయము ఒకటి అనేకమై అనగా ఒక బంగారము అనేక వస్తువులుగా ప్రపంచమైన నగలుగా యేర్పడినవనియున్నా బంగారపు వేయనియెలాతెలియుచున్నాయో అలాగే వకటైన యెరుక శక్తి లేక మాయనుండి ఏలాకలిశావో? నాటిని తెలియజేయుటకు కైవల్య రాహిత్యాచల బోధ తెలియజేసి ఉన్నది ఉన్నట్లు. లేనిది లేనట్లు మీ ముందుంచుచున్నాను గానా మీరందరూ నాయందు అను గ్రహముంచి నిజమును నిజముగా తెలియజేయుటే మా ధర్మం.

ఈ గ్రంథము పూర్తి చేసి వినిపించిన పర్మాల నర్సింహారెడ్డిగారు అకినేపల్లి 500-00 ఐదువందల రూపాయలు విరాళముగా ఇచ్చినారు, ఆ తరువాత సహజానంద నాగబండి కేశవరావుగారు 1000-00 వెయ్యి రూపాయలు మరియు ఏర్కు నిర్వానానంద అడ్వ కనకయ్యగారి శిష్యుడు నిర్మలానంద దొంతుల రామయ్య మహబూబాబాద్‌గారు 1116-00 వెయ్యి నూటపదహారు రూపాయలు ఇచ్చినారు ఆతర్వాత కొంతమంది భక్తులు మా ఫోటో ఈ గ్రంథములో వేస్తే 500-00 ఐదు వందల రూపాయలు యిస్తామని ముందుకు వచ్చారు. ఇందులో గౌరవనీయులగు పెద్దల ఫోటోలు మరియు కార్యకర్తలు ఈ గ్రంథమునకు సహాయం చేసినవారి ఫోటోలు ఉచితముగా వేయబడినవి ఈ గ్రంథ ముద్రణకు సహజానంద సంకరనేని ఈశ్వరయ్యగారు, మిట్టపెల్లి వీరయ్యగారు, ఓర్సు సంగయ్యగారు, చిదురాల బిక్షపతిగారు, దూసటి మల్లేశంగారు సహాయం చేసినారు. మరియు సహజ విమర్శానంద తెప్పలి వెంకటనారాయణగారు వీరు ఉభయత్ర కార్యసిద్ధికి పాలుపడినారు ఆ॥ప॥ వనం శంకరయ్య మరియు మహేశ్వర ప్రింటింగ్ ప్రెస్ కార్యాలయం యజమానులు, కార్మికులు సకాలంలో ముద్రణ చేసి అందించినారు, పై వారందరికి నా కృతజ్ఞతలు.

ఇట్లు

గ్రంధకర్త

శ్రీ గురుభ్యోనమః

# సందేశం

శ్రీమదచలర్షి శ్రీ నిత్యానంద ప్రభు చరణస్మరణలతో గురు పుత్రులయిన
తోటి సోదర సోదరి భక్తాదులకు శ్రీ గురుభ్యోనమః పరమాత్మ సృష్టిలో
యెందరో మహానుభావులు తమ గురువులయినవారి సేవాభాగ్యముచే తెల్సు
కొనిన అనుభవమును తోటి మానవాళికి తోడ్పడవలెనని గ్రంథములు రచి
యించి చాటనెంచుట వారి నిస్వార్థతకు యదార్థము తీవ్రమోక్షేచ్ఛ గలిగిన
గురుభక్తి గురుదేవ గురునిష్ఠలయందు పూర్ణ విశ్వాసము గలవారికి ఈబోధ
ప్రచారమొనరించి జనన మరణ భయభ్రాంతులను దొలగించు ఈ గ్రంథ
రచన వారి ఉదాత్తబుద్ధికి యదార్థము కైవల్య రహిత అచల బోధ సిద్ధాంత
ము అను నీ గ్రంథము చక్కని క్రమశిక్షణ గలిగి తరియించుటకు రాజబాట
గా మనకెంతో తోడ్పడగలదని నమ్ముచున్నాను.

కం॥ ఉన్నది పరిపూర్ణము లేందెన్నటికిని ఎరుకయనుచు! ఈ రెండు విషయ
ములు మరియు

కం॥ పరిపూర్ణమున్నదని ఎరుక తానెరిగితే ఎరుకే మ్రగ్గును! పరిపూర్ణ గురు
సేవతత్పరులగు మహనియ్యులకు ఈ గ్రంథము యదార్థ అనుభవమివ్వ
గలదు కానీ బ్రహ్మము యొక్క పరిణామమగు విశ్వము సర్వము బ్రహ్మ
మందులయించును బ్రహ్మము మాత్రము శాశ్వతము పరిపూర్ణము అనువా
దులకు ఈ గ్రంథము యేమాత్రము అనుభవమివ్వదు పరంపరా గురువుల
నిర్ణయం ఈ బ్రహ్మము (ఓంకారము) అఖండపుటెరుక! ఇదిమూలంలేక తోచి
నది ఇది యెండమావులయందు జలముతోచినట్లు భ్రాంతి తోచినదే కానీ పరి
పూర్ణమందు యిది పుట్టలేదు లేనెరుక అని సిద్ధాంతము గురుశేవతత్పరులకు
సులభముగా బోధపడగల ఈ గ్రంథము శాశ్వతపీఠ గ్రంథమగునని నా వి
శ్వాసము శ్రీమత్ నిత్యానంద జంగ లక్ష్మినర్సయార్య సద్గురు ప్రభువులకు
మనమంతా రుణపడినామని నా నమ్మకము ఈ గ్రంథ పఠన పాఠమున
అనేక భక్తులు కృతార్థులగుదురని నమ్ముచున్నాను.

జై శ్రీ సద్గురు ప్రభుమహారాజుకు జై! జై! జై

ఇట్లు

శ్రీమద్ నిత్యానంద ప్రభుపాదరేణువు
సహజ విమర్శానంద
తెప్పలి వెంకటనారాయణ

# జండా పాట

ఎత్తండి ఈ అచలజండా అంతరిక్షముపైకి ఎత్తండి
ఈ అచలజండా
అంతరిక్షముపైన అంభలోకముపైన అలలాడుచున్నట్టి
ఆబ్రిహ్మ న్రృషయాని ॥ఎత్తండి॥

1 కులమతములు వీడి కూడిమనమందరము
కలిసిమెలసి జన్మ కర్మబంధములాను
చలగివేసియు అచల సద్గురిని కృపచేత
కలవిధముగ యెరుక కడకు కల్గజేసి ॥ఎత్తండి॥

2 సంసారములోయున్న సారమెంతయొతెల్య
యెంచిచూడగమిన వ్యావందులోలేరు
వంచిమేమనుచాల వడికష్టములచేత
పొంచికూర్చుండెటి పూర్తి యోగముగాదు ॥ఎత్తండి॥

3 గురుభక్తియనియేటి గురుమందిరముగట్టి
గురుడు చెప్పిన అచల గురుగుహ్యమెరిగవల
యెరుకకలయనిదెలసి మెల్కబయులనుగాంచి
పరుగుపరుగున యెరుక పారిపోవుటకునై ॥ఎత్తండి॥

4 దేశదేశంబులలో దిక్కుదిశలయందు
ఆశజ్యోతిదియూని అర్పించిమనమంత
యాశించే యెరుకను యట్టెమ్రృషజెయగను
లేక మాత్రిములోన లీలగా విడిపోవుటకు ॥ఎత్తండి॥

5 ఆశేషముగ జన్మ అరికట్టి కడతేర్చ
విశ్వజనులందారు విడచి అభిమానము
విశాల హృదయంలో విమలజండను బట్టి
మా శంకలనుదీర్చి మమ్ముకడతేర్చనియు ॥ఎత్తండి॥

6 జగతిలో ఈ జండ జంగంక్ష్మినర్పియ్యారుల్
లెగర వేసెనుచూడ వింతగంభరములో
సగటూగమనమంత సరెసరె అనుచూను
ఆగరపుష్పక్షంతలు అర్పించిమనమిపుడే ॥ఎత్తండి॥

ఓం

శ్రీ గురుభ్యోనమః

శ్రీమద్ శివరామ దీక్షిత అచల గురుపీఠ రాజయోగాశ్రమము

నర్సంపేట.

రి. నెం. 1338/83

# కైవల్య రహితాచల బోధ సిద్ధాంతము

శ్లో॥ శ్రీ గట్ల వంశాబ్ధి షోడశపూర్ణచంద్రం
శ్రీ హనుమయార్య పాదకమలామృత పానభృంగం
పూర్ణానంద నామాంకిత దివ్యరూపం
శ్రీ వెంకటరామయార్యం స్వగురుం భజామ్యహం

వ॥ శ్రీ గట్లవంశంబను పాలవెల్లికి షోడశకళాపూరితుండగు చంద్రునితో సమానుడగు శ్రీ మందిప్పల హనుమయార్య సద్గురు పాదపద్మముల యందుండు రసమును యెల్లప్పుడు తుమ్మెద విధముగా! అనుభవించువాడును శాంతిశమదమాలచే మిక్కిల ప్రకాశించే దేవతాస్వరూపుడును నగు శ్రీ వెంకటారామయార్యులని నామముచే విరాజిల్లు వాడునునగు నట్టి శ్రీ సద్గురుమూర్తికి నేను నమస్కరించుచున్నాను. శ్రీమతి రాంబాయమ్మ సమేత శ్రీమత్ అచలఋషి పూర్ణానంద గట్ల వెంకటారామయార్య రాజయోగి స్వగురు పరమగురు పరమేష్ఠిగురు సద్గురు నిజగురు జగద్గురు అతీతగురు అచలగురు పరిపూర్ణగురు పరబ్రహ్మణేనమః

శ్లో॥ ఊర్ధ్వామ్నాయగురోః పదం త్రిభువనోంకారఖ్య సిమ్హాసనం సిద్ధాచార సమస్త వేదపఠితం, షట్చక్రసంచారిణం. అద్వైతస్ఫురదగ్ని మేకమమలం, పూర్ణప్రభాశోభితం, శాంతం శ్రీగురుపంకజం భజమనః చైతన్యచంద్రోదయం.

వ॥ స్థూల, సూక్ష్మ, కారణ దేహములను, మూడు భువనముల పైన మహాకారణ శరీరాంతర్గతమై, ఓంకారమను సిమ్హాసనము పైన, ఆసీనుడై

నట్టియు, సమస్త వేదములచేత, స్తుతింపబడునదియు, ఆధార స్వాధీ ష్ఠాన, మణిపూరక అనాహతము, విశుద్ధ, ఆగ్నేయములను, షట్చక్ర ములాది, గణపతిబ్రహ్మ, విష్ణువురుద్రుడు, జీవుడు, ప్రత్యగాత్మలరూ పముతో, అంతటను ప్రకాశించునదియు, శాంతస్వరూపమైన శ్రీగురు మూర్తిని, మనస్సుతో ధ్యానించుచున్నాను. కనుక శ్రీగురుపాద పద్మముల సేవించుచున్నాను.

శ్లో॥ నమామి సద్గురుం శాంతం ప్రత్యక్షం శివరూపిణం శిరసాయోగ పీఠస్థం ముక్తికామార్థ సిద్ధిదమ్

వ॥ ప్రత్యక్షముగా శివస్వరూపుడును, జీవబ్రహ్మైక్యమనెడి, యోగపీఠమను సింహాసనమందుండి, మోక్షాపేక్ష యొక్క ప్రయోజన సిద్ధినొసంగు వాడునగు సద్గురునుగూర్చి శిరస్సుతో నమస్కరించుచున్నాను, అట్టి గురువు నాకుశాంతిని ప్రసాదించుగాక.

శ్లో॥ ప్రాతశ్శిరసి శుక్లాబ్జే ద్వినేత్రం ద్విభుజంగురుమ్-వరాభయకరం స్మరేత్తన్నామ పూర్వకం

వ॥ జననమరణ ప్రవాహరూపమైన, సంసారభయమును పోగొట్టువాడును, శిరస్సున తెల్లతామర పువ్వును ధరించువాడును, రెండుకన్నులును, రెండు భుజములును. గలవాడునగు, ఆసద్గురువును గూర్చి నామోచ్చ రణ పూర్వకముగా ఉదయకాలమందు తలచవలయును.

## * గురువు *

గురువు అనగా పెద్దది! ఈసమస్త బ్రహ్మాండములయందు నిండి, వీటి అంతర్బాహ్యము నంధంతటయున్నది, గానా? గురువనబడును గు-అనగా గుణము ర-అనగా రూపము. గురువనగా గుణరూపములు లేనిది స్థూల, సూక్ష్మ, కారణ రూపజీవచయంబులు, అజ్ఞాన అవరమనే మహారణ్యములో జిక్కి, సంసార సాగరమనే! జననమరణము లనే, కాలప్రవాహమున, మును గుచు తేలుచు, పరితపించుచు, తప్పుకొనుటకు దరిగానక, విలపించు స్థూల రూపజీవులనుద్ధరించి, భయమును పోగార్చుటకు, అభయమిచ్చిన దైవస్వ రూపమునకు గురువనిపేరు! అనగా, కర్మలు కాలకర్మ చక్రములదిర్చ(84) లక్షల జీవోపాదుల నుండి దిద్ది బోధతెరవు శిష్యునకు, జూపిన దైవస్వరూప

  

నకు, గురుని చెప్పబడును.

శ్లో॥ గురుర్బ్రహ్మః గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః గురుసాక్షాత్
పరబ్రహ్మ తస్మైశ్రీ గురవేనమః

వ॥ గురువేబ్రహ్మ స్వరూపుడు, ఏలాయనగా! శిష్యులయొక్క అంతఃకర
ణయందు, జ్ఞానబీజమును నాటి, మొలకెత్తించి, బ్రహ్మవలె సృష్టికర్త
యగుచున్నాడు. బ్రహ్మము తనయొక్క, నాలుగు ముఖములయందు
ఉండి, నాలుగు వేదములు బహిర్గతములైనవి, ఆవేదముల నుండి,
గైకొనబడిన నాలుగు మహావాక్యముల లక్ష్యార్థమైనప్రత్యగ్బ్రహ్మైక్య
రూపమగు, అధిష్టాన చేతనబ్రహ్మ స్వరూపమును, దర్శింపజేయు
గురువు బ్రహ్మ స్వరూపుడే! గురువేవిష్ణు స్వరూపుడు ఏలాయనగా!
శ్రీ మహావిష్ణువుపోషణకర్తయై, సకలజీవోపాదులను పోషించి, రక్షించు
చున్న విధముగ, సద్గురువు తానునాటిన జ్ఞాన వృక్షమును, బోధామృ
తరసముచే, నిత్యము పోషించుచూ, శిష్యుడు యజ్ఞానావరణములో
తిరిగి నడవకుండా, కాపాడుచున్నాడు, సర్వవ్యాపకోవిష్ణుః అనివిష్ణు
శబ్దమునకు నిర్వచనము, గురువుయనగా గొప్పదగురూపము, గురు
స్వరూపమే సర్వవ్యాపకము! గురువేమహేశ్వరుడు, ఏలాయనగా!
శిష్యునియందలి అజ్ఞానఆవరణమును, నాశనము చేయగలడు సాకార
వస్తువులందు కూడా! ఆత్మదృష్టి పెంపొందించి, నామరూప నానాత్వ
మును లయుపరుచ్చు చున్నారు. కావునా గురువేమహేశ్వరుడు గురువు
సాక్షాత్తుగా పరబ్రహ్మమే త్రిగుణస్వరూపిణీయగు మాయను, తన
యందు గర్భీకృతముగా నుంచుకొని, స్వయం ప్రకాశుడై వెలుగొందు
బ్రహ్మమును, అపరోక్ష సాక్షాత్కారమును, గావించుకొన్నవాడైనందు
నను అట్టి స్వరూపమును తెలిసినవాడు బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి
అనుశృతి న్యాయముగా, గురువేపరబ్రహ్మము ఏకోదేవో త్రిధాభిన్నా
బ్రహ్మ విష్ణుః మహేశ్వరః ఉపాసకానాం హితార్థాయా బ్రహ్మణో
రూపకల్పనః

# శ్రీ బృహద్వాశిష్టము
## చైతన్య నిరసన ప్రకరణములో పేజి నం: 56
# నిజగురువుని వెదకుట
## అందుకే యే గురువును అంటే ఆగురువును నమ్మకు

మూలంలేని ఈగుర్రెరిగే శరీరం అనే ఆవరణము లేని వానిగా చూచి వారిముచ్చటలు విని! వారినడత చూచి వారి దగ్గర ఉన్న శిష్యులను చూచి ఆశిష్యులు శాంతిచేత ఉన్నారా వారిజాడకనుక్కొని వారిజాడచెప్పకపోయినా మీ గురువు యెవ్వరు అని అడిగి వారిజాడ చెప్పినా! వారివద్దకుపోయిచూస్తే మూలంలేని ఈగుర్రెరిగె శరీరం చేసిన శంకర భాష్యం నమ్మియున్నారా లేక ఇతర భాష్యాలు నమ్మియున్నారా గీతాశాస్త్రాలు నమ్మియున్నా! యేదైనా నానామతగ్రంథములను లేక శాస్త్రవాసన దేహవాసన వాసనలను నమ్మియున్నారో! వారినిజూచి ఈభూమండలమునందు మూలములేని ఈగుర్రెరిగె శరీరం లేని అచల స్వరూపులు ఉన్నారని (1) వారి ఆచారమేమి! (2) వారూ రారా! 3 వారిజాడ ఏలాగు 4 వారు పుట్టినారా లేదా 5 వారికి వేదశాస్త్రములు ప్రమాణమా అప్రమాణమా! 6 వారికి తల్లిదండ్రులు భార్యాబిడ్డలు ఉన్నారా లేరా! 7 వారికి కులగోత్రాలు ఉన్నావా! లేవా! 8 వారు ఏలాగున పుట్టినారు! 9 వారికి మూలంయేమి 10 అచలులేలాగు వారు యెవ్వరోకానీ వారిమూలం వారు తెలియరు పుట్టని చావని అచలం ఉన్నదని చెప్పి యేమి లేకపోయిరి యేదిఅని అడుగుదామంటే యెక్కడచూసినా అచలమే ఉన్నది మొదలుకొనలేదు మూలంలేని ఈగుర్రెరిగె శరీరంకు మూలము ఏమీలేదు సముద్రములో ఓడ మునిగినయటు మునిగిపోయెనా కూడ! ఏ సిద్ధాంతం యేమిలేకపోయె! ఇదియేమి ఆశ్చర్యం కలలో దేహంశరె ఈగుర్రెరిగె శరీరం యేమిలేదు అందుకే ఈగుర్రెరిగే శరీరము మూలంలేనిది కలలో ఏనుగు ఎక్కడనుంచి వచ్చెనో! ఎక్కడికి పోయెనో అట్టిచూస్తే అంతా అచలమే ఈగుర్రెరిగె శరీరం ఏమిలేదు అందుకే అచలానికి! శరీరంలేదు లేకుండగానే అందుకే అచలము పుట్టనిది!చావనిది మూలంలేని ఈగుర్రెరిగేశరీరమునకే సకలములు అందుకే అచలులు ఇదిగాక వేదాంతం నమ్మినా! రాకపోకడ తప్పదు అందుకే భ్రాంతిలేని క్రియ పొందేది కఠినము మూలం లేని గుర్రెరిగే శరీరం ఉన్నదని చెప్పినా! భ్రాంతిపోదు ఇటువంటి గురు సాంప్రదాయం దొరికితే

మూలంలేని ఈగుర్రెరిగే శరీరంయేమీలేకుండా సూచన చేస్తారూ! చేస్తే ఒక్క టైనా భ్రాంతి ఉండదు మూలం లేని ఈగుర్రెరిగే శరీరం చెప్పినా మాట ఒక్కటి విన్నా మునుపటివలెనే సకల నిశ్చయాలు ఉండి బాధిస్తు ఉంటాది ఆవరణంలేని గురువు ఆయెనా ఆవరణం లేకుండా చేస్తాడు?

## *శిష్యుడు కనిపెట్టు లక్షణం*

వినేవారికి భ్రాంతిరహితం కాకుంటే చెప్పేవారిదే జాడ్యం ఈ ఉపదేశ మును యెవరి దగ్గర తెలుసుకోక తన దగ్గరకు వచ్చిన వారికి చెప్పితే శీఘ్రంగా అతుకుతుంది శాస్త్రవాసనగలశిష్యుడాయెనా! మూలంలేనిగుర్రెరిగే శరీరం చేసిన శాస్త్రలలో ఉన్నట్టు చెప్పేది ఈగుర్రెరిగె శరీరం మునుపు యేలాగు తాను చెడకుండా చేసుకున్నదో! ఆలాగేచెప్పేది వచ్చేవారి అభిప్రా యంకొద్ది చెప్పేది ఈ రాజమార్గము చెప్పితే జనవిరోధం మూలం లేని ఈగు ర్రెరిగె శరీరం చెప్పినట్టు చెప్పితే?జనరంజనం ఇందుకుసమ్మతం శ్లో॥ సత్యం జనవిరోధాయా అసత్యం జనరంజకం ॥ అసనేనఘుర పింకత్రి నదిక్షిరే గృహే గృహే॥? మూలంలేని ఈగుర్రెరిగె శరీరం తనకు తనవంటివారికే! సమాధానం అయ్యేటట్టు నానామతములు అనేక శాస్త్రములు అనేక శృతులు అనేక భాష్యములు కొందరికి వకశేరు యెవ్వరిది వారిదే దొడ్డది అనీ సమా ధానం చేసి తనమూలం తెలియకుండా ఆచార్య స్వాములమని పేరుబెట్టుకొని ఈ మూలములేని గుర్రెరిగె శరీరమే పద్వైతమని కల్పించినది ఇదేభాగవత సాంప్రదాయం యని వకభాష్యం చేసినది ఈమూలంలేనిగుర్రెరిగెశరీరమే మెచ్చుగానీ మెచ్చుశాస్త్రలు మెచ్చుభాష్యా చేసినది ఇంతేగానీ పుట్టనిది చావనిది అచలం శరీరం లేనిది గనుక ఏశాస్త్రలుచెప్పలేదు శాస్త్రలు చెప్పి నవారు చెప్పినట్లు నడువకుంటే కోపం నడువకుండినాసరేనన్న విడవకుండినా సరే? నాకూ మూలంలేదని యెవ్వరూ అనుకొందురో అనే యింత విస్తారంగా చెప్పి చేతపట్టుకొని ఈలా.సునఉన్నా కానీ మూలంలేనిగుర్రెరిగె శరీరం తప్పగ అచలం ఉన్నదని విని బయలుపడెనా! నీళ్ళలోనుంచి చేప బయటపడి చచ్చినట్లే ఏప్పటీ అచలమే ఇంతేకానీ! ఏసాధన ఏశృతి ఏయుక్తియు అను భవము పనికిరాదు! మొదలుకొనలేక తనకుతానే స్వతసిద్ధమైయున్నదిగనుక ఉన్నదే ఉన్నది అచలంగానీ రెండవదానికి మూలములేదు ఇందుకు భూమం డలమందు భ్రాంతిలేనివారు ఉన్నారేమోనని తెలుసుకో.ుయును వెదకి చూచి వారితోకూడా ఉండి వారిజాడ కనుక్కోవలెను కనుక్కోక మూలం

లేని ఈ గుర్రెరిగె శరీరమే నేనుయని నమ్మియుండెవా గుర్రెరిగె యముడిక వలె పడిపోతాడు బాహ్యమందు గురుతెరిగే పందివలె చస్తాడు వైరాగ్యంచేత సన్యసించెవా గుర్రెరిగె గాడిదవలె! ఉండి చస్తాడు యోగభ్యాసము చేసెనా గుర్రెరిగే దొమ్మరివారివలె సాధించి పక్కనాడుపడి చస్తాడు వాయువుధారణ చేసెనా! గుర్రెరిగే పాముంవలె ఉండి చస్తాడు కర్మలు చేపేవా గుర్రెరిగేపంచ బ్రహ్మలవలె 1 చాకలివానివలె 2 మంగలివానివలె 3 మేదరివానివలె 4. కుమ్మరివానివలె 5 మాదిగవానివలె ఉండి చస్తాడు యేమిచేసినా మూలంలేని ఈగుర్రెరిగె శరీరం ఏమీలేదు అని చెప్పినవాడే అచలుడు ఈ గుర్రెరిగె శరీర ము ఏమిలేదు అనిసర్వకాలం యెఱతెగక నిదుర వచ్చేదాకా మరువక చచ్చే దాకా అభ్యాసము చేసేవాడూ! పుట్టని చావని అచలముగానీ! మరొకటిగాదు ఇది నమ్మినవారికి రాకడపోకడలేదు ఇదిగాకాఈమూలంలేనిగుర్రెరిగెశరీరము చేసిన మర్యాదవినెనా గుర్రెరిగె పెద్దపులివలె ఉండి చస్తాడు మూలంలేని ఈ గుర్రెరిగె శరీరం చేసిన మర్యాదనమ్మెనా పంకెళ్ళు తగిలినట్టే మోక్షభ్రాంతి అయిన తగిలి శాస్త్రవాసనచేత లోకాంతరగతమై తగిలి దానంతవాడై శరీ రమనే నరకాన్ని విడవబడక మునిగితేలేది సుషుప్తియనే అంధకారములో సుఖమనే దురాశచేత మూలంలేని ఈగుర్రెరిగే శరీరం తప్పినా తప్పకుండా అతుకుబెట్టుకొని నేను దొరననీ గుర్రెరిగె యేనుగువలెయుండి చస్తాడు శీఘ్ర ముగా గుర్రెరిగే శరీరములేని అచలం కానీ ఉన్న గురువును వెతుక్కో వడంవెతుక్కొని వంచనలేకా సేవజేసి తానూ లేకపోవలెను.

---

శ్రు॥ ఈ ఉత్త బట్టబయలు ఏమీలేదు.
శ్రు॥ మూలములేని గుర్రెరిగే శరీరం ఏమీలేదు.

ఇంతకంటే అధికము లేదు. కోటిమాటలకుయిదే నిజము, ఏది అంతటా యుండునో, అదితప్పక సత్యమైన యుండును సత్యమైనది ఏదో అదినిత్య మైయుండును ఏదిసత్యమైనిత్యమై యున్నదో అదికదలదని సిద్ధాంతము. కదలనిది, అచలమని, చెప్పబడును. అదిదేశకాలవస్తులకన్నింటికి, బయట యున్నది, గాన బయలని నిర్ణయించినారు. బయలుగానున్న ఆకాశము ఆత్మలకు బయటనున్నది. మరియు బ్రహ్మమునకుకూడా! బయటనున్నది. గాన బట్టబయలు అనబడును. అంతటా ములుగ్రుచ్చ సందులేక రెండవది లేకయున్నదిగాా పరిపూర్ణమని నిర్ణయము దానికి మాత్రము, నామరూప నటనలులేవు ఎరుక తనగ ర్తక, పైన నిర్ణయించిన పేర్లు పెట్టుకున్నది పేర్లు

పెట్టకున్న యెరుక, బయులును తెలుసుకోలేదు తనరహితమునందే తెలియ బడునెవెూగాని, తానున్నప్పుడు తెలుసుకోలేడు

కం॥ బట్టబయులనుచు దీనికి మొట్టమొదలు పేరులేదు, ముదమున యెరుకే, పుట్టిపేర్పెట్టి దీనిని పట్టుకల వ్యాడలేక పారిపోవునురా! కనరాదిందు దూరానే రదురా! పుట్టి చచ్చుచుమళ్ళీ బుట్టిగిట్టుచు బుట్టూగిట్టి తిప్పలనొందూయెరుకే బయులునుజూస్తే పారిపోవునురా! కనరాదిందూదూరనేరదురా?

**తాత్పర్యము:** అనునట్లు అచల పరిపూర్ణమనునది, యెరుకకు గొప్పస్థానము గాని, పదవిగానికాదు, అదిదేశకాల వస్తువులవలె, పొందదగినదికాదు, పదార్థ రూపమున పట్టుబడునదికాదు, ఎందుకనగా! అచలపరిపూర్ణపరబయులు, తనంతటతాను ఏదియులేక, తనకైతానే స్వతసిద్ధమై నిత్యమై, సత్యమై, శుద్ధమై కదలక, బెదరక, చెదరక, వరుగక, కరుగక, తరుగక మార్పుజెందక అచలమై పరబయులగుచు, పరిపూర్ణమై రెండవది యుండుటకు, చోటుయివ్వనిది! అందు యేదియు దూరజాలనిది ఇతరమేమియులేక, యున్నదానియందు లేకనే తనకైతానే, యెండమావులందు జలములేకపోయినను, జలము కలదని భ్రమతోచినటుల, త్రాడుయందు పాముతోచినటుల, స్థాణువుయందు మనిషితో చినటుల, గొడ్రాలుబిడ్డవిధముగా యెరుకయనుగుర్తుతోచినదితోచినతోడనేఆకాశ పుష్పవిధతనముగా తనయందు దేశకాలవస్తువులుగా, పరిణమించినదిఅదియెలా యుఅపుడునగా దేశకాలవస్తువులు లేవుఅంతరిక్షముఆకాశములేదూఅపుడు యెవ్వరుయెవరనియెక్కడ ఎందుకొరకుఆవరించుకొనియుందురు, ఈగహనగంభీరమ గుఅంభస్సుమాత్రమెక్కడదియని, ఋగ్వేదము10 దశమండలము 127వ ఖండమున నాసదీయసూక్తము, చెప్పుచున్నదిగావా, ఏతన్మిథ్యాశుద్ధవియత్ కించినాస్తి!యని, ద్వాదశి చెప్పుచున్నది ఏలయనగా, ఏతస్మిథ్యా ఇది ఉత్తది శుద్ధ పవిత్రమైనవియత్ బయులు-కించిన్!ఏమియు నాస్తిలేదు అనగా ఈ మిథ్యాస్వరూపమైన యుగుపడు దేశకాల వస్తువులు దానికి మూలమైన ఏరుక, మిథ్యయై అనగా ఉత్తదియగును శుద్ధవియత్(బట్టబయులు)బయులన దాని సర్వమునకు బయుటయున్న, ఆకాశమునకు, బయటగల పరమాత్మ యగు; ఏరుక బ్రహ్మమునకు అనగా బయులుకు బయలైన బట్టబయులనబడు చునిండి నిభిడీకృతంబై, ముల్లుగుచ్చ సందులేనిదై యుండెను కించినాస్తియనగా అందుసర్వవ్రజ్ఞగల అధిష్టానము చేతనబ్రహ్మమందు తెలివి దాని యందు దేశకాలవస్తువులును, ఏమిలేమ కించిన్ ఏమాత్రము నాస్తిలేదుయని

త్రితియుక్త మంత్రములనగా ద్వాదశాక్షరీమహామంత్రము చెప్పుచున్నది లేనిమెరుక ఏమిలేకపోయినను యున్న అచలపరిపూర్ణము పరబయలు యుండియే యున్నది దానిని తెలుసుకొనుటకు ఏరుకలేదు దీనిని కందపద్యములో చెప్పుచున్నది.

కం॥ నిరుపాధికమగుబయలున-మరిలేకనెకలిగినట్టి మారుతమునకే-పరియాయనామములునగు-కరువలియన ఏరుకయనిన కడుమాయయనన్ (87)
కం॥ కదలడట పరమపురుషుడు కదలిక మాయయుట యిట్టి కదలిక కేదో!
మొదలన పెద్దలు బలికిరి కదలనిదే కలదు లేదు కదలిక యెపుడున్ (31)
కం॥ పరిపూర్ణములో దోచిన మెరుకే కలలేని యెరుక నెరిగిమృషని యీ మరుగెరుగ కెరుక దెల్పిన యెరుగుటయే మేల్కసుమ్మి యిదియేమారకమీ సద్గురూ నాజ్ఞకెదిరీమీరకమీ యెరుక యీరీతిగా యెగిరి పోయినవెనుక పరిపూర్ణమొకటుండు పలుకారాదెల్లందు నిదియేమారకమీ సద్గురూ! నాజ్ఞ కెదిరీ మీరకుమీ (151)
కం॥ నేననని బ్రహ్మలోపల లేనిదె సంభవమునొంది లీలతనకుదా మేనుజగములై వెలసెను నేనదిమృగ జలముఁరీతి నిజముగాదనుచూ లోకులు బల్కే గజబిజి వినుచూ మానాసమున వారిమాటకా మోదించి దానికిబోధాకు తగునంచూ వినజేస్తి నిజముగాదనుచూలోకులబల్కే గజిబిజి వినుచూ (150)

అచలపరిపూర్ణపరబయలునందు చిజ్జడ కల్పన లేనేలేదు లోకులు భ్రమచేయున్నదని కల్పనజేసి చెప్పుకొనుమాటలు వేదశాస్త్రములయందు గజిబిజిగా ఉన్ననూ వారిమాటలకామోదించి యమియండమావులయందు అగుపడు జలముఁత్రాగి దప్పిక తీర్చుకొన్నామని చెప్పువారిభంగిగానున్నది అదినిజముగా శోధించిన లేనేలేదను పెద్దల నిర్ణయ ప్రకారముగా తెలిసినయెరుక మృషయేనని వారిమాటలతో ఈరీతి నిర్ణయించడమైనది. ముందు సద్గురుస్వాముల సేవించి వారి అనుగ్రహముచే ఉన్న అచల పరిపూర్ణ పరబయలను తెలిసికోవలసి యున్నది అందులకు శ్రీకృష్ణదేశికేంద్రులవారు సెలవిచ్చిన కందపద్యములు

60 కం॥ బయలెపుడు పుట్టిగిట్టదు బయలెప్పుడు ముట్టుకోదు బ్రహ్మాండంబున్ బయలెప్పుడు నన్నెరుంగదు బయలెప్పుడు చేయబోదు పనులేవ్వైనన్

61 కం॥ బయలనినిత్యవస్తువు బయలన నాలోరీతినుండు బ్రహ్మాండంబున్

బయలనిన కండ్లబడనిది బయలన బ్రహ్మాండమవల బరగెదిసుమీ!
62 కం॥ బయలనిన నేనులేనిది బయలనవుపాధిగానబడనిది యెపుడున్,
బయలనిన పల్కులేనిది బయలిట్టిదియనుచు తెలియబడదెవ్వరికిన్!

## అచల పరిపూర్ణ పరబయలుండు పద్ధతి

ద్వాదశాక్షరి యనగా ద్వాదశవాక్యములచే నిర్ణయించి శ్రీభాగవతుల కృష్ణదేశికులవారు సిద్ధాంతము చేసియున్నారుగాన దీని వివరణ సద్గురు దేశికస్వాములవారిచే వినవలసియున్నది నాసద్గురుప్రభువరేణ్యులగు శ్రీఅచలర్షి దయానందస్వాములరాజయోగీంద్ర సద్గురు సార్వభౌములవారు నాకుప్రబోధించిన విధానము ఇందుతెలియజేయుచున్నాను. పైజెప్పిన ఒక్కొక్క వాక్యమును విమర్శించి తెలిసికోవలసియున్నది నిర్ణయ వాక్యములు యెలాతెలుసుకోవలయుననిన మనకు అవసరమగు విలువగల వస్తువు బంగారమో లేక మణులచే పొదుగబడిన బంగారువస్తువో దానిని భద్రపరచుటకు నొకగుడ్డలో కట్టి ఆకట్టినగుడ్డమూటను చిన్నపెట్టెలో లేక డబ్బాలో పెట్టి ఆ చిన్నపెట్టెలేక డబ్బాను కర్రబీరువాలోనో లేక ఇనుప బీరువాలోనో పెట్టి భద్రపరచెదరు ఆ వస్తువు యెవ్వరికి అగుపడదు దాచినవారికి మాత్రము అగుపడకపోయినను గుర్తుకు గోచరమగును. ఆ వస్తువు తిరిగి అవసరం గలిగినప్పుడు ఆ వస్తువు యెక్కడ పెట్టినామో తీసుకరమ్మనిన యినుప బీరువాలేక కర్రబోషాణము నుండి చిన్నపెట్టెలేక డబ్బాను బయటికితీసి దానియందుంచిన గుడ్డలో కట్టబడిన వస్తువును పైకి తీసినను యావస్తువుమనకంటికి అగుపడదు. ఆవస్తువును కప్పియుంచిన గుడ్డ ఆవరణమును తీస్తేగాని ఆవస్తువు మనకు ప్రత్యక్షముగా యగుపడను. ఆ విధముగ బీరువాయనగా బ్రహ్మాండము చిన్న పెట్టెయను పిండాండమును తీసి దానిచుట్టు ఆవరణముకప్పిన .ఆత్మపరమాత్మలయొక్క ఆవరణము తీసివేసిన వారికి అచలపరిపూర్ణపరబయలు ప్రత్యక్షముకాగలదు గావా అచలపరిపూర్ణపరబయలు ఆత్మపరమాత్మలయొక్క ఆవరణముచే మరుగు పరచబడియున్నది. జననమరణ రహితమునుగోరు సుజనులు, సద్గురుస్వాములకు చతుర్విధశుశ్రూషలు చేయుచు తనుమనధనములర్పించి వారిని సంతోషపరచి వారిఅనుగ్రహమునకుపాత్రులయిన వారికి గురుమూర్తి వారిని కనికరించి ఆత్మ సరమాత్మల ఆవరణము తీసివేసి మరుగు పరచబడిన ఆనిజ పరిపూర్ణపరబయలును ప్రత్యక్షమొనరించి జన్మలకు మూలమగు పదార్థము

ఆత్మ పరమాత్మలనే యెరుకను విడిపించి భ్రాంతి రహితులుగా చేయుదురు. ఈ ఆత్మ పరమాత్మ స్వరూపమైన యెరుకను యెవ్వరుకూడ విడిపించలేరు "యెరుకను విడిపించలేరు యెవ్వరు ధాత్రిన్ గురుడొకడుతప్ప" అనిశ్రుతివాక్యమునుబట్టి గురుడే సమర్థుడు అనిభాగవతక్రిష్ణదేశిక ప్రభువరులుసెలవిచ్చియున్నారుగానా తమతమ గురుప్రభువుల సేవజేసి నిజమును ప్రత్యక్షపరుచ్చ కోగలరు మీరందరూ గురుపుత్రులేగానా మీకు సులభముగా బోధనడుటకు శ్రీమద్ అచలర్షి దయానంద పాన్నాలరాజయోగీశ్వర ప్రభువులసేవజేసి గ్రహించిన అనుభవము పైకందపద్యములకు అందులో(12)పండ్రెండు పాదముల కొక్క వాక్యమును విమర్శించి తెలిసికొన్నదానికి వ్యాఖ్యానము వ్రాస్తున్నాను. మీరు తెలుసుకొనుటకు సులభ సాధ్యము కాగలదని తలంచి ఒక్కొక్క వాక్యమును విమర్శించడమైనది.

1) బయలెపుడుపుట్టిగిట్టదు: ఇది ప్రథమవాక్యము ఏలాయనగా పిపీలికాది బ్రహ్మవరకు బ్రహ్మము తప్ప అన్నీ పుట్టిగిట్టు చుండునవియేయని అందరికి తెలియుచునేయున్నది బ్రహ్మము మాత్రము స్వయంభుః తనకై తానేతోచిన దని పెద్దలకు మతాచార్యులు మరియు శాస్త్రనిర్ణయము [illegible]చినదనినా పుట్టిన దనినా సమానార్థమేకాని మతాచార్యులు నిర్ణయించి ద్వైతము పరబ్రహ్మం విచారించగా పుట్టినదనే చెప్పవచ్చును వారుయిాలేక తోచినయెరుకనే శాశ్వతమని స్వయంభూః యని చేతన బ్రహ్మమని స్వయంప్రకాశమని అధిష్టాన బ్రహ్మమని సాక్షియని తెలియజేయుచున్నారు అదిసృష్టి చేయుటకు అనేక పరిణామములు పొందినదని అవతారములనెత్తినదని దాని సంకల్పమాత్రముననే ఈసృష్టి జరిగినదని అనేకగ్రంథరాజములు వ్రాసినారు వేదములను మహాఋషుల అంతఃకరణములయందు ప్రవేశపెట్టినదని ఋషులకనిపెట్టవచ్చునేమోగాని అతనికినామరూపములులేవని నిర్ణయించినారుకదా నామరూపములులేని దేవుడుఅతనికి శరీరమేలేనప్పుడు ఏలావ్రాయగలడుఏలా అంతఃకరణములలో ప్రవేశపెట్టగలడు ఋషులువారితెలివికి కనిపెట్టవచ్చునేమోగాన నామరూపములు లేనివాడు ఏలాచెప్పగలడు చెప్పవలయునని నోరుండవలయునుకదా నోరుండుటకుశరీరముండవలయునుకదాశరీరమంటేపుట్టినటువంటిదేకదాపుట్టినచో గిట్టకతప్పదుపోనీ స్థూలశరీరము మాత్రములేదందురేమో సూక్ష్మముగానో, కారణముగానో, మహాకారణముగానో సుండవలయునుగదా

ఏపక్క శరీరమున్ననూ మిగతాశరీరములను తాకూర్చకొనును. అనగా పుట్టగలవని తెలియుచున్నది పుట్టినది గిట్టక తప దు జాతస్య మరణంధృవం। రాముడు, కృష్ణుడు, బుద్ధుడు, జైన్యుడు. వెంకటేశ్వరస్వామి. రాజలింగేశ్వరుడు, రుద్రుడు, ఈశ్వరుడు. వీరభద్రుడు, షణ్ముఖుడు, స్వామిఅయ్యప్పనవాశివుడు, బ్రహ్మ. విష్ణువు, వీరికందరికి అనగా ఇందులో కొందరికి తల్లిదండ్రిలు భార్యాపిల్లలు ఉన్నట్టు బ్రహ్మవారిగా కొందరూ ఉన్నట్టు తెలియుచున్నది. వీరందరూ పుట్టినవారేకదా। వీరందరికి శరీరమున్నదని దృడమగుచున్నది. నామరూపనటనములున్నవని వారి చరిత్రలే తెలుపుచున్నవి. దేవుడయితే పుట్టుటయేమిటి అవతారముఎత్తుటయేమిటి వీరందరికి శరీరములున్నవేయని నిర్ణయంకదా వారుపుట్టినవారేకదా। నామరూపనటనలున్నవారందరూ పుట్టినవారేయని వేరే చెప్పనవసరము లేకనే గ్రహించగలరు గాని అచలఋషులచేనిర్ణయించబడినపరిపూర్ణపరబయలుపుట్టిగిట్టబోధనిపత్రివారిముందుంచిన వారంతటవారే మతాచార్యులచే నిర్ణయించిన బ్రహ్మము పుట్టిగిట్టుటకలదని అచలఋషులచే నిర్ణయించబడిన బయలు పుట్టిగిట్టుబోదని తెలియజేయగలరు. పుట్టిగిట్టని దానికి పేరులేదు

తం: దేహకారముగానిది సోహంభావము లేనిదఖిలజనులుతా సోహం, సోహంబనినను మోహముజెందనిది బయలు మొదలెరుగవలెరా యెరిగిన యెరుక తుదకరుగవలెరా। కోహంక స్త్వంబాని కూతలుగూసేటి దేహిదేహములోను తెలియనిదీ బయలు మొదలెరుగవలెరా యెరిగిన యెరుక తుదకరుగవలెరా. యెరుకే తన గుర్తుకు బయలను దానికి పేరు పెట్టబోయి శూన్యమైపోవుచున్నదిగానా ఈమతాచార్యులచే నిర్ణయించబడిన దైవము అచలఋషులచే నిర్ణయించబడిన పరిపూర్ణపరబయలును యెంతటివారిముందుంచిన వారు తమంతటతామే మతాచార్యులచే నిర్ణయించబడిన దైవము పుట్టిగిట్టునని అచలఋషులు నిర్ణయించిన పరిపూర్ణము పుట్టిగిట్టదని నిర్ణయించి నారుగానా బయలెపుడు పుట్టిగిట్టదని ప్రథమ వాక్యము.

2వ వాక్యము, బయలెప్పుడు ముట్టుకోదు బ్రహ్మంచంబున్ ఇది ద్వితీయ వాక్యమై యున్నది. ఈ నిర్ణయమెలాయనగా మతాచార్యులు నిర్ణయించిన దైవము అష్టప్రకృతులచే పిండబ్రహ్మండములు నిర్ణయించి వాటియందు తాముండికూడా లేక అంటుకొని ముట్టుకొని బ్రహ్మండములకు తన సత్తానిచ్చి లేక యాజ్ఞయుందుంచుకొని సృష్టిస్థితిలయాదులు చేయుచున్నాడని సర్వోతో

ముఖమున తెలియజేసినారు. గానా అధిష్టానముగానుండి నామరూపరహితమై
కండ్లులేకనే చూడగలదని శ్రోత్రములు లేకనే వినగలడని కాళ్ళులేకనే నడువ
గలడని నోరులేకనే మాట్లడగలడని చేతులు లేకనే సమస్తము యివ్వగలడని
యు తీసుకోగలడనియు అనేక శ్రుతులద్వార తెలియజేసినారు. అచలబుధు
లచే నిర్ణయించబడిన అచల పరిపూర్ణ పరబయలు బ్రహ్మాండమును అంటుకో
వడముగాని, తనసత్తా యిచ్చుటగాని, అధిష్టానముగానుండుటగాని, చేయ
బోదు. అధికారము దేనిపైనను చేయబోదు చేయునదిగాదుగాన బయలెప్పుడు
ముట్టుకోదు బ్రహ్మాండంబున్.

కం॥ సామర్ధనమేమిజూపదు కామక్రోధాధికములు గలదనిశమే బాములెరుంగ
దు యితరులుయేమనినను మారుబల్కాదది బట్టబయలూ దీనికిమ్రొక్కెరితర
జేజేలు నామరూపక్రియానటనలన్నియు మీరియేమాని యనరాక ఏకమై
యున్నది యీబట్టబయలూ దీనికిమ్రొక్కెరితరాజేజేలు.

3 తృతీయ వాక్యం: బయలెప్పుడు నన్నెరుంగదు ఇది తృతీయ వాక్యము
అదిఏలాయనగా! నన్నునిన్నునేను నీవుయను వాక్యములు జీవేశ్వరుడైయు
యున్నవి. ఏలాయనగా నేనెవ్వడనను జీవుడు నేనేనేనను శివుడు ఈరెండ
నకస్ తానుండు అని పెద్దల నిర్ణయము ఏలాయనగా తనను తానుతెలియక
నేనెవ్వడను ఏలావచ్చాను ఏక్కడికి వెళ్ళాలి యనువిషయములచే జీవుడు
మరుపుజెంది తపించుచుండును. నేనేసర్వమును జీవులన్ని నాచేతనేసృష్టింప
బడినవి నాయాజ్ఞయందున్న జీవులన్నీ నా చేతనే సృష్టింపబడినవి నాయజ్ఞ
యందున్నజీవోపాదులన్ని జీవులన్ని నాచేతనే సృష్టింపబడినవి నాయాజ్ఞయం
దున్న జీవులుసుఖములనుభవించెదరులేనిచో దుఃఖములబొందబడగలవని తాము
తెలిసి జీవుల కష్టసుఖములను తెలిసికొనుచున్న కారణరూపమునున్న నేనే
నేననుచుండును ఈ రెండుకూడ అనక సాక్షిరూపముగానున్నానని బ్రహ్మ
ము తలంచుచుండును అచలబుధులచే నిర్ణయించబడిన పరబయలు నేనెవ్వ
డనని జీవుడన్న విధముగాగాని నేనేనేను అని ఈశ్వరుడన్న విధముగాగాని
తాననే తాటస్థచేతన బ్రహ్మమనునటులగాని అనబోకతలచబోక నన్నెరుంగ
దని నిర్ణయించినారు ఇదితృతీయవాక్యముగా యున్నది.

4 చతుర్ధ వాక్యము: బయలెప్పుడు చేయబోదు పనులెవ్వైనన్ ఈ విషయ
మేలాయనగా పిండాండాధిష్టానమైనప్రత్యగాత్మస్వరూపుండైన జీవుడుజ్ఞానేం
ద్రియములచే విషయపంచకము తెలుసుకొని అంతఃకరణమునందుంచి అంతః

కరణప్రకారమైన తెలివిచే యుక్తాయుక్తములనెరగి కర్మేంద్రియములచే విషయసంపూర్తి చేయజాలక యెనుబదినాలుగులక్షల జీవోపాదులయందు జన్మలుపొందుచుండును బ్రహ్మాండాధిష్టానముగానున్న పరమాత్మస్వరూపుడైన ఈశ్వరుడు జీవులకర్మాను సారఫలంబుల నిచ్చుటకు రాత్రిపవళ్ళు అనే నిర్ణయము లేక కర్మాచరణమునందుంటున్నాడు అచలఋషులచే నిర్ణయించబడిన అచలపరిపూర్ణ పరబయలు ఇట్టిపనులెవ్వియయినుగూడ చేయబోదని చతుర్ధవాక్య నిర్ణయము

5 పంచమ వాక్యము, బయలనిన నిత్యవస్తువు ఇదియెలాయనగా కాలత్రయసాక్షిగా పరమాత్మ అవస్థాత్రయసాక్షిగా ప్రత్యగాత్మ నిత్యమునిలకడలేక రాత్రిబవళ్ళు తిరిగినటుల ఏనుగుతొండము ఏప్పటికి కదిలినటుల చలించుచుండునట వలన అనిత్యమని చెప్పబడునుఅచలఋషులచే నిర్ణయించబడిన అచలపరిపూర్ణపరబయలు ఏట్టిమార్పులు చెందకయే ఉపాధిలోజేరక కదలిక యేలేక అచలమై నిత్యమై సత్యమై యున్నదిగాన బయలనిన నిత్యవస్తువు యని ఐదవవాక్యముగా చెప్పబడినది.

6 షష్టమ వాక్యము, బయలననొకరీతినుండు బ్రహ్మాండములోన్ అని ఆరవ వాక్యము ఏలయనగా జీవజగదోపాధికి మూలమైన గురు పరమాత్మవిరాట్టు హిరణ్యగర్భ అవ్యాకృతుడుగాను బ్రహ్మాండమునందు విశ్వతైజస ప్రాజ్ఞలుగాను పిండాండమునందు పరిణామములు పొందుచుఅనేకరీతులగా బ్రహ్మాండములో రాత్రిబవలు తిరిగినటుల బహురీతులుగా నుండును అచలపరిపూర్ణపరబయలు బ్రహ్మాండ బ్రహ్మము చెంచలమై అనేకరీతులుగా నున్న ఆ బ్రహ్మాండములో యెట్టిమార్పుజెందక ఏకరీతిగానున్నదని ఆరోవాక్యము చెప్పుచున్నదిగాపునా బయలనగా నొకరీతినుండు బ్రహ్మాండములోన్

7 సప్త వాక్యము బయలనిన కల్పించబడనిది యిదిసప్తమవాక్యమైయున్నది ఏలయనగా అంతఃకరణముయొక్క పరిణామముయగు నేత్రేంద్రియము అంతఃకరణమునకు పరిసోవువస్తుసముదాయములనే చూడగలదు అనగా శబ్ద స్పర్శ, రూప, రస, గంధ యుక్తమగు అంతఃకరణము నేత్రేంద్రియముచే వాటినే చూడగలదు తెలిసికోగలదుగాని తన్మాత్రరహితమైన అచలపరిపూర్ణ పరబయలును ఏలాతెలిసికోగలదు దానికి నేత్రేంద్రియముగాని దానిసూక్ష్మ పరిణామమగు అంతఃకరణముచేగాని దానిమూలమగు గుర్తుచేతనబ్రహ్మము తోగాని తెలిసికొనుటకు సాధ్యముకాదు కావున బయలనకల్పబడనిదియని

సప్తమ వాక్యముగా చెప్పబడినది.

8 అష్టమ వాక్యము: బయలన బ్రహ్మాండమవల బరగెడిదిసుమా ఇదిఅష్టమ వాక్యమైయున్నది ఏలయనగా బయలుయనగా బయట బహిః ప్రదేశము అని అందరికి తెలిసిన విషయమే ఆడువారికిపిల్లలకు చిఃరికి పశువులకాపరికి కూడ బయలుతెలిసియేయున్నదనవచ్చును యనిచెప్పినమీకు ఆశ్చర్యము కలుగవచ్చును ఏలయనగా పశువులు మేయుచుమేయుచు మరుగు ప్రదేశమునకు వెళ్ళితే ఆ పశువుల కాపరి తనసహచరుని పిలిచి ఆపశువులను ఆబయలులోకి కొట్టరా అని అజ్ఞాపించును వానికి బయలు తెలియనిదే ఆబయలు ప్రదేశమునకు పశువులను తోలుమని ఎలా అంటాడు. కావున బయలు యనగా వారికి తెలిసియేయుండును తెలియనిది ఏలా అంటాడు. ఆడువారికి ఏలా తెలుసునంటావా పిల్లను మలవిసర్జనజేసితే పెద్దపిల్లనుబిలచి ఈ పిల్ల బయటకు పోవుచున్నది అనగా అంతరమునవున్న మలము బాహ్యమునకు వచ్చినదని అర్ధము ఈ పిల్లలు ఇంటిలోనుండి ఇంటిబయటకు తీసుకొనివెళ్ళమని చెప్పుదురు అప్పుడు యింటిచుట్టు బయలేయున్నదని వారికి తెలియునని చెప్పవచ్చును మనుష్యులు ఉదయమున లేవగానే చెంబుతో నీళ్ళుతీసుకొని బయటకు వెళ్ళివస్తామని చెప్పుచుండుసు అదిమనం నిత్యం చూస్తూనే యున్నాము వారికి బయలు తెలియనిదే బయటకు వెళ్ళివస్తామని ఎలా చెప్పును. కావున వారికి బయలు తెలిసియేయున్నదని ఘంటాపదముగా చెప్పవచ్చును యీబయలు గ్రామమునకు బయట యనితెలిసుకోవాలి అలాయనిశరీరమునుండి బయటకు ఇంటినుండి బయటకు మరుగునుండి బయటకు మండలమునుండి బయటకు జిల్లానుండి బయటకురాష్ట్రమునుండి బయటకు భారతదేశమునుండి బయటకు ప్రపంచరూపభూమి నుండిబయటకు జలము జలమునకు బయట అగ్ని అగ్నికి బయటవాయువు వాయువునకు బయట ఆకాశముఆకాశమునకు బయటసూత్రాత్మ సూత్రాత్మకు బయట అధిష్టాన చేతనబ్రహ్మముబయలుగా నున్నదిఇవియన్ని, ఓకదానిచుట్టు ఓకటిబయలు గానున్నది. కావున బయలు యనునది బ్రహ్మాండములో యంతటా,ములుగు గ్రుచ్చుటకు సందులేక, యీబయలుయున్నది. యీబయలునే గురుమూర్తి, మనకు సూచన చేయునది. చూపించె బయలుకాదు యిది. ఇదిఓకదానిబయటయున్న, అదిమరొక దానిలోనయున్నది. కావున శిష్యునికి, సంశయరహితము చేయుటకు, అతనికి మొత్తము ఆవరణమునే ఖండించి, తీసివేసి

బ్రహ్మాండమవలికి తీసుకొనివెళ్ళి, సూచనచేయును, కావున ఇంతవరకు మన మనుకొన్న బయలు, బ్రహ్మాండములో యున్నది. ఈ బయలు ఉత్పత్తి,స్థితి, లయాదులకు మూలకారణమగుచున్నది కావున గురుమూర్తి దయకు పాత్రుడయిన శిష్యుని, తన గురుసత్తాచే, ఉపాయముచే, బ్రహ్మాండమునకు అవలతీసుకొనివెళ్ళి, నిజబయులను సూచనచేయవల్లయును. ఆ విధముగా సూచనచేసిన, శిష్యుడు తన జనన మరణములకు, మూలముగానున్న యెరుకను విడువగలడు. బ్రహ్మాండములోపలయున్నది బయలుకాదు,అది మరుగు ఆ మరుగులో భ్రాంతియనే, పులుల బారినుండి రక్షణ పొందగలడు, కావున బయలన. బ్రహ్మాండమవల బరిగెడిది సుమీయని, అష్టమ వాక్యము.

నవమ వాక్యము: బయలనిన నేనులేనిది. యిది నవమ వాక్యమైయున్నది ఏలాయనగా, నేను, యనునది, అహం,అని అందరికి తెలుసు. ఈవిషయమే అహం అని, సంస్కృతంలో, నేనుయని, తెలుగులో చెప్పబడినది. కావున నేను అనగా। అహం అని తెలుసుకొంటిమి. ఈ అహం అనునధి. జీవోహం అని పిండాండమునందు జీవునిది. శివోహం అనువాక్యము, విశ్వాండములోని ఈశ్వరునిది. బ్రహ్మోహం యనునది. బ్రహ్మాండమునందలి చేతనబ్రహ్మము ఈ విధముగా, పిండాండము, విశ్మాండము, బ్రహ్మాండములో నున్నప్పుడు, నేను అని పలుకుచుండును. ఈ త్రివిధదేశములందు, నేనని చెప్పుచుంటిమి బయలునందు. నేననునదేలేదు. కావున అందు జీవోహం యనిగాని, శివోహం యనిగాని, బ్రహ్మోహం యనిగాని. చెప్పుటకు వీలులేదు బయలు యెప్పుడును నేనుయని యనదు అని నవమ వాక్యము కనుక బయలెప్పుడు నేను లేనిది యని చెప్పబడినది.

దశమ వాక్యము: బయలనిన ఉపాధి గానబడనిది యెపుడున్ అని దశమ వాక్యముగావా ఏలయనగా, యేయుగమునందుగాని, యేదేశమునందుగాని యే కాలమందుగాని, ఉపాధిగానుండదు. ఏలుక జీవుడుగానున్న పిండాండమందు, స్థూలశరీరము ఉపాధిగానుండి, కర్మలు చేయుచున్నాడని, ఈశ్వరుడు, విశ్వాండమనగా, పంచ భూతముల సమూహముగా ఉపాధిగానుండి జీవోపాధులను, సృష్టిస్థితి, లయ, విస్తీర్ణము, ఆకర్షణములు చేయుచున్నాడని, బ్రహ్మము, బ్రహ్మాండము, పంచాకాశ అవరణములు, ఉపాధిగాబొంది, సాక్షిరూపముగానున్నాడనియు, ఎవరెవరి కర్మానుసారముగా, వారికి ఫలముల నొసంగుచున్నాడని, స్వయంప్రకాశమానముగా ప్రకాశిస్తు ఉత్తమ

పురుషుడుగా, సాక్షిరూపుడై యున్నాడని, మతాచార్యులు అనేక గ్రంథరాజ
ములయందు. సర్వతోముఖముగా చెప్పుచున్నారు. అచలఋషులచే నిర్ణ
యించబడిన పరబయలు, ఏయుగమందుగాని, ఏ కాలమునందుగాని,
ఏ దేశమునందుగాని,యేపరిస్థితులలోగూడ, ఉపాధి పొందబోదని నిర్ణయించి
నారు. కావున బయలైన ఉపాధికానబడనిది యెప్పుడున్ అని దశమవాక్యము.
ఏకాదశవాక్యము: బయలనగా పలుకులేనిది యని ఏకాదశవాక్యము ఏలా
యనగా ఆకాశశ్య గుణశ్శబ్దొ నిశ్శబ్దొ బ్రహ్మముచ్యతే। అనగా ఆకాశమునకు,
శబ్దగుణము కలదు. ఈ శబ్దము, పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరియని
నాలుగు విధములు. యిందు పరావాక్కురూపమైన బ్రహ్మములేనిదే, అచల
పరిపూర్ణ పరబయలుగాని, వైఖరీ రూపమైన జీవ రహితమైనది గాదుయని
నిర్ణయముగానే. బయలనిన పలుకులేనిదియని ఏకాదశవాక్యము.
ద్వాదశ వాక్యము: బయలిట్టిది యనుచు దెలియబడదెవ్వరికిన్ అని ద్వాద
శవాక్యము, ఎలయనగా! జీవేశ్వర జగద్రూపమైన ప్రపంచములో, సత్వ
గుణ సృష్టి, దేవత్వమునకు, కారణముగాను, రజోగుణసృష్టి, జీవత్వమునకు
కారణముగాను, తమోగుణసృష్టి, జడత్వమునకు కారణముగాను, తాటస్థ
లక్షణము, కారణరూప బ్రహ్మమైన, సృష్టిమహాకారణము గానున్న, ఇందులో
తమోగుణసృష్టి జడత్వముస్థూలముగానున్నది కావునవాటిని కంటితోనే చూడ
వచ్చును ఎట్లనగా బెల్లము, గడ్డవతుగానున్నదని, ప్రతివారు కంటితో చూచి
చెప్పవచ్చును. కాని రజోగుణసృష్టి జీవత్వముగాన, సూక్ష్మరూపముగా
నుండును. దానిని మనకంటితోజూచి చెప్పుటకు వీలుపడదు, ఏలయనగా బెల్ల
ముగడ్డ పతులుగానున్నదని కంటితో జూచి చెప్పవచ్చును, గాని అందుండు
సూక్ష్మరూపమైన తీపినికంటితోజూచి చెప్పలేము కదా! దానిని తెలుసుకోవలె
ననిన నాలుకచేత చప్పరించి, రుచినిచూచి. తీపిని గ్రహించి, వాక్కుతో
చెప్పవచ్చునుగాని. తినకుండ తీపియిట్టిదని చెప్పుటకు వీలుపడదు. ఆ విధ
ముగా రజోగుణసృష్టి జీవత్వమును కంటితో, స్థూల పదార్థములను కంటితో
చూచిన విధముగా, కంటితోచూడబడదుకానీ స్పర్శచే, నిమిరిగాని, కదలికను
గమనించి యిందులో జీవత్వమున్నదని తెలుపవచ్చును. సత్వగుణసృష్టి
దేవత్వము, ఇది కారణరూపముగానున్నది. కనుక దానిని కంటితో చూడ
జాలము. ఇతర ఇంద్రియములు ఏలయనగా! శోత్రము, త్వక్కు, చక్షు,
జిహ్వ, ఘ్రాణేంద్రియములద్వారా. తెలుసుకొనుటకు వీలుపడదు. దానిని

మనస్సుచేత మననము చేయవచ్చును. ఎలాయనగా, మనము భుజించిన పదార్ధము వలన, మనకు కలిగిన శరీరపుష్టియనగా బలము, మనస్సుచే ఫలాన పదార్ధము భుజించుటచే, శరీరమునకు పుష్టి కలిగినదని, మనస్సుచే తెలిసి, చెప్పవచ్చును, కాని ఆ పుష్టిని కండ్లతో, లేక, ఇతర జ్ఞానేంద్రియముల సముదాయములచె గాని, స్థూల, సూక్ష్మముల. విధముగా తెలిసికొని చెప్పలేము. మనస్సుచే మననము చేయవచ్చును తాటస్థలక్షణకారణబ్రహ్మము మహాకారణముగావున్న ఈ సృష్టి బీజవృక్షన్యాయముగా, తాటస్థలక్షణము పొందియుండుటచే. దీనిని కన్నులతో గాని, మరియేయితర జ్ఞానేంద్రియ ములచేతగాని, తెలిసికొని చెప్పుటకు వీలులేకుండా యున్నది. కారణమగు సృష్టి, మనస్సుచే మననము చేయుటకు గాని వీలుపడదు. ఈ మహాకారణ సృష్టి, బీజములో యిమిడియున్న వృక్షాకారన్యాయముగ, యెరుక లేక జ్ఞానముచే! పొందుటకు వీలుగానున్నది. బీజమునందు వృక్షరాజమును, ఏఇంద్రి యముల చేతగాని, మనస్సు చేతగాని, తెలియబడదు. ఆమహాకారణము గానున్న యెరుకచే తెలిసి, ఫలాన చెట్టునుండి తీయబడిన విత్తనములు అని గుర్తించి, ఆ గింజలో ఇమిడియున్న, సూక్ష్మవృక్షాకారమును, తెలివిచే యెరిగినపద్ధతిన, మహాకారణరూప బ్రహ్మమును, దానివ్యవహారములను, తెలియ వచ్చును, గాని, అచలపరిపూర్ణ పరబయలును, కంటితో చూచుటకు గాని, వాక్కుతో చెప్పుటకుగాని, మనస్సుతోనూహించుటకు, మహాకారణ రూపమైన యెరుకయనే తెలివి, బయలు, నందుండుటకు వీలులేదు, మానవోపాధికేకాదు ఉపాధిరహితమైయున్న, తాటస్థ లక్షణపరమేశ్వరునకు కూడ, బయలుతెలియు టకు వీలులేదు,

గీ॥ అంతరంగమందు అపరాధములుజేసి మంచివానివలెను మనుజుడుండు
ఇతరులెరుగకున్న ఈశ్వరుడెరుగడా! విశ్వదాభిరామ వినురవేమ

అని వేమనార్యులు సెలవిచ్చినారు: ఆ పద్ధతిగా, ఉపాధిపద్ధతిగనున్న, జీవోపాదులుజేసిన, కర్మానుభవ , వాటి ఆచరణ విధానము, ఇతరులకు తెలియక, యెంతరహస్యముగానున్నన, ఉపాధికారణమగు, పరమేశ్వరుడు, జీవులయొక్క అంతఃకరణాధిష్టానమైనున్నాడు, గాని, అంతఃకరణమునందు జీవోపాదులు, ఆచరించు విధానయు, కర్మలు తెలుసుకొనుచున్నాడు, నామరూప, కటన, రహితమైన, అచలపరిపూర్ణ పరబయలును, పరమేశ్వరుడు

తెలుసుకొనుటకు వీలుపడదు కనుకనే, ఈగుట్టు, దేశికునోట గట్టిగా తెలుసుకొనవలెనని, భాగవతుల శ్రీ కృష్ణదేశికేంద్రులవారు, సెలవిచ్చిరని, శ్రీమద చలబుషీ, దయానంద పాన్నాల రాజయోగీశ్వర సద్గురు ప్రభువులు తెలియజేసిరి, కావున ముందు, మనము, సాంఖ్యమును, విచారించి, తెలుసుకొవలసి యున్నదని, శ్రీవారు సెలవిచ్చిరి, యోహ కైతత్ప్రరమంబ్రహ్మవేద బ్రహ్మైవభవతి, అ పరబ్రహ్మముచు తెలియుమహానుభావుడెవడో! అజ్ఞాని, బ్రహ్మమేయగుచున్నాడు, అని ముండకోపనిషత్తు తెలుపుచున్నది,

## శ్రీమద్భాగవత కృష్ణదేశికులచే వ్రాయబడిన సకలవేదాంతసాగర గ్రంధోక్త సద్పృష్టాంతములు సూక్తి ముక్తావళి

152 సాంఖ్యమనగా దేహిదేహములయొక్క యితరేతరవిభాగదర్శనసిద్ధి పొందబడినటువంటి సారాసార విచారవివేకజ్ఞాన దృష్టియే!సాంఖ్యము

153 బాహ్యంతర గుణకర్మధర్మత్యాగమే సాంఖ్యము

154 కేవలజ్ఞాననిష్ఠయే సాంఖ్యము

155 దేహాదిసర్వవిషయ త్యాగతయా! కేవలప్రజ్ఞానమందు ప్రజ్ఞాన దృష్ట్యా! స్థిరభూతమే సాంఖ్యము యిదే! జ్ఞానయోగము!

156 సంఘఫలత్యాగశీలత యాచేయబడినటువంటి స్వభావనియత కర్మాచరణసిద్ధియె యోగము!

157 సంగమే స్థూలశరీరము ఫలమే సూక్ష్మశరీరము యీ రెంటికి కారణము విక్షేపము!

158 విక్షేపమే సంకల్పము సంకల్పమేసంగఫలము వీటియొక్కత్యాగమే సంగఫల త్యాగము

159 తద్వారా చేయబడినటువంటి స్వభావ కర్మాచరణసిద్ధియే యోగము

160 సాంఖ్యమువినాయోగప్రాప్తిలేదు యోగము వినా సంగఫలత్యాగము సంభవించదు ఎట్లనగా బాహ్యంతర గుణకర్మత్యాగమే పరమార్థ సన్యాసము గనుక పరమార్థసన్యాస సిద్ధి జ్ఞాననిష్ఠ సాంఖ్యము గనుక బాహ్యంతరగుణకర్మత్యాగము వినాసంగ ఫలత్యాగ ముసంభవించదు

161 యోగ త్యాగులకు పరమార్థదర్శనసిద్ధియే ఫలము

162 కర్మఫల త్యాగమే శరీర ద్వయనిరసనము శరీరద్వయ నిరసనమే సర్వగుణ సంగఫలత్యాగం

163 యోగమనినను త్యాగమనినను రెండు ఒక్కటే

164 సాంఖ్యమే ఆరూఢదశాసిద్ధి యోగమే అరురుక్షత్వము

165 కేవల మనోవిలీనమే ఆరూఢదశాసిద్ధి వ్యతిరేకమే సాంఖ్యము

166 దేహది సర్వవిషయ ప్రేమతో చకూడనిదే అనన్య ప్రేమ

167 ప్రత్యేక ప్రత్యేక యోగజ్ఞాన వైరాగ్యములనుంచి వర్తమాన జన్మమందు మోక్షములేదు పరంపరా గలుగ గలదు!

168 శాస్త్రజన్యజ్ఞానము ప్రమాణముగానీ ప్రత్యక్షముగాదు

ఇతి శ్రీమద్భాగవత శ్రీకృష్ణదేశికేంద్ర ప్రభావే వేదాంత విచారణే సకలవేదాంతసార గ్రంథోక్త అచల వాక్యాః సమాప్తః

శ్రీమత్ సచ్చిదానంద వెంకటేశ్వరావధూత, స్వాములవారు సూచించిన సాంఖ్యము సాంఖ్యమనగా, ఒకటైన వస్తువు, అనేకములుగా పరిణామములు చెందిన విధానమును గురించి చెప్పుశాస్త్రమునకు సాంఖ్యముయని పేరు ఒకటియగు బ్రహ్మము, లేక, పరమాత్మ, ఈశ్వరుడుయందురు. ఈ బ్రహ్మం యొక్క సత్తాయే, అనేకములుగా తోచబడి! అనేకమునకు, సృష్టి, స్థితి,లయ, కారణమగుచున్నది, బ్రహ్మము, తనయందలి, అవ్యక్తమను మాయశక్తిచే, బ్రహ్మాండపిండాండములని, రెండు విషయములుగాతోచుచున్నది, బ్రహ్మాండ అధిష్టానమునకు, ఈశ్వరుడనియు. పిండాండ అధిష్టానమునకు, జీవుడనియు పేర్లు. ఇట్లు, బ్రహ్మాండము, ఈశ్వరుడు, (శివోహం) పిండాండము, జీవుడు (జీవోహం) అను, ఈ నాలుగు భాగములుగలసి, మొత్తముగా, బ్రహ్మమని వ్యవహరము, దీనినే! అఖండపుదెరుకయని, శివరామదీక్షిత సాంప్రదాయకులందరు, ఆమోదించారు గాన, మొట్టమొదట, బ్రహ్మాండమునందలి, అధిష్టానచైతన్యమగు, ఈశ్వరుని గురించి, తెలుసుకొనుట సాంఖ్యముయని, అవధూతస్వాములవారి, యుక్తి ప్రియమని. శ్రీ మదచలఋషి దయానంద స్వాములు, ఈ విధముగా తెలియజేశారు, బ్రహ్మము, వస్తువుకాక పోవటము చేత, ఎటువంటి లక్షణములద్వారా, అది సూచించబడదు అందుకే గత్యంతరము లేక, శృతులు, బ్రహ్మమును, నేతి, నేతి, ఇది కాదు, యిది కాదు,యని వర్ణించుతాయి మన మనస్సులలో, ఇంద్రియాలతో, తెలుసుకొనబడే, ప్రతి వస్తువు, ప్రపంచం అంతా, అనిత్యం,జడము,సాంతము, బ్రహ్మము, అనిత్య

ముగాదు, జడముకాదు, బ్రహ్మము అవ్యక్తమగును పరమాత్మను చేరలేక, మనస్సుతో సహా, వాక్కులు, నేత్రములు, తిరిగి, వచ్చుచున్నందున, యతోవాచోనివర్తంతే అప్రాప్యమనసాసహా.

## శ్రీమత్ సచ్చిదానంద వెంకటేశ్వర అవధూత స్వాముల వారు రచించిన! పంచీకరణ సాంఖ్య బోధతత్వము

పల్లవి: ఘనముగను యీ సాంఖ్య బోధన్నా, సద్గురునిశ్రుపచే, అను దినంబున తరచవలెనన్నా, అను పల్లవి జననమరణ ప్రవాహమంతయు, ఇనికిపోవునటంచురుషులు, జనకశుక సాందీపకృష్ణులు చక్కగను గుర్తెరిగి దెల్పిరి? ఘనముగను!

చరణము (1) అరపరేమియు లేక కేవల, అచలపరిపూర్ణాత్మ యందునః ఏరుక జగములు యేరుపడెను. ఏమిలేనిది తనకుతానై, యెరుగవలె ఆరో పితంబన్నా, త్రాడందుపాముతరచగనుమరియేమిలేదన్నా భ్రాంతియిదియె, మరుగు యెరిగితె మాయలేదన్నా అదియెట్టులనగా, పరమభక్తితో గురునిశే వన్నాజేయుచు నుంటే పరమపదవికెదారి యిదినన్నా నరిగ సద్గురుపు [illegible] యుయ్యా,సాధనలుశాస్త్రములు విడచియు,సురచిరంబుగ పంచికరణి,సూత్రమూ గుర్తెరుగవలయును "ఘనముగను" అను (32) చరణములు చూడుము

## సాంఖ్యము

మొదట చెప్పబడిన అచలపరిపూర్ణ పరబయలందు లేకనే, తనకుతానై యెండ మావులయందు, జలము లేక పోయినను, జలముగలదని, భ్రమతోచినటుల త్రాడుయందు పాము లేకనే, పాముతోచిభయపెట్టిన, విధముగా, గొడ్రాలు బిడ్డ విధముగా, ఆకాశపుష్పము విధము గా, యెరుకయనుగుర్తుతోచినది. ఈ గుర్తునే, బ్రహ్మము అని చెప్పబడినది.

## బ్రహ్మము

ఇదిబృహత్ అనుధాతువునుండిఏర్పడినది బృహత్అనగా గొప్పది, దీనికన్నా ఇతర మేమియునులేదు. ఉన్నా దీనిలోనే, ఇమిడి, లయమైయున్నది. కావున అవిదీనికన్నా చిన్నవియేకదా! కావునా ఇది అచలపరిపూర్ణ పరబ యులలో తోచినది. ఏలాయనగా! అమనక చీకటిలో, తాడుయందు పాము తోచినటుల,వేసవి యెండలలో, మావులుదోచి అవిజలభ్రాంతి కలిగించినటుల దోచినది ఆ జలమును, వెదకిచూచిన, లేనిభంగి, అవితమగ, అచలపరిపూర్ణ

మందు, లేకనే తోచినది. వెదకి చూసిన లేదుగానా! దీనిని. లేనెరుకయని, బ్రహ్మమని. స్వప్రకాశమని. చేతనమని, పరమాత్మయని, పరాకాశమని, సాక్షియని, అధిష్టానచేతన బ్రహ్మమని అనేక పేరులుగా శృతులందు వ్రాయబడినవి. దీనిని మనము కంట్లతో చూడలేము. ఏలాచూడలేమనగా! దానియందు. స్థూలరూపములగు తమోగుణసృష్టి. జడత్వము లేదు గాన బెల్లము గడ్డను. కంటితో చూచినటుల. ఈ బ్రహ్మమును కంటితో చూడలేము. దీనియందు రజోగుణసృష్టి. జీవత్వము సూక్ష్మములేదు గాన దీనిని శ్రోత్ర. త్వక్ జిహ్వ, ఘ్రాణేంద్రియములచేత తెలిసి. వాక్కునుండి చెప్పవచ్చునుగాని బ్రహ్మమునందు రజోగుణసృష్టియగు జీవత్వములేదు. మరియు కారణరూప సృష్టి. దేవత్వము ఉంటే. మనస్సుతో ఊహించవచ్చును. ఎలాయనగా దేవత్వమనగా, ఇచ్చునది. మనము తినిన పదార్థములనుండి. శరీరమునకు. కలిగిన బలమును. కంటితో చూడలేము. వాక్కుతో చెప్పలే కానీ మనస్సుచే। ఫలాని వస్తువు తినుటచే। ఇట్టి బలముకలిగినదియని। ఊహించునటుల। ఈ బ్రహ్మయిను! ఊహించగలుగుదుముగానీ దానియందు దేవత్వములేదు ఈ బ్రహ్మము, అన్నిటియందుండి, వాటికంటక, తనుకుతానే స్వతఃసిద్ధమై, గొప్పదై, ఉన్నది. కావున పరమనియు. అన్ని యుండుటకు, తనయందు, స్థానము ఇచ్చుచున్నందున! పరాకాశమనియు! అన్నిటిని, తనసత్తాచే కదిలించుటచే, చేతనమని, చిన్మయుడనియు, అన్నినశించిన, తనకుమాత్రము ఏ హనిలేదు కనుక, ఉత్తమపురుషుడనియు, చెప్పబడును. అట్టి ఉత్తమ పురుషరూపమైన, గొప్పచైతన్య స్వరూపము. అన్ని జీవులకు జ్ఞానమిచ్చుచున్నందున, విజ్ఞానఖనియనియు, స్వయంప్రకాశమనియు, పిలువబడుచున్నాడు. అనగా! అందరి అంతఃకరణమందు నిలచి, జ్ఞానోదయము చేయుచున్నాడు. సకలవిద్యలకు, మూలకారణుడు గావున, వేదాంతవేద్యుడనియు, పిలువబడుచున్నాడు. అనేకులు, అనేకరూపములు, చెప్పుచున్నారూ! కాని దానిని, చూచుటకు, ప్రయత్నించగా। అదికన్నులకగుపడదు, వాక్కుచేత యిట్టిదనియు, చెప్పుటకు వీలుపడదు. పోనీ మనస్సుచేతనైనా ఊహించుదామంటే, మనఊహలకందదు, కావున శ్రుతి॥ నచక్షుర్గచ్ఛతి, నవాగ్గచ్ఛతి, నోమనః యని చెప్పుటచే, చూడగా ఆ బ్రహ్మమునకు, రూపనామములులేవు అది అత్యంత, సూక్ష్మాతి సూక్ష్మ, అతిసూక్ష్మ స్వరూపమైనది కావున మనము తెలియలేము. లేదంటామా అనిఅంటే, తన స్వశక్తి చేతనే, సర్వజగములను

నడుపుచున్నది. బ్రహ్మజ్ఞాని, బ్రహ్మ విద్వర్యులగువారు, బ్రహ్మమును చూచి
తిననిగానీ, తెలిసితిననిగానీ చెప్పడు మదిలో నెంచరు అయిన ఆతడుయెరు
గడని యెంచరాదు, దీని విషయమై, కేనోపనిషత్తు, యిలాచెప్పుచున్నది,
ఓకానొకప్పుడు, దేవతలకు రాక్షసులకు, యుద్ధము కలిగినప్పుడు, భగవంతు
డగు బ్రహ్మము, దేవతలకు జయముకలిగించెను, ఆజయము, దేవతలు వారి
వారి, భుజబల పరాక్రములచే కలిగినదని, గర్వించియుండిరి, అప్పుడు, ఆ
బ్రహ్మము, వారి అంధత్వ గర్వమును, నశింపజేయు సంకల్పముతో, జ్ఞానో
దయ మొందించుటకు, ఓకయక్షరూపమున, ప్రకటనమయ్యెను ఆ అద్భుత
మైన యక్షరూపమునుచూచి, అచ్చరువంది, దేవతలందరు, ఇంద్రుని సమీ
పించి, ఆ అద్భుతస్వరూపమైన, యక్షమును, జూపగా, ఇంద్రుడుకూడ, ఆశ్చ
ర్యపడిన, దేవతలు, ఆ అద్భుతమైన ఆయక్షమేమిటో తెల్పగోరిరి, అప్పుడు
ఇంద్రుడు తనకైనా, తెలియుటకు. యేమి, వింతలేదనిన ఆ యక్షము ను,
చూస్తు ఉంటే, మరిమరి చూడాలని, కోరికతో పాటు మహానందము కలుగుచు
న్నది. కావున మాకు తొందరగా, తెలియజేయమనికోరిన, ఇంద్రుడు, అగ్ని
దేవునితో నీవు జాతవేదుడవుకదా! ఆయక్షమేమిటో తెల్సుకొనివచ్చి చెప్పుమ
నగా! అగ్నిదేవుడందులకు, సంతోషపడి తెలుసుకోవడానికి, ఆయక్షము ను.
సమీపించగా అగ్ని తన ఉష్ణశక్తియే తగ్గుట గమనించినంతలో। యాయక్ష
మునుంచి। ఈ శబ్దమేర్పడెను కోऽసీతి నీవెవ్వరవని। ప్రశ్నించగా। అగ్నిదే
వుడు। అహం అగ్నివైఅస్మి నేను అగ్నిని। మరియు జాతవేదస్మి నేనుజాతవే
దుడను। అని అన్నాడు "తస్మిన్తయా" అలాంటికీర్తి గలనీలో 'కిం" వీర్యం
ఏమిశక్తిగలదనెను నీవు జాతవేదుడవా! ఆ పేరు నీవే పెట్టుకొన్నావా! ఐనా
నీబలమేమి? అని అడిగెను। అంతట। అగ్నిదేవుడు। భూమియందుండు సమస్త
వస్తువులను కాల్చివేయగలననిన। ఆయక్షము అగ్నిదేవునిముందు, ఓకతృణం
అనగా! ఒక ఎండిపోయిన, గడ్డిపరకనుంచి, దీనిని కాల్చుమనెను, అపుడు
ఆ యగ్ని తనకుగల సర్వశక్తులను, (బలమును) కూడబట్టి, కాల్చుటకు,
ప్రయత్నించిన ఆతృణమును కాల్చలేకపోయెను అగ్నిదేవుడు। తలనుదించు
కొని। ఇంద్రునివద్దకు వెళ్లి। నేనాయక్షమును। తెలుసుకోలేక పోయితిననెను।
అపుడు ఇంద్రుడు వాయుదేవుని పంపెను। వాయుదేవుడు। యక్షముకడకేగిన
ఆ యక్షము। నీవెవరవనిఅడిగెను నేను। మాతరిశ్వుడనను। వాయుదేవుడననెను
నీవు మాతరిశ్వుడవా। యైనా। నీబలమేమియని అడుగగా! పృథ్వి పైన గల

సమస్తమును, ఎత్తుకొనిపోగలననెను, ఆపుడాయక్షము, ఈ తృణమును, యెత్తుమని చెప్పెను, అందుకు సమ్మతించి, వాయుదేవుడు, తనకుగలబల మంతయు వ్యక్తపరచి, ఆతృణమును, యెత్తలేక తలవంచుకుని, ఇంద్రుని చేరి, నాకు అయక్షమేమిటో, తెలియబడలేదని, సమాధానమిచ్చెను అపుడు దేవతలందరూ, తెలుసుకోవలసిన, యిద్దరూ దేవతలు, తెలుసుకోలేకపోయిరి ఇకమీరే ఆయక్షమును, తెలియుటకు, సమర్థులుగానా, ఆయక్షమేమిటో, తెలి జేయుమని, ప్రార్థించిరి, అపుడు ఇంద్రుడు చేయునదిలేక. ఆ యక్షమును. తెలియుటకు సిద్ధపడెను గానీ గొంతులో. పచ్చివెలగకాయ. పడినవిధముగా బాధతో. ఆ దేవుని ప్రార్థిస్తు స్వామి మీ అనుగ్రహమువల్లనే నెను ఈ పదవికి అర్హుడనైనాను ఇదినాకు, పరీక్ష సమయము, ప్రాణముంచిన. నీటిముంచినా, మీదేభారము అని ఆయుక్షము వద్దకేగెను, కానీ. అయక్షము అతనికి, అగుప డక అంతర్ధానమైనది, ఇంద్రుడు, నలువైపుల పరికిస్తు ఉండగా?అస్థలములో అద్భుత సౌందర్యవతియైన,హిమవతుని కుమార్తెనుచూచెను చూని, ఇంతకు ముందున్నా, అప్రరూపమైన అద్భుతయక్షము, ఏమిటి అని, ఆమెను, అడిగాడు,

ఇక్కడ, మనము, కనవలసినదొకటి కలదు ఈ దేవతలలో, జడదేవతలు చేతన దేవతలు అని రెండు విధములుగా కలరు. అందు స్థూల, మగ్ని. ఇది మనకంటికిసంబంధముకాగలదు, ఈ అగ్నియొక్క, వెలుగు లేనిదినేత్రములు దేనిని చూడజాలవు కావున. నేత్రమే, అగ్నియని తెలిసిన మననేత్రములచేత బ్రహ్మమును, చూడగలుగుదుముగాని అలా, అగ్ని తెలియలేదుకావున, నేత్ర ములచే చూడలేము వాయువుకూడ, అగ్నివలె, జడదేవతయే, కాని, యిది సూక్ష్మదేవత ఈ దేవతయు, బ్రహ్మమును తెలిసిన యెడల, ఇతరజ్ఞానేంద్రి యములచే, తెలుసుకొని, వాక్కునుండి యిట్టిదని తెలుపుదుముగాని వాయు దేవత తెలియలేక పోయెను ఇంద్రుడు, కారణరూప, చేతన దేవత స్థూలరూ పము దూరమునుండియే తెలిసెను దేవతలకు రాజు, ఇంద్రుడు, ఇంద్రియ ములకు రాజు, జీవుడు, గాన ఈ బ్రహ్మమును జీవుడు తన మనస్సుచేనూ హింపలేకపోయెను. కావున యక్షము అంతర్ధానమైన అస్థలమునసె పరీక్షించు చుండగా ఒక సౌంధర్యవతియగుస్త్రీ ప్రత్యక్షమాయెను ఆమెశోభాయమాన ముగా, తెల్లగా వెలుగుచుండెను.ఆమెయే ఉమా(పార్వతిదేవి)ఆమెనుగాంచి ఇంద్రుడు అమ్మా ఈ ప్రదేశమున నొక యక్షముండెను అది యేమిటో

తెలియజేయవలయునని కోరెను. అందుకు, ఉమ ఆపదార్థమే బ్రహ్మముదాని శక్తివల్లనే మనమందరము, నిలచియున్నాము. అదితలవనిది, ఏదికూడా, ఏర్పడదు గాన మీరు మీభుజబల పరాక్రమములచే, రాక్షసుల గెలిచితిమని, గర్వించినారు. మీగర్వభంగమునకే, ఆబ్రహ్మము ఈ యక్షరూపమున ప్రకటమైనది, ఆబ్రహ్మమును తెలిసినవారు ముగ్గురే ముగ్గురు, ఒకటి అగ్ని. రెండు వాయువు మూడవ వాడవునీవు, (ఇంద్రుడు) మీరలు అబ్రహ్మమును. తెలుసుకోలేము। యని తెలుసుకున్నారు యనెను, కావున నచక్షుర్గచ్ఛతి నవగ్గచ్ఛతి, నోమనః అని శృతిచెప్పుచున్నది. యోగమునందు లేక ముద్రలయందు, స్థూలరూపమైన, అగ్నిఅనగా నేత్రములను సూక్ష్మరూపమైన వాయువు,(ప్రాణము) అనగా వాక్కును బంధించిన జీవుడు ప్రకృతిలోనుండి పెనుచీకటిని హరించి నంతనే। త్రికూట స్థానమునకు బోవుచుండు. ముందు అగుపడునది స్త్రీయే అదియేబుద్ధి శుద్దసాత్వికమైన బుద్ధిచే (ముక్తికాంతనే) గాని బ్రహ్మమును గుర్తెరుగుటగలదు కాని బ్రహ్మము తెలియబడదని చూడబడదని చెప్పబడదని మరియు। ఊహింపబడనిది. కాని। బ్రహ్మము స్వప్రకాశ చేతన బ్రహ్మమని। పరాకాశమని ఉత్తమ పురుషుడనియు। చెప్పబడును। ఉత్తమపురుషుడనగా। తనయందు। దహర। నిరవయ సూర్య భూతాకాశా వరణములు। కాలచక్ర కర్మచక్రముల్తై తిరుగుచుండిన వీటి చలనముగానీ స్పర్శగాని తెలియుచున్నందున ఉత్తమ పురుషుడని చెప్పబడెను

2 బ్రహ్మముయొక్క పరిణామము అవ్యక్తము:

బ్రహ్మముయొక్క పరిణామము అవ్యక్తము అనగా తానుకంటిచే చూడబడనిది వాక్కుచే చెప్పబడనిది, మనస్సుచే నూహించ బడనిది, దహరాకాశరూపముగా సమిష్టి మహమనస్సుగ అక్షరపురుషుడనియు మూల ప్రకృతి అనియు చెప్పబడును అక్షరపురుషుడనియు పంచాదిదేవతలు తనయందు గర్భీకృతమై ఉన్నతవసామర్థ్యముచేసర్వమును సృష్టించుటకు సంకల్పించెను గావున మహమనస్సనియు అక్షరపురుషుడనియు వ్యక్తముగానిది గాన అవ్యక్తమనియు ఈ అవ్యక్తమునందు చేతనశక్తిగలదు గాన దహరాకాశమనియు ఈ అవ్యక్తము చెప్పబడుచున్నది ఇపుడు మనకు కనిపిస్తున్న నామరూపాలతో కూడియున్న ఈ జగత్తంతలేక అవ్యక్త బ్రహ్మమే ఉండెను ఈ అవ్యక్తరూపబ్రహ్మమే ప్రపంచాలను (సకలజగత్తును) సృష్టించాలనుకుంది నేను అనేకము కావాలని సంకల్పించాడు (సోஉకామయబహుశ్యాం) కావున

సమిష్టి మహా మనస్సని చెప్పబడుచున్నది. అన్ని దేవతలకన్నా ముందు వాడు, ఇతనినుండె సమస్త భువనములు, ఉత్పత్తి స్థితిలయాలు పొందు చున్నవి. ఇది అక్షరుడైన అవ్యక్తమునకు సంబంధించిన జ్ఞానం కలదు గాన సమిష్టి అంతఃకరణమని చెప్పబడును. అదృశ్యమైనది జ్ఞానేంద్రియ ములకు విషయంకానిది అగ్రాహ్యమైనది కర్మేంద్రియాలకు విషయం కానిది గోత్రవర్ణములులేనిది అంటేవరుసగా వచ్చే సంబంధం లేనిది.ఆకారం రంగు లేనిది నిత్యమై అన్నింటియందు అవ్యక్తముగానుండునది మిక్కిలి సూక్ష్మ మైనది అన్నింటికి కారణమైనది ఊర్ణనాభివలె సమిష్టి అంతఃకరణరూపమైన అవ్యక్తమైన అక్షరునినుండి సృష్టికామనగలిగినది అతనియందు ప్రజ్ఞగలదు కావున సమిష్టి అంతఃకరణము లేక మహమనస్సులేక దహరాకాశమనియు అవ్యక్తమనియు చెప్పబడును

3 అవ్యక్తముయొక్క పరిణామము మహత్తు:

అవ్యక్తముయొక్క పరిణామమే మహత్తు మహత్తుయనగా నిరవయాకాశము సమిష్టి ప్రాణము అవ్యాకృతుడు! ఈశ్వరుని శరీరము, అ.కార ఉ.కార మ.కార అర్ధ మాత్రలు గర్భీకృతమైన ఓంకారమని, గూడ చెప్పబడును. మహత్తు యనగా గొప్పధనము, అష్టైశ్వర్యములతో నిండిన ఆనందరాసి. సర్వజీవులకు యెంతపంచిన,తరుగనిది,యండనిది,ఇతరమేమియు అందులో పోయుటకు వీలుపడనిది. సర్వము నశించినా తనయందుంచుకొని, తాను నశించనిదిగావున, అక్షరుడని, సర్వము దీనినుండే ఉత్పత్తియగుచు న్నది. గావున విశ్వయోనియని చెప్పబడును. కాని యిదిమూలప్రకృతి (రెండవదిగానా) దీనినిస్త్రీయని, ప్రకృతియని, హిరణ్మయుడని, అనగా పసుపువచ్చగా బంగారు కాంతిగలిగియుంతుటచే, మాయవర్ణాత్మకమనియు చెప్పబడుచున్నది. మాయ యనగా ప్రకృతి, ఆత్మ యనగా బ్రహ్మము యొక్క చేతనాంశమునుబొంది, గొప్పశక్తి స్వరూపమై ప్రకృతియైనది. విశ్వయోని అనగా విశ్వమునకు కారణమై ఓంకారమై, సత్తా కారణుడగుటచే అక్షర పురుషుడనియు, మాయసత్తాచే సమస్తసృష్టి మహత్తునుండియే ప్రస రించుటచే, విశ్వకారణమని, స్త్రీలేక ప్రకృతియనియు, వ్యవహరములుగలదు ప్రణవ స్వరూపమగు వేదమాత, గాయత్రియనికూడ పేర్లు కలవు. సమస్త సృష్టిమహత్తు నుండియే ప్రసరించుచున్నందున ఓంకారమనియు, శబ్దమిచ్చ

టనుండియే! పుట్టుచున్నది. సకల విద్యలచే ప్రకాశించుచుండును. అనగా సూర్యచంద్ర నక్షత్ర మెరుపులవల్ల ప్రకాశించే ప్రకాశము గాక [illegible] శము అంధకారములయందు కూడా ప్రకాశిస్తుండడమునుండి నీడ అంధకారములచే ఖండములుగాక, అఖండములుగానే ఉండటము వలన యిది చ్ఛేధింప బడిదనియు తెలియుచున్నది. గుర్తురూప ప్రకాశము. దీనియందు ఎండ నీడ చీకటి అనేజ్ఞానమనునదేలేదు. మహత్తుయనగా గొప్పదియని పైన చెప్పియుంటిమికదా! అనగా యిది సర్వకాలములయందు సకల దేశముల యందు, సమస్తమైన వస్తువులయందు, తరగక అరగక, కరుగక, పెరగక ఏకరీతిగనున్నను! యిది అచల పరిపూర్ణను పరబయలుగాదు, కాని దీనియందు చెలిమయందు నీరుఊరునటుల, మహత్తునందు నొకదానివెంట ఒకటి వస్తూనేయుండును. అందు అష్టసిద్ధులు, దశశిద్ధులు, పదునాల్గుకామ్య విద్యలు. ముప్పదిరెండు అసురవిద్యలు, ముప్పదిరెండు బ్రహ్మవిద్యలు, ఎన్నియున్నవో మానవులకు ఏన్నతరముగాదు వారుఊహించనూలేదు. ఇంత వరకు వచ్చినవి లెక్కపెట్టలేదు, ఇకముందు నవీన నవీనములెన్నియో! తెలుసుకోలేము. కావున ముందు వచ్చినవాటిలో, మనము అష్టసిద్ధులను విచారిస్తాము 1) అణిమ 2) మహిమ 3) లఘిమ 4) గరిమ 5) ప్రాప్తి 6) ప్రాకామ్యము 7) ఈశత్వము 8) వశిత్వము అనునవి అష్టసిద్ధులు ఈ అష్టసిద్ధులను ఎవ్వరు ఎక్కడ ఎప్పుడు ఎలా ప్రదర్శించారో! గత చరిత్ర రామాయణము, భాగవతము, పురాణములయందు తెలియవచ్చుచున్నది. ఇందులో అణిమ మహిమను రామాయణకాలములో అంజనేయుడు ప్రదర్శించాడు.

1 అణిమయనగా తాను అణువ్వరూపుడైయుండి, యితరులకగుపడక తానే ఇతరుల చూచుట. 2 మహిమయనగా తాను తన శరీరమును, చుక్కలు ముట్టు వరకు పెంచకలుగుట అనగా పెద్దదానికన్న పెద్దదిగాయుండుట. అంజనేయుడు సీతాన్వేషణ కొరకు, సముద్రమును లంఘించుచుండగా! దేవతలకు ఒక సందేహము కలిగినది ఏలయనగా! శ్రీ లంకవాసులు గొప్పగొప్ప తపస్సులు చేసి, వరములుపొంది ఆశక్తులచే వారు మహోన్నతులైయున్నారు. అందురామకార్యము అంజనేయుడు నెరవేర్చునాయని, పరీక్షార్థము సురస యనే దానిని పంపిరి. అదిలంఘించు అంజనేయునికి దగ్గరగావచ్చి, మ్రింగుతానని నోరుతెరచి పెంచుచుండెను. పెంచి పెంచివేసారి, అంజనేయుడు అణిమయనుసిద్ధిచేత తన శరీరమును తగ్గించగానె, సురస అంజనేయుని మ్రింగి

వేసెను. అంత ఆంజనేయుడు, అణురూపమున దాని శరీరరోమకూపములనుండి బయటపడెను. అదిచూచి చాలా సంతోషించి, దేవతల వద్దకువెళ్లి ఆంజనేయుడు రామకార్యమును సాధించగలడని తెలిపెను. శ్రీకృష్ణుడు తులాభార సమయమున 3 లఘిమ మరియు 4 గరిమ అనుసిద్ధులను ప్రదర్శించెను, లఘిమయనగా దూదికన్న తేలికగా యుండుట గరిమయనగ తన శరీరమును భూమికన్న భారముగానుంచుట. సత్యభామ శ్రీ కృష్ణుని నారదునకు దానమిచ్చి, తనవద్దనున్న బంగారముతో తూచి, శ్రీకృష్ణుని తిరిగి గ్రహించుటకు ప్రయత్నమాచరించగా, శమంతకమణి ప్రభావమున, తనవద్దనున్న బంగారం గిడ్డంగులలో నింపిన మొత్తముతో, శ్రీకృష్ణుని తూచగా, కృష్ణుడు గరిమ యనేసిద్ధిచే, వాటన్నిటికంటే బరువుగానే యుండెను, తరువాత రుక్మిణి ఆ బంగారమంతయు తీసి, కృష్ణుని ఒక తులసీ దళముతో తూచెను కృష్ణుడు లఘిమయనే సిద్ధిచే, తులసీదళముకన్నా తేలికయై తూచబడెను. 5 ప్రాప్తి యిది పంచపాండవులు అరణ్యవాసమునకు వెళ్ళునపుడు, సూర్యదేవునారాధించి నమస్కరించగా, సూర్యభగవానుడు వారికినొక పాత్రనుయిచ్చెను. వారు స్నానముచేసి ఆపాత్రను, యేమేమి తిను బండారములు కావలెనో అవి కోరిన, ఆ పాత్రనుండివారు కోరిన తినుబండారములను, పాండవులు పొందుచుండెడివారు కావున ఈ సిద్ధి పాండవులు పండ్రెండు సంవత్సరములు పొందియుండిరి.

6 ప్రాకామ్యమనగా ఆకాశ గమనం, తాముకోరిన రూపములను పొందుట. తానుకోరిన మేడలు మిద్దెలు అంతఃపురములు, ఆరామములు పొందుట ఈ సిద్ధిఘటోత్కచుడు శశిరేఖ పరిణయ సమయమున ప్రదర్శించెను మాయబజారు అను సినిమాయందు, ఘటోత్కచుడు ఈసిద్ధిని ప్రదర్శించుట చూచియే యుందురు.

7 ఈశత్వము. ఇంద్రియాధిష్టాన దేవతలపై, ముక్కోటిదేవతలపైన తనకు అధికారము కల్పించుకొని, వారిని తన యాజ్ఞయందుంచుకొనుట, యెవ్వరు యేమేమి కోరిన వారికి, శూన్యమునుంచి తీసి వాటి వారికి ఇచ్చుట, ఈసిద్ధిని నేటికికూడా కొందరు బాబాలు ప్రదర్శిస్తున్నారు.

8 వశత్వం సర్వప్రాణులను వశము చేసుకొని, వానిచేత తనకు ఇష్టమొచ్చినటుల, తనకార్యములను నడిపించుకొనుట, సకలపనులుకూడా చేయించుకొనుట.

ఈ అష్టసిద్ధులుపయోగించువారలు, పారమార్థిక జీవితం పురోభివృద్ధికి అవరోధము కలిగించి అధోగతి పొందెదరు. అనగా జనన మరణ రహితస్థితి పొందలేరు. వారు యెప్పుడు గొప్ప ప్రతిష్ఠలకేగాని, మరెందులకు కొరగారు అని తలంచవలయును. ఈమహత్తునేపైసిద్ధులుపొంది వారు నేను దేవుడనని చెప్పుకొనుట చూచుచున్నాము.

4 మహత్తుయొక్క పరిణామము మహదాహంకారము!

దీనినే సూర్యకాశమనియు, ఈశ్వరునియొక్క అంతఃకరణమనియు, సూత్రాత్మయని చెప్పబడుచున్నది. ఈ మహదాంకారమే తేజోమయ పురుషుడు అనగా సూర్యచంద్రనక్షత్రఅగ్ని విద్యుత్ అన్ని ఆకాశముల కూడికగాన అదిత్య మండలాంతర్గత పురుషుడని చెప్పబడును ఇది సకల విద్యలకు శక్తులకు మూలము, ఏలయనగా! మహద్ గొప్ప అహం నేను ఆకారము అనగా రూపము అనగా గొప్పనేననే రూపము. ఈశ్వరుడనే గొప్పనేననేరూపమున ప్రకటనమై, దీనియందు అకార, ఉకార, మకారము, రజో, సత్వ, తమో గుణములచే! బ్రహ్మ విష్ణురుద్రులుగా! ఏలయనగా! దీనిని పరాప్రకృతి మహత్తునుండి కలిగినది కావున సూత్రాత్మయనియు చెప్పబడును విశ్వాండ మంతటనిండి ఈశ్వరుడని, యిదిఅన్ని మణులలోనుండు దారము విధంగా విశ్వమందుండు జీవులు తనయందుంచి (కుచ్చబడి) తానుకనబడక, వాటిని బంధించియుండుటచే సూత్రాత్మయనబడును, దీనియందుసర్వశక్తులు గర్భీకృతమైయున్నవి, పంచభూతములు లయమై ఉన్న తాను,తనవునికికిభంగ ముకలుగనీయక, యథా రూపముననున్నది, గాన ఈ సూత్రాత్మ అక్షర పురుషుడనియు, మహత్తులో యుండిన ఓంకారము, దీనియందు అకారమె రజో గుణము, బ్రహ్మరాజసాహంకారము ఉకారమె విష్ణువు స్వాతికాహంకారము రుద్రుడు తామసాహంకారము వీటినుండి రాజసాహంకారము వలన, షడ్భూత స్వరూపమున, 84 లక్షల జీవోపాదులను సూక్ష్మరూపములుగా! మరియు సాత్వికాహంకారము వలన దేవతలు, అనగా చంద్రుడు,బృహస్పతి క్షేత్రజ్ఞుడు, జయుడు, విశ్వయోని, అజుడు, వసిష్ఠుడు,విశ్వకర్త, దిక్కులు వాయువు, సూర్యుడు, వరుణుడు, అశ్వనీదేవతలు, సదాశివుడు, ఈశ్వరుడు, రుద్రుడు, విష్ణువు, బ్రహ్మ అగ్ని, ఇంద్రుడు, ఉపేంద్రుడు, ప్రజాపతి, యముడు, యక్షులు, కిన్నెరులు, కింపురుషులు, గరుడ గంధర్వులు, అప్సరసలు అష్టదిక్పాలకులు, నవగ్రహములు, మొదలుకొని ముప్పదిమూడు కోట్ల

దేవతలు, మరియు తామసహాంకారము వలన జడత్వము, అగ్ని, శబ్ద, స్పర్శ రూప, రస, గంధ, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృధ్వి, ద్వాదశ రాసులు (మేషాదిరాసులు)27నక్షత్రములు (అశ్వనిమొదలుకొనిరేవతివరకూ) స్థూలమైన జడరూప విశ్వము కలిగినవి. ఇది హిరణ్య గర్భుడని సమిష్టి సూక్ష్మ శరీరము.

5 మహదాంకారము యొక్క పరిణామము పంచతన్మాత్రలు!

(మహదాంకారముయొక్క పరిణామమే పంచన్మత్రలు) ఇది అపంచీకృత పంచతన్మాత్రలు ఇదిఈశ్వరుని సూక్ష్మశరీరమగు, హిరణ్యగర్భునకు ఇంద్రియములు. శబ్ద తన్మాత్రనుండి చంద్రుడు. మనస్సుగా, బృహస్పతి బుద్ధిగా క్షేత్రజ్ఞుడు, చిత్తముగా, రుద్రుడుఅహంకారముగా, జయుడుసమానముగా విశ్వయోని వ్యానముగా,అజుడు ఉదానముగా, విశిష్టుడు ప్రాణముగా,విశ్వ కర్త అపానముగా దిక్కులు చెవులుగా, వాయువు చర్మముగా, సూర్యుడు నేత్రములుగా, వరుణుడు నాలుకగా, అశ్వనీదేవతలు ఘ్రాణముగా, అగ్నివా క్కుగా. ఇంద్రుడు కరములుగా ఉపేంద్రుడు పాదములుగా ప్రజాపతి గుహ్య ముగా, యముడు గుదముగా, ఈఇరువది నలుగురు దేవతలు జడరూపులుగా ప్రకృతిగా, హిరణ్యగర్భుడు, అనగా సకలలోకములు తనయందుంచుకొని వీటిద్వారా సకలసృష్టి,స్థితి, లయ, విస్త్రాణాకర్షణములుగా, జనన మరణాదుల పదునాల్గు లోకములయందు వారికర్మలననుసరించి పంపించుటకు ఏర్పాటు జరుగును.

పైనజెప్పినబ్రహ్మము, ఈపంచతన్మాత్రలనుండి సర్వప్రపంచములో జరుగు పనులు తెలుసుకొని, వాటికి తగుఫలంబులనిచ్చుచున్నాడు. ఏలాయ నగా! మనము సమస్త పనులు చేయుటకు చేతితోనే కదా! ఈ చెయి పైభు జములు, దానిక్రిందదండచెయి' దానిక్రిందమోచెయి,మట్టయని,దానిక్రింద అరచెయి. దానిక్రింద ఐదువేళ్ళుగలిగి పనులన్ని వ్రేళ్ళతోనే చేయుచు న్నాము. చేతికి వ్రేళ్ళురేనిచో మనము చేయితో యేమి పనులు చేయలేము అలానే ఉపమానము భుజము అనగా బ్రహ్మము. దండచేయిఅనగా అవ్యక్త ము మోచేయి యనగా మహత్తు. అరచేయి యనగా మహద్హంకారము. వ్రేళ్ళుయనగా పంచతన్మాత్రలు. ఈ పంచతన్మాత్రలులేనిచో. బ్రహ్మసృష్టి చేయలేడు కదా. కావున ఈ పంచతన్మాత్రలనుండియే బ్రహ్మమనలను సృష్టి స్థితి. లయ. విస్త్రాణకర్షణముల. చేయుచు కర్తయగుచున్నాడు.

6 పంచతన్మాత్రలయొక్క స్థూలము పంచమహాభూతములు:

సూత్రాత్మయందు గల సత్తానుండి, నుండి, శబ్ద తన్మాత్రవలన నీల వర్ణము (నీలి) లయంబై యుండి, అన్నిటికి బయటనున్నందున బయలుగా నుండుట ధర్మము. కిరుగనిచ్చుట. కూర్చోనిచ్చుటకు అవకాశమిచ్చుట, కర్మము ప్రతిధ్వనించుటగుణము, గుండ్రని ఆకారముగల ఆకాశముగలిగెను ఇది పంచభూతములలో నొకటి. మొదటిదగుటచేభూతాకాశమని, నిర్ణయము పంచతన్మాత్రలలో శబ్ద స్పర్శతన్మాత్రల వలన ఆకాశమునుండి ధూమ్రవర్ణ ముగల వాయువు ఏర్పడెను. చలించుట దానిధర్మము, విస్తరింతజేయుట దాని కర్మము, దీనికి శీతోష్ణస్పర్శ గుణములు కలవు. ఇది షట్కోణాకారము కలిగియున్నది.

పైనజెప్పిన శబ్ద, స్పర్శ, రూప, తన్మాత్రల వలన వాయువునుండి, నలుపు (కృష్ణవర్ణము) త్రికోణాకారముగల అగ్నిభూతమేర్పడెను. ఊష్ణించుట వెలుగుట దాని ధర్మము, మార్పుచేయుట దానికర్మము. ప్రతిరూపములు దాని గుణములు. త్రికోణాకారముగల అగ్నిభూతమేర్పడెను, శబ్ద, స్పర్శ, రూప, రసముల వలన అగ్నిభూతమునుండి, తెలుపు వరము తడుపుటయనే ధర్మము, పోషించుటయనేకర్మము, మాధుర్యరసము గుణము, అర్ధచంద్రాకారముగల జలభూతమేర్పడెను. శబ్ద, స్పర్శ, రూప రస కంధ తన్మాత్రల వలన, జలభూతమునందు, యెరుపు వర్ణము, కఠినత్వ ధర్మము, షట్టించుట కర్మ , సుగంధ దుర్గంధగుణ చతతుష్కోణాకారము గల పృద్వీభూతము కలిగెను.

7 పంచమహాభూతములందు పంచీకృత పంచమహాభూతాంశములు, ఒక దానికన్న యొకటి సూక్ష్మాంశములుగా కలిగియున్న జగత్తుయనగా జ.అనగా షట్టుట గ.యనగా గతించుట ఈ పుట్టి చచ్చే 84 లక్షల జీవోపాదులు, పుట్టి సకల వ్యవహారములు చేసి, చచ్చుచుండుటము వలన జగత్తుయనబడును.

8 పంచమహాభూతముల ఏకైక రూపము మొత్తము విరాట్టు యిది ఈశ్వరుని స్థూలశరీరము. దీనిపాదములు వృద్వీ కటిప్రదేశము జలముగ, హృదయము అగ్ని భూతముగ కంఠము వాయుభూతముగ శిరస్సు ఆకాశభూతముగ, స్థూలశరీరమేర్పడినది ఈశరీరమునందే సకలభువనములు సూర్య చంద్రనక్షత్రములు జోతిర్మయ పురుషుడు, సూక్ష్మము హిరణ్య గర్భుడిగా

నుండి, సకల వ్యవహారములు జరుపుటకు కారణమగుచున్నవి గాన, ఈ మొత్తము విరాట్టు

7 ఈ విరాట్టుయందు జగత్తు గలదు

6 ఈజగత్తు పంచమహాభూతములయందుకలిగెను. విరాట్టుయందు జగత్తు గలదనిన ఈజగత్తు పంచమహాభూతములనుండి కలిగినదనుటకు కారణమేమి పంచమహా భూతములు యనగా! ఐదు కుండలు అనుకుందాము ఒకదానిమీద నొకటిపెట్టితే దొంతియనబడును, ఒక్కొక్క కుండలో చొక్కొక్క పదార్థముంచిన దొంతినుండి ఆ పదార్థములురావు యే కుండయందుంచిన పదార్థము ఆకుండనుండియే, తీయవలయును. అలాగే పృధ్వీభూతమునుండి కఠినరూపమైన మట్టి, జలభూతమునుండి ద్రవరూపమైన జలమును తీసి, మట్టిని తడిపి, బొమ్మగాజేసి, అగ్నిభూతములో నుంచి వేడిమినుంచి కాల్చి దానినుండి రూపములుయివ్వబడి, వాయుభూతమునుండి గాడ్పునింపి, ప్రాణము పోసి, అకాశభూతమునుండి దుఃఖము ఆశ–కోరిక–క్రోధము-మోహము -భయము–నింపి తానుసుఖము ఆనందము శాంతిగా డ్రైవర్‌గాచేరి యీ జగత్తును నడిపించును, గానావిరాట్టునుండి కలిగినదనక, పంచభూతముల నుండి జగత్తు గలిగినదని చెప్పబడినది– సీసపద్యము- నరము లస్తులు చర్మ నఖరోమమాంసముల మ పద్యము-భద్రాద్రిరామశతకమునందు చూడగలరు

5 పంచమహాభూతములయొక్క సూక్ష్మము పంచతన్మాత్రలు

4 పంచతన్మాత్రలయొక్క సూక్ష్మము మహదాంకారము

3 మహదాంకారముయొక్క సూక్ష్మము మహత్తు

2 మహత్తుయొక్క సూక్ష్మము అవ్యక్తము

1 అవ్యక్తంయొక్క సూక్ష్మము బ్రహ్మం

ఈ బ్రహ్మము అవ్యక్తస్వరూపమున మహత్తుయొక్క ప్రేరేపణచేమహదాంకారముతో గూడుకొని, పంచతన్మాత్రల ద్వారా, పంచమహాభూతములనుండి చేయుసృత్తి ఏమనగా, ఈజగత్తుయనగాపిండాండము. దీనిని పరిపాలిందుటకు జీవోపాదులను, మరియు విరాట్టాపవిశ్వము అనగా విశ్వాండము, దీనిని పరిపాలించుటకు ఈశ్వరుని సృష్టించెను, అనగా జీవ ఈశ్వర జగత్తులను సృష్టించెను. ఈ బ్రహ్మము ఇంతవరకూ సృష్టిచేయు అలోచనయేగాని సృష్టికాలేదు. ఇప్పుడు సృష్టిచేయుటకు ప్రణాళిక

1 బ్రహ్మముయొక్క అధోరూప పరిణామము అత్మ

2 అవ్యక్తముయొక్క పరిణామము పంచాదిదేవతలాయను 1 సదాశివుడు 2 ఈశ్వరుడు 3 రుద్రుడు 4 విష్ణువు 5 బ్రహ్మ

3 మహత్తుయొక్క అధోరూప పరిణామము పంచబీజం లాయను 1 అంబీజం 2 యంబీజం 3 రంబీజం 4 వంబీజం 5 లంబీజం

4 మహదాంకారముయొక్క అధోరూప పరిణామము పంచశక్తులాయను 1 పరాశక్తి 2 ఆదిశక్తి 3 జ్ఞానశక్తి 4 యిచ్ఛాశక్తి 5 క్రియాశక్తి

5 పంచతన్మాత్రలు 1 శబ్దతన్మాత్ర 2 స్పర్శతన్మాత్ర 3 రూపతన్మాత్ర 4 రసతన్మాంత్ర 5 గంధతన్మాత్ర

6 పంచమహాభూతములు 1 సునీలవర్ణం 2 ధూమ్రవర్ణం 3 అసితవర్ణం 4 శుభ్రవర్ణం 5 రక్తవర్ణం

7 జగత్తు పరిణామము అనాత్మ

8 విరాట్టు పరిణామము విశ్వరూపము

## సృష్టిక్రమము

సీ॥ ఆత్మయందునసేకమాకాశముదయించె: ఆకాశమందనిలంబుబుట్టె
అనిలంబువల్లను, అగ్నిహోత్రుడుబుట్టె। నగ్నిహోత్రునివల్లనప్పుబుట్టె
అప్పువల్లను,మహీయవనీస్థలియుబుట్టె! యవనియందోషదులమరబుట్టె
ఓషదులందునానొనరనన్నముబుట్టె! నన్నముందుననరులాది సకల

గీ॥ జంతుజాలంబులాయెనీజగయుగంబులాయెనీరీతిపరమాత్మమాయవలనా
రమ్యగుణధామభద్రాద్రిరామపరశు:రామనరసింహ్మదాససంరక్షితాహ్వా।

సీ॥ వసుధాజలంబగ్ని వాయువాకాశంబులివి పంచభూతముల్వీటియందు
రక్తశుభ్రాసితయుక్తధూమ్రసునీలముల్ గంధరసరూపములుస్పర్శ
శబ్దంబులును క్రియాశక్తి జ్ఞానేచ్ఛాదిశక్తులువరపరాశక్తి ల.వ,ర।యు,అ
లజ! విష్ణు త్రియంబకేశ్వర సదాశివులు-నొండొంటికి స్థిరముగాను

గీ॥ వర్ణగుణశక్తి బీజదే,వతలు,నుండు-నీకు,నేగుణం,బులులేవు, నిర్మలుడవు
రమ్యగుణధామభద్రాద్రిరామపరశురామనర్సింహ్మదానసౌంక్షి తాహ్వా?

సీ॥ రూఢిశబ్దస్పర్శరూపముల్ రసగంధముల్నైదు పృధ్వియందు
మరియుండు। రసరూప, శబ్దస్పర్శంబులునాలుగు జలమందు
జనితమై చెలిగియుండు। నగ్నిహూత్రమునందు, నమరి రూ,పస్పర్శ

శబ్దముల్ మూడు నిశ్చయముగాను వాయువందున స్పర్శవరశబ్దము లురెండు। నంబరంబందు శబ్దంబునొకటి। గీ॥ నొక్కటియులేక, దిక్కులుపిక్కటిలగ! వెలుగుచున్నావు లోవలవెలవలవక రమ్యగుణధామభద్రాద్రిరామపరఠ రామనరసింహ్మదాస సంరక్షితాహ్వ।

వర్ణములు: 1 పృథివిరక్తవర్ణము 2 జలముశుభ్రవర్ణము 3 అగ్ని అసిత వర్ణము 4 వాయువుధూమ్ర వర్ణము 5 ఆకాశము సునీలవర్ణము ( సూత్రాత్మపాటలీవర్ణము పసుపుపచ్చని వర్ణము కలిగియున్నది;

అంశములు! పృధ్వీకఠినాంశము 2 జలము ద్రవాంశము 3 అగ్ని తేజాంశం 4 వాయువు చలవాంశము 5ఆకాశము అవకాశాంశము సూత్రత్మ సర్వాంశముకలిగియున్నవి.

ఆకారములు: పృధ్వీచతుర్కోణాకారము జలము అర్ధచంద్రాకారము అగ్ని త్రికోణాకారము వాయువు షట్కోణాకరము ఆకాశముపర్తులాకారము ఆత్మ నిరాకారము ధర్మకర్మములు! పృధివికఠినముగానుండుట దాని ధర్మము ధరించుట అనగా। మెలికలు వేయుట దాని కర్మము।

2 జలము తడుపుటదాని ధర్మము, ముద్ద చేయుట దాని కర్మము

3 అగ్ని వెలుగుట ఉష్ణించుట దాని ధర్మము, కాల్చుట పక్వముజేయుట దానిధర్మము,

4 వాయువు చలించుట దాని ధర్మము, పొదుపు చేయుట చేర్చుట దాని కర్మము

5 ఆకాశము బయలుగానుండుట దాని ధర్మము, అవకాశమివ్వటము దాని కర్మము

6 సూత్రాత్మ తెలియజేయుట దానిధర్మము తెలునుకొనుట దాని కర్మము

## బ్రహ్మాండము

| బ్రహ్మము | అవ్యక్తము | మహత్తు | మహదాంకారము | పంచతన్మాత్రలు |
|---|---|---|---|---|

ఆత్మ

| | | | | |
|---|---|---|---|---|
| ఆకాశము | శబ్దము | పరాశక్తి | హంబీజము | సదాశివుడు |
| వాయువు | స్పర్శ | ఆదిశక్తి | యంబీజము | ఈశ్వరుడు |
| అగ్ని | రూపము | జ్ఞానశక్తి | రంబీజము | రుద్రుడు |
| జలము | రసము | యిచ్ఛాశక్తి | వంబీజము | విష్ణువు |
| పృథ్వి | గంధము | క్రియాశక్తి | లంబీజము | బ్రహ్మ |

పిండాండము

ఓషధులు
అన్నము
నరులాది
సకల జంతు
జాలంబులు

| స్థూల శరీరము | ఇంద్రియములు | జీవుడు | ప్రాణము | ఆత్మ |
|---|---|---|---|---|

## పంచభూతముల స్థూలసూక్ష్మ నిర్ణయములు

పృథ్వికన్న జలము సూక్ష్మము, జలముకన్న అగ్ని సూక్ష్మము, అగ్నికన్న వాయువు సూక్ష్మము, వాయువుకన్న ఆకాశము సూక్ష్మము, ఆకాశముకన్న సూత్రాత్మ సూక్ష్మము. సూత్రాత్మకన్న ఆకాశం స్థూలం, ఆకాశముకన్న వాయువు స్థూలం, వాయువుకన్న అగ్ని స్థూలం అగ్నికన్న జలముస్థూలం

జలము స్థూలం జలముకన్న పృధ్వీ స్థూలం।

వివరణము! 1 పృధ్వీ పట్టుకుంటే చేతపట్టుకబ్బును, జలము ఆ విధముగా చేతిపట్టుకు అబ్బుటలేదు, కాని, చేతియందు నిలుచును. కావున పృధ్వీకన్న జలము సూక్ష్మము 2 జలము చేతి పట్టుకబ్బదుగాని, చేతియందు నిలుచును అగ్ని చేతిపట్టుకబ్బదు, చేతియందు నిలువదు, దీనికి రూపముగలదు. దీని కణములను యితరసాధనములతోగైకొనవచ్చును. కావున జలముకన్న అగ్ని సూక్ష్మము 3 అగ్ని చేతిపట్టుకబ్బదు, చేతియందు నిలువదు, దీనికి రూపము కలదు. దీనికణములను ఇతర సాధనములచే గైకొనవచ్చును. వాయువునకు రూపములేదు స్పర్శమాత్రముకలదు. కావున అగ్నికన్న వాయువుసూక్ష్మము 4 వాయువునకు రూపములేదు స్పర్శగ్రాహకమగుచున్నది. ఆకాశమునకు కేవల శబ్దము గలదు. ఇది స్పర్శగ్రాహకముగాక, కేవలము శృతిరూపముగా నున్నది. గావున వాయువుకన్న ఆకాశము సూక్ష్మము. 5 ఆకాశమునకు రూప, స్పర్శలులేవు. కేవలము శృతిరూపముగా నున్నది. సూత్రాత్మతన్నుగాని, తన పద్ధతినిగాని, దేనిచేతెలియుటకు వీలులేదు కావున ఆకాశముకన్న సూత్రాత్మ సూక్ష్మము. 6 సూత్రాత్మతన్నుగాని, తనపద్ధతినిగాని, దేనిచే తెలియుటకు వీలులేదు. ఆకాశము శబ్దజనితమైయున్నది. ఇది స్పర్శగ్రాహకముగాక. కేవలము శృతిరూపముగ నున్నది. కావున సూత్రాత్మకన్న ఆకాశము స్థూలము 7 ఆకాశము శబ్దజనితమైయున్నది. ఇది స్పర్శగ్రాహకముగాక కేవలముశృతిరూపముగనున్నది వాయువు స్పర్శగ్రాహకమగుచున్నది కావున ఆకాశముకన్న వాయువుస్థూలము. 8 వాయువు స్పర్శగ్రాహకమగుచున్నది. దీనికి రూపములేదు। అగ్నికి రూపము కలదు. ఇదిచేతి పట్టుకబ్బదు చేతియందు నిలువదు దీని కణములను యితరసాధనములచే గైకొనవచ్చును కావున వాయువుకన్న అగ్ని స్థూలము. 9 అగ్నికి రూపము గలదు. ఇది చేతిపట్టుకబ్బదు, చేతియందు నిలువదు, దీని కణములను యితర సాధనములచే గైకొనవచ్చును. జలము చేతిపట్టుకబ్బదు. కానీ చేతియందు నిలుచును. కావున అగ్నికన్న జలము స్థూలము 10 జలము చేతిపట్టుకబ్బదు. చేతియందు నిలుచును? పృధ్వి పట్టుకుంటే చేతిపట్టుకబ్బును, కావున జలముకన్న పృధివి స్థూలము,

# పంచతన్మాత్రల స్థూలసూక్ష్మ నిర్ణయములు

1 పృథివీ భూతము యొక్క సూక్ష్మము గంధ తన్మాత్ర. గంధ తన్మాత్ర కన్న సూక్ష్మము రసతన్మాత్ర. రసతన్మాత్ర కన్న సూక్ష్మము రూపతన్మాత్ర. రూపతన్మాత్ర కన్న సూక్ష్మము స్పర్శతన్మాత్ర స్పర్శతన్మాత్ర కన్న సూక్ష్మము శబ్దతన్మాత్ర. శబ్దతన్మాత్ర కన్న సూక్ష్మము సూత్రాత్మ. సూత్రాత్మకన్న స్థూలము శబ్దతన్మాత్ర. శబ్దత న్మాత్రకన్న స్థూలము స్పర్శతన్మాత్ర. స్పర్శతన్మాత్రకన్న స్థూలము రూప తన్మాత్ర. రూపతన్మాత్రకన్న స్థూలము రసతన్మాత్ర. రసతన్మాత్రకన్న స్థూలము గంధతన్మాత్ర. వివరణము: 1 గంధతన్మాత్ర యిది ఘ్రాణేంద్రి యముచే తెలియబడును. ఘ్రాణేంద్రియముచే తెలియువాసనలు స్థూలాకృతి గానుండును, రసతన్మాత్ర, యిది జిహ్వేంద్రియముచే తెలియబడును. జిహ్వేంద్రియముచేత తెలియురుచులు, స్థూలము యొక్క సూక్ష్మభాగమై యున్నవి. కావున గంధ తన్మాత్రకన్న రసతన్మాత్ర సూక్ష్మము [illegible] రసత న్మాత్ర, యిది జిహ్వేంద్రియముచే తెలియబడును, జిహ్వేంద్రియముచే తెలి యురుచులు స్థూలముయొక్క సూక్ష్మ భాగమైయున్నది రూపతన్మాత్ర యిది నేత్రేంద్రియముచే తెలియబడును, నేత్రేంద్రియముచే తెలియబడు రూపములు స్థూల సూక్ష్మపద్ధతులుగాక, కేవలముఆకారమాత్రముగానున్నవి కావున రసతన్మాత్రకన్న రూపతన్మాత్ర సూక్ష్మము. 3 రూపతన్మాత్ర. యిదినేత్రేంద్రియముచే తెలియబడును. నేత్రేంద్రియముచే తెలియబడు రూపములు, స్థూల, సూక్ష్మ, పద్ధతులుగాకా, కేవలము ఆకారమాత్రముగా నున్నవి. మరియు గంధ, రస, రూప, తన్మాత్రలు స్థూల, సూక్ష్మ, ఆకార, రూపములుగానున్నవి, కావున యివివస్తువుయొక్క బాహ్యవృత్తిగానున్నవి స్పర్శ తన్మాత్ర త్వగింద్రియముచే తెలియబడును. త్వగేంద్రియముచే తెలియు స్పర్శలు, వస్తువుయొక్క అంతరవృత్తిగానున్నది కావునారూపత న్మాత్రకన్నా, స్పర్శతన్మాత్ర, సూక్ష్మము 4 స్పర్శతన్మాత్ర, యిది త్వగేంద్రియముచే తెలియబడును. త్వగేంద్రియముచే తెలియు స్పర్శత న్మాత్ర వస్తువుయొక్క అంతర్‌వృత్తిగానున్నది, శబ్ద తన్మాత్ర, యిది శ్రో త్రేంద్రియముచే తెలియబడును, శ్రోత్రేంద్రియముచే తెలియు శబ్దములు స్పర్శగ్రహణముగాక, కేవలశృతిరూపముగ నున్నది. కావున స్పర్శతన్మా త్రకన్న శబ్దతన్మాత్ర సూక్ష్మము, 5 శబ్దతన్మాత్ర. యిది శ్రోత్రేంద్రియ

ముచే తెలియబడును. శ్రోత్రేంద్రియములచే తెలియు శబ్దములు, స్పర్శగ్రహకముగాక, కేవలశృతిరూపముగా నున్నది. సూత్రాత్మ, యిది శబ్దముచే తెలియబడును. శబ్దముచే తెలియబడు సూత్రాత్మ పరావాక్కుగానున్నది. పరావాక్కనగా అంతఃకరణమునందలి తెలివి. యిది గుర్తు యని చెప్ప బడును. కావున శబ్దతన్మాత్రకన్నా సూత్రాత్మ సూక్ష్మము 6 సూత్రాత్మ యిది శబ్దముచే తెలియబడును. శబ్దముచే తెలియబడు సూత్రాత్మ పరా వాక్కుగానున్నది. పరావాక్కనగా అంతఃకరణమందలి తెలివి. దీనిని గుర్తుయని కూడా అంటారు. శబ్దతన్మాత్ర శ్రోత్రేంద్రియములచే తెలియ బడును. శ్రోత్రేంద్రియములచే తెలియబడు శబ్దము స్పర్శగ్రహకము గాక కేవలము శృతిరూపముగా నున్నది కావున సూత్రాత్మకన్న శబ్దతన్మాత్ర స్థూలము. 7 శబ్దతన్మాత్ర యిది శ్రోత్రేంద్రియములచే తెలియబడును శ్రోత్రేంద్రియములచే తెలియు శబ్దతన్మాత్ర స్పర్శగ్రాహకముగాక, కేవల శృతిరూపముగా మన్నది, స్పర్శతన్మాత్ర యిది త్వగింద్రియముచే తెలియ బడుచున్నది త్వగింద్రియముచే తెలియు స్పర్శతన్మాత్ర వస్తువుయొక్క అంతఃర్ వృత్తిగానున్నది. కావున శబ్దతన్మాత్రకన్న స్పర్శతన్మాత్రస్థూలం 8 స్పర్శతన్మాత్ర: యిది త్వగింద్రియముచే తెలియబడుచున్నది త్వగింద్రి యముచే తెలియు స్పర్శలు స్థూల, సూక్ష్మ ఆకార పద్ధతులుగాక, వస్తువు యొక్క అంతర్‌వృత్తిగానున్నది రూపతన్మాత్ర యిది నేత్రేంద్రియము లచే తెలియబడును. నేత్రేంద్రియములచే తెలియబడు రూపములు స్థూల, సూక్ష్మ పద్ధతులుగాక కేవలము ఆకార మాత్రముగానున్నవి. కావున, స్పర్శ తన్మాత్రకన్నా రూపతన్మాత్ర స్థూలము 9 రూపతన్మాత్ర! యిది నేత్రేంద్రియములచే తెలియబడును. నేత్రేంద్రియములచే తెలియు రూప ములు స్థూల, సూక్ష్మ పద్ధతులుగాక, కేవలఆకారముగా నున్నవి. రసతన్మాత్ర యిది జిహ్వేంద్రియములచే తెలియబడును. జిహ్వేంద్రియముచే తెలియు రుచులు స్థూలముయొక్క సూక్ష్మభాగమై యున్నవి. కావున రూపతన్మాత్ర కన్నా రసతన్మాత్ర స్థూలము. 10 రసతన్మాత్ర ఇది జిహ్వేంద్రియముచే తెలియబడును. జిహ్వేంద్రియముచే తెలియబడుచున్న రుచులు, స్థూలము యొక్క సూక్ష్మభాగమై యున్నవి. గంధతన్మాత్ర: యిది ఘ్రాణేంద్రియ ముచే తెలియబడును. ఘ్రాణేంద్రియముచే తెలియబడు వాసనలు స్థూలా కృతిగ నున్నవి. కావున రసతన్మాత్రకన్న గంధతన్మాత్ర స్థూలము.

# పంచశక్తుల స్థూల సూక్ష్మ నిర్ణయము:

గంధతన్మాత్రయొక్క సూక్ష్మము క్రియాశక్తి. క్రియాశక్తికన్నా యిచ్ఛాశక్తి సూక్ష్మము. యిచ్ఛాశక్తి కన్నా జ్ఞానశక్తి సూక్ష్మము. జ్ఞాన శక్తికన్నా ఆదిశక్తి సూక్ష్మము. ఆదిశక్తికన్నా పరాశక్తి సూక్ష్మము. పరాశక్తికన్నా సూత్రాత్మ సూక్ష్మము. సూత్రాత్మకన్నా పరాశక్తిస్థూలము పరాశక్తికన్నా ఆదిశక్తి స్థూలము. ఆదిశక్తికన్నా జ్ఞానశక్తి స్థూలము జ్ఞాన శక్తికన్నా యిచ్ఛాశక్తి స్థూలము. యిచ్ఛాశక్తికన్నా క్రియాశక్తిస్థూలము 1 క్రియాశక్తి: క్రియ అనగా పని, ఇది కర్మేంద్రియములచే చేయునట్టి పని. కర్మేంద్రియములచే చేయు పనులు స్థూలాకృతిగానుండును. ఇచ్ఛా శక్తి: ఇచ్ఛయనగా కోరిక ఇది అంతఃకరణమునందలి మనోరూపచలన పద్ధతిగా నున్నది. కావున క్రియాశక్తికన్నా ఇచ్ఛాశక్తి సూక్ష్మము. 2 యిచ్ఛాశక్తి; యిచ్ఛాయనగా కోరిక. యిది అంతఃకరణమునందలి మనో రూప చలన పద్ధతిగానున్నది. జ్ఞానశక్తి: జ్ఞానము అనగా తెలివి. ఇది అంతఃకరణమునందు, బుద్ధి రూప నిశ్చయ పద్ధతులుగానున్నవి. కావున యిచ్ఛా శక్తికన్నా జ్ఞానశక్తి సూక్ష్మము. 3 జ్ఞానము అనగా తెలివి. ఇది అంతఃకరణమునందలి బుద్ధిరూప నిశ్చయపద్ధతిగనున్నది. ఆది యనగ మొదలు, దీనిని జ్ఞానముచే నిట్టిదని తెలియుటకు వీలుగానున్నది, కావున జ్ఞానశక్తికన్నా ఆదిశక్తి సూక్ష్మము 4 ఆదిశక్తి; ఆది యనగా మొదలు యిది ఆదియగు గుర్తుగానున్నది. దీనిని జ్ఞానముచే ఇట్టిదని తెలియుటకు వీలుగానున్నది. పరాశక్తి: యిది పరారూపముగానుండి, ఇది ఆదియగు గుర్తునుండి సర్వమును ప్రచోదనమొనర్చుచున్నది. కావున ఆదిశక్తికన్నా పరాశక్తి సూక్ష్మము. 5 పరాశక్తి; పరా అనగా గొప్పది. లేక వేరుగా నుండునది. యిది ఆదియను గుర్తునుండి సర్వమును ప్రచోదన మొన రించు చున్నది. సూత్రాత్మ: సర్వమునకు ఆధారము. పరాశక్తిచే ఆది యను గుర్తునుంచి ప్రచోదన మొనర్చిన ప్రతివిషయము తెలుసుకొని తగు ఫలితముల నిచ్చుచున్నది. కావున పరాశక్తికన్నా సూత్రాత్మ సూక్ష్మము 6 సూత్రాత్మ: ఇది సర్వమునకు ఆధారముగానున్నది: ఇది పరాశక్తిచే ఆదియను గుర్తునుండి సర్వమును ప్రచోదనమొనర్చిన ప్రతి విషయమును తెలుసుకొని, దానికి తగు ఫలితముల నిచ్చుచున్నది. పరాశక్తి పరాయనగా

గొప్పది. లేక పై భాగమునందు వేరుగానుండునది. ఇది ఆదియగు గుర్తు నుండి సర్వమును ప్రచోదనమొనర్చుచున్నది. కావున సూత్రాత్మకన్న పరాశక్తి స్థూలము. 7 పరాశక్తి! పరాయనగా గొప్పది. పై భాగమున వేరుగానుండునది. యిది ఆదియను గుర్తునుంచి, సర్వమును ప్రచోదన మొనర్చుచున్నది ఆదియనగా మొదటిది, లేక గుర్తు. ఇది జ్ఞానముచే యిట్టిదని తెలియబడును. కావున పరాశక్తికన్న ఆదిశక్తి స్థూలము. 8 ఆదిశక్తి: అది యనగా మొదలు, లేక గుర్తు. యిది జ్ఞానముచే యిట్టిదని తెలియబడును. జ్ఞానము అనగా తెలివి. ఇది అంతఃకరణమందు, బుద్ధి రూప నిశ్చయముగానున్నది. కావున ఆదిశక్తికన్నా జ్ఞానశక్తి స్థూలము. 9 జ్ఞానశక్తి: జ్ఞానము అనగా తెలివి యిది అంతఃకరణమునందు బుద్ధి రూపనిశ్చయముగా నున్నది. యిచ్ఛాశక్తి: యిచ్ఛా యనగా కోరిక ఇది అంతఃకరణమునందలి మనోరూప చలనపద్ధతిగా నున్నది. కావున జ్ఞానశక్తి కన్నా యిచ్ఛాశక్తి స్థూలము. 10 యిచ్ఛాశక్తి: యిచ్ఛా యనగా కోరిక యిది అంతఃకరణమునందలి మనోరూప చలనపద్ధతిగా నున్నది క్రియాశక్తి క్రియ అనగా పని. యిది కర్మేంద్రియములచే చేయబడును. మరియు ఈ కర్మేంద్రియములచే చేయబడు పనులు స్థూలాకృతిగానున్నవి. కావున యిచ్ఛాశక్తికన్నా క్రియాశక్తి స్థూలం.

## బీజములయొక్క స్థూల సూక్ష్మములు:

క్రియాశక్తియొక్క సూక్ష్మము లంబీజము. లంబీజముకన్న వంబీజము సూక్ష్మము. వంబీజముకన్న రంబీజము సూక్ష్మము. రంబీజముకన్న యంబీజము సూక్ష్మము, యంబీజముకన్న అంబీజము సూక్ష్మము. అంబీజముకన్న సూత్రాత్మ సూక్ష్మము. సూత్రాత్మకన్న అంబీజము స్థూలము. అంబీజముకన్న యంబీజము స్థూలము. యంబీజముకన్న రంబీజము స్థూలం రంబీజముకన్న వంబీజము స్థూలము. వంబీజముకన్న లంబీజము స్థూలం.

## వివరణ:

1 లంబీజము! యిది పృథ్వీవాచకము. స్థంభనక్రియ. స్థంభించిన ప్రతిదీ స్థూలముగా యుండును. వంబీజము జలవాచకము. మోహనక్రియ కావున లంబీజముకన్నా వంబీజము సూక్ష్మము. 2 వంబీజము: వంబీజము జల

వాచకము మోహన క్రియ. రంబీజము అగ్నివాచకము. మారణక్రియ కావున వంబీజముకన్న రంబీజము సూక్ష్మము. 3 రంబీజము: రంబీజము అగ్నివాచకము, మారణక్రియ. యంబీజము వాయువాచకము ఉచ్చాటన క్రియ. కావున రంబీజముకన్న యంబీజము సూక్ష్మము. 4 యంబీజము యంబీజము వాయువాచకము, ఉచ్చాటనక్రియ. అంబీజము, బ్రహ్మస్వరూపమగు ఆకాశవాచకము, ఆకర్షణక్రియ. కావున యంబీజముకన్నా అంబీజము సూక్ష్మము. 5 అంబీజము: అంబీజము బ్రహ్మస్వరూపమగు ఆకాశ వాచకము ఆకర్షణ క్రియ. సూత్రాత్మ అన్ని బీజములకు ఆధారముగా నున్నది. కావున అంబీజముకన్న సూత్రాత్మ సూక్ష్మము. 6 సూత్రాత్మ: ఇది అన్ని బీజములకు ఆధారముగానున్నది అంబీజము బ్రహ్మస్వరూపమైన ఆకాశవాచకము, ఆకర్షణక్రియ. కావున సూత్రాత్మకన్న అంబీజము స్థూలము. 7 అంబీజము: అంబీజము బ్రహ్మస్వరూపమైన ఆకాశవాచకము ఆకర్షణక్రియగలది. యంబీజము వాయువాచకము, ఉచ్చాటన క్రియ గలది. కావున అంబీజముకన్న యంబీజము స్థూలము. 8 యంబీజము: యంబీజము వాయువాచకము, ఉచ్చాటన క్రియగలది. రంబీజము అగ్ని వాచకము, మారణ క్రియగలది కావున యంబీజముకన్న రంబీజము స్థూలం 9 రంబీజము; రంబీజము అగ్నివాచకము, మారణక్రియగలది వంబీజము జలవాచకము, మోహనక్రియగలది. కావున రంబీజముకన్న వంబీజము స్థూలము 10 వంబీజము: జలవాచకము మోహన క్రియ లంబీజము పృథ్వీవాచకము, స్తంభనక్రియ గావున వంబీజముకన్న లంబీజము స్థూలము

## దేవతలయొక్క స్థూల సూక్ష్మ నిర్ణయములు:

లంబీజముయొక్క సూక్ష్మము బ్రహ్మ, బ్రహ్మకన్న సూక్ష్మము విష్ణువు, విష్ణువుకన్న సూక్ష్మము రుద్రుడు, రుద్రునికన్న సూక్ష్మము ఈశ్వరుడు, ఈశ్వరునికన్న సూక్ష్మము సదాశివుడు. సదాశివునికన్న సూక్ష్మము సూత్రాత్మ, సూత్రాత్మకన్న స్థూలము సదాశివుడు, సదాశివునికన్న స్థూలము ఈశ్వరుడు, ఈశ్వరునికన్న స్థూలము రుద్రుడు, రుద్రునికన్న స్థూలము విష్ణువు, విష్ణువుకన్న స్థూలము బ్రహ్మ.

# వివరణః

1 బ్రహ్మ; యితడు సృష్టికర్త. ఇతడు 84 లక్షల జీవోపాదులను పృథ్వి యను క్షేత్రమునుండి పుట్టించుచుండును, విష్ణువు పాలనకర్త, ఇతడు బ్రహ్మచే సృష్టింపబడిన 84 లక్షల జీవోపాదులను జలక్షేత్రమునుండి పోషించుచుండును. పోషింపబడు విషయములు స్థూలపద్ధతిగాక సూక్ష్మ పద్ధతిగా తెలియబడుచుండును. కావున బ్రహ్మకన్న విష్ణువు సూక్ష్మము, 2 విష్ణువు ఇతడు పాలనకర్త, అనగా స్థితికారకుడు, బ్రహ్మచే సృష్టించబడిన 84 లక్షల జీవోపాదులను జలక్షేత్రమునుండి పోషించుచుండును, పోషించు విషయములు స్థూల పద్ధతిగాక సూక్ష్మ పద్ధతిగానుండును, రుద్రుడు లయకర్త, విష్ణువుచే పోషించబడు 84 లక్షల జీవోపాదులను ప్రారబ్ధకర్మ లనుభవించినతోడనే అగ్ని క్షేత్రమునుండి స్థూలశరీరాదుల యందుండు సూక్ష్మశరీరాదులను వేరుచేసి మరణము కలిగించుచున్నాడు, కావున విష్ణువు కన్న రుద్రుడు సూక్ష్మము, 3 రుద్రుడు! ఇతడు లయకర్త, విష్ణువుచే జలక్షేత్రమునుండి పోషింపబడు 84 లక్షల జీవోపాదులను ప్రారబ్ధకర్మ అనుభవించిన తరువాత అగ్నిక్షేత్రమునుండి స్థూలశరీరాదులయందుండు సూక్ష్మజీవులను వేరుపరచి మరణము కలిగించుచున్నాడు, ఈశ్వరుడు విశృతకర్త, ఇతడు రుద్రునిచే అగ్నిక్షేత్రమునుండి మరణము కలిగించిన సూక్ష్మశరీరాదులను వేరుపర్చగనే వాయుక్షేత్రమునుండి తనయందు పదునాల్గు లోకములను కల్పించి వారివారి కర్మానుసారము సంచిత కర్మలను భవించుటకు అయాలోకములయందు చేర్చుచున్నాడు. కావున రుద్రునికన్న ఈశ్వరుడు సూక్ష్మము. 4 ఈశ్వరుడు: యితడు విశృతకర్త. రుద్రునిచే అగ్నిక్షేత్రమునుండి స్థూలశరీరాదులయందుండు సూక్ష్మజీవులను వేరుపర్చిన వాటిని ఈశ్వరుడు వాయుక్షేత్రమునుండి తనయందు 14 లోకములను కల్పించి వారి వారి సంచితకర్మలను అనుభవించుటకు అయాలోకములందు చేర్చుచున్నాడు. సదాశివుడు ఆకర్షణక్రియుడు. ఈశ్వరునిచే అయా లోకములయందు వాయుక్షేత్రముచే చేర్పబడిన సూక్ష్మశరీరాదులు సంచిత కర్మలనుభవించినతోడనే సదాశివుడు ఆకాశక్షేత్రమునుండి సూక్ష్మశరీరాదుల యందుండు కారణజీవచయంబుల వేరుపర్చి ఆకర్షించి, ఆకాశక్షేత్ర అజ్ఞాన రూపమగు మరుపునందు జేర్చుచున్నాడు. కావున ఈశ్వరునికన్న సదా

శివుడు సూక్ష్మము. 5 సదాశివుడు: సదాశివుడు ఆకర్షణక్రియుడు. ఈశ్వరునిచే వాయుక్షేత్రమునుండి 14 లోకములలో నుండు సూక్ష్మజీవోపాదులను సంచితకర్మలనుభవించగానే సూక్ష్మజీవోపాదులయందుండు కారణరూప జీవచయంబుల ఆకాశక్షేత్రమునుండి ఆకర్షించి అజ్ఞానరూప అవిద్యయగు మరుపునందు చేర్చబడిన కారణరూపజీవచయంబుల అంతరమునందు ఆగామి రూపకర్మలను ప్రారబ్ధకర్మలుగా మార్చి అవస్థాత్రయంబులననుభవించుటకు పునర్జన్మ పొందుటకు చేర్చుచున్నాడు. కావున సదాశివునికన్న సూత్రాత్మ సూక్ష్మము. 6 సూత్రాత్మ: సూత్రాత్మ చేతనసాక్షి రూపుడు. సదాశివునిచే ఆకాశక్షేత్రమునందు మరుపురూప అవిద్యావరణమందుండు కారణరూప జీవచయంబుల అంతరమునందు ఆగామి రూపకర్మల ప్రారబ్ధరూపములుగా మార్చి అవస్థాత్రయంబులననుభవించుటకు పునర్జన్మ పొందుటకు చేర్చుచున్నాడు. సదాశివుడు ఆకర్షణక్రియుడు మరుపురూప అవిద్యావరణము నందుండు కారణరూపజీవచయంబుల అంతరమునందు సూత్రాత్మచే ఆగామి రూపకర్మలను ప్రారబ్ధరూపములుగా మార్చి ఉపాధుల అంతరమునందు జేర్చి అవస్థాత్రయంబుల పొందుటకు సిద్ధపరచబడినవాటిని ఆకాశక్షేత్రము నుండి అవిద్యావరణ మరుపునుండి వదులుచున్నాడు. కావున సూత్రాత్మ జన్నా సదాశివుడు స్థూలం. 7 సదాశివుడు: ఇతడు ఆకర్షణ రూపుడు. అవిద్యావరణ మరుపునందుండు కారణరూప జీవచయంబుల యొక్క అంతఃకరణములయందు సూత్రాత్మచే ఆగామిరూపకర్మలను ప్రారబ్ధరూపములుగా మార్చి, చేర్చి అవస్థాత్రయంబులను తెలియుటకు పునర్జన్మలు పొందుటకు సిద్ధపరచబడినవాటిని సదాశివుడు ఆకాశక్షేత్రమునుండి అవిద్యావరణరూపమగు మరుపునుండి వదులుచున్నాడు. ఈశ్వరుడు విశ్వతకర్త సదాశివునిచే విడువబడిన కారణజీవరూపచయంబులను ఆకాశక్షేత్రమగు అవిద్యావరణ రూపమగు మరుపునుండి వదలిన వాటిని వారివారి కర్మానుసార ఫలంబులననుభవించుటకు ఋణానుసారముగా ఆయా ఉపాధుల అంతఃరమునందు అనగా గర్భకోశములయందు వాయుక్షేత్రము నుండి చేర్చుచున్నాడు. కావున సదాశివునికన్న ఈశ్వరుడు స్థూలము. 8 ఈశ్వరుడు: ఇతడు విశ్వత కర్త. సదాశివునిచే ఆకాశక్షేత్రమగు మరుపురూప అవిద్యావరణమునుండి విడువబడిన కారణరూప జీవచయంబుల వారివారి కర్మానుసారము ఋణానుసారము జన్మలు పొందుటకు వాయుక్షేత్రమునుండి ఆయా ఉపాధుల అంతః

ర్భమునందు అనగా గర్భకోశములయందు చేర్చుచున్నాడు. రుద్రుడు లయ కర్త. రూపములనిచ్చి రూపముల మార్చుచుండును. ఇతడు ఈశ్వరునిచే కారణరూప జీవచయంబులను ఉపాధుల గర్భకోశములయందు చేర్చబడు వాటిని కర్మలనుభవించుటకు వారివారి కర్మానుసారముగా సూక్ష్మ శరీరాదులను అగ్నిక్షేత్రమునుండి ఇచ్చుచున్నాడు. కావున ఈశ్వరునికన్న రుద్రుడు స్థూలము. 9 రుద్రుడు: ఇతడు లయకర్త. రూపములనిచ్చి రూపముల మార్చుచుండును, ఈశ్వరునిచే కారణరూప జీవచయంబులను వారివారి కర్మానుభవము అనుభవించుటకు రుణానుబంధముగా ఆయా ఉపాధుల గర్భకోశములలో వాయుక్షేత్రమునుండి ప్రవేశించిన వాటిని రుద్రుడు కర్మానుభవములకు తగు రూపముల సూక్ష్మశరీరాదులకు అగ్నిక్షేత్రమునుండి ఇచ్చుచున్నాడు. విష్ణువు పాలనకర్త. ఇతడు ఉపాదుల గర్భకోశములయందు రుద్రునిచే సూక్ష్మరూపముగానున్న సూక్ష్మశరీరాదులను స్థూలరూపు పొందు వరకు మరియు ఉపాధుల అంతఃకరమునుండి బాహ్యమునకు జనించినవాటిని విష్ణువు జలక్షేత్రమునుండి పోషించుచుండును. కావున రుద్రునికన్న విష్ణువు స్థూలము. 10 విష్ణువు: ఇతడు పాలనకర్త: ఇతడు ఉపాదుల గర్భకోశములయందు రుద్రునిచే సూక్ష్మరూపములు ధరించిన వాటిని స్థూల రూపము వచ్చువరకు మరియు ఉపాదుల గర్భకోశమునుండి బహిర్గతమైన వాటిని జలక్షేత్రమునుండి పోషించుచుండును: బ్రహ్మ సృష్టికర్త. ఇతడు ఈశ్వరునిచే గర్భకోశములయందు చేర్చబడిన కారణరూప జీవచయంబులను రుద్రుడు సూక్ష్మరూపములనివ్వగనే విష్ణువు పోషించుచుండగా, బ్రహ్మ సూక్ష్మశరీరాదులను పృదివిక్షేత్రమునుండి స్థూలరూపములుగా విశదపర్చి ఉపాధి అంతఃకరమునందు వృద్ధిబొందించి తొమ్మిది నెలలకు ఉపాధి బాహ్యమునకు తీసుకొని వచ్చును. అనగా జనింప జేయును. కావున విష్ణువుకన్న బ్రహ్మ స్థూలము. ఇవి వ్యష్టి వృత్తులు,

## సమిష్టి వృత్తులు:

1 పృద్వీభూతము యొక్క సూక్ష్మము గంధతన్మాత్ర. గంధతన్మాత్ర యొక్క సూక్ష్మము క్రియాశక్తి క్రియాశక్తి యొక్క సూక్ష్మము లంబీజము లంబీజము యొక్క సూక్ష్మము బ్రహ్మ. బ్రహ్మయొక్క సూక్ష్మము సూత్రాత్మ ఈ సూత్రాత్మ పృద్వీభూతముయొక్క సూక్ష్మాతి సూక్ష్మ అతి

సూక్ష్మ స్వరూపమైన బ్రహ్మయనే ఆదిదేవత స్వరూపుడై బ్రహ్మయొక్క స్థూలముయగు లంబీజము ప్రేరేపణచే లంబీజముయొక్క స్థూలమగు క్రియా శక్తితో గూడుకొని, క్రియాశక్తికి స్థూలమగు గంధతన్మాత్రద్వారా, గంధ తన్మాత్రకు స్థూలమగు పృధ్వీభూతమను క్షేత్రమునుండి ఎనుబది నాలుగు లక్షల జీవోపాదులను సృష్టించుచుండును ఇది పృధ్వీభూత క్షేత్రస్తభకము.

2 పృధివీభూతముకన్నా సూక్ష్మము జలభూతము. జలభూతము యొక్క సూక్ష్మము రసతన్మాత్ర. రసతన్మాత్రయొక్క సూక్ష్మము యిచ్ఛాశక్తి. యిచ్ఛాశక్తియొక్క సూక్ష్మము వంబీజము. వంబీజముయొక్క సూక్ష్మము విష్ణువు అనే ఆధిదేవత. విష్ణువుయొక్క సూక్ష్మము సూత్రాత్మ సూత్రాత్మ జలభూతముయొక్క సూక్ష్మాతిసూక్ష్మ అతిసూక్ష్మస్వరూపమైన విష్ణువనే ఆధి దేవత స్వరూపుడై విష్ణువుయొక్క స్థూలమగు వంబీజముయొక్క ప్రేరేపణచే వంబీజముయొక్క స్థూలము యిచ్ఛాశక్తితో గూడుకొని, యిచ్ఛాశక్తియొక్క స్థూలము రసతన్మాత్రద్వారా, రసతన్మాత్రయొక్క స్థూలము జలమనే క్షేత్ర మునుండి విష్ణుస్వరూపుడై ఎనుబది నాలుగు లక్షల జీవోపాదులను పోషించు చుండును: యిది జలభూత క్షేత్ర స్థభకము.

3 జలభూతముకన్నా అగ్నిభూతము సూక్ష్మము. అగ్నియొక్క సూక్ష్మము రూపతన్మాత్ర, రూపతన్మాత్రయొక్క సూక్ష్మము జ్ఞానశక్తి, జ్ఞానశక్తియొక్క సూక్ష్మము రంబీజము, రంబీజముయొక్క సూక్ష్మము రుద్రుడనే ఆధిదేవత, రుద్రునియొ'క్కసూక్ష్మము సూత్రాత్మ, ఈ సూత్రాత్మ అగ్నిభూతముయొక్క సూక్ష్మతి సూక్ష్మఅతి సూక్ష్మమైన రుద్రుడనే ఆధిదేవత స్వరూపుడై. రుద్రుని యొక్క స్థూలము రంబీజము ప్రేరేపణచే, రంబీజముయొక్క స్థూలము జ్ఞాన శక్తితో గూడుకొని జ్ఞానశక్తికి స్థూలమైన రూపతన్మాత్ర ద్వారా, రూపతన్మా త్రయొక్క స్థూలము అగ్నిభూతమనే క్షేత్రము నుండిచేయుప్రవృత్తియేమనగా స్థూలశరీరాదులయందు సూక్ష్మజీవుల వేరపరచి, మరణముకలిగించుట కార ణరూపజీవపయంబులకు సూక్ష్మశరీరాదులు కల్పించి రూపమునిచ్చుచున్నది ఇది అగ్నిభూతక్షేత్రస్థభకము?

4 అగ్నిభూతముకన్న సూక్ష్మము వాయుభూతము వాయుభూతముయొక్క సూక్ష్మము స్పర్శతన్మాత్ర స్పర్శతన్మాత్రయొక్క సూక్ష్మము ఆదిశక్తి ఆది శక్తి యొక్క సూక్ష్మము యంబీజం, యంబీజం యొక్కసూ క్ష్మము ఈశ్వరుడనే ఆది దేవత. ఈశ్వరుని యొక్క సూక్ష్మము సూత్రాత్మ

ఈసూత్రాత్మ వాయుభూతముయొక్క సూక్ష్మాతిసూక్ష్మ, అతిసూక్ష్మ స్వరూపుడైన ఈశ్వరుడనే అదిదేవత స్వరూపుడై, ఈశ్వరునియొక్క స్థూలమైన యంబీజము ప్రేరేపణచే యంబీజమునకు స్థూలమైన ఆదిశక్తితో గూడుకొని ఆదిశక్తికి స్థూలమైన స్పర్శతన్మాత్ర ద్వారా స్పర్శతన్మాత్రకు స్థూలమైన వాయుక్షేత్రమునుండి చేయువృత్తి ఏమనగా స్థూలశరీరాదులయందుండు సూక్ష్మరూప జీవచయంబులు రుద్రునిచే స్థూల శరీరంబులు దహింపబడిన వాటిని సంచితకర్మలనుభవించుటకు తనయందుంచి మరియు సదాశివునిచే మరుపునుండి విడువబడినవాటిని ప్రారబ్ధకర్మలనుభవించుటకు ఆయా పుపాదుల గర్భకోశమందు రుణానుబంధముగా వాయుక్షేత్రమునుండి చేర్పుచున్నాడు. యిది వాయుభూత క్షేత్రస్థలకము. 5 వాయుభూతము యొక్క సూక్ష్మము ఆకాశభూతము. ఆకాశభూతముయొక్క సూక్ష్మము శబ్ద తన్మాత్ర. శబ్దతన్మాత్రయొక్క సూక్ష్మము పరాశక్తి. పరాశక్తి యొక్క సూక్ష్మము అంబీజము. అంబీజముయొక్క సూక్ష్మము సదాశివుడు. సదాశివుని యొక్క సూక్ష్మము సూత్రాత్మ. ఈ సూత్రాత్మ ఆకాశభూతముయొక్క సూక్ష్మాతి సూక్ష్మ అతిసూక్ష్మ స్వరూపుడగు సదాశివుని స్వరూపమయిన సదాశివునియొక్క స్థూలము అంబీజముయొక్క ప్రేరేపణచే, అంబీజము యొక్క స్థూలమైన పరాశక్తితో గూడుకొని, పరాశక్తియొక్క స్థూలమైన శబ్దతన్మాత్రద్వారా శబ్దతన్మాత్రకు స్థూలమైన ఆకాశభూతమనే క్షేత్రము నుండి చేయు వృత్తి ఏమనగా! సూక్ష్మశరీరాదులయందులుండు కారణరూప జీవచయంబుల వాతర్షించి మరుపునందు చేర్పుచున్నది. మరియు మరుపు నుండి వదులుచున్నది. యిది ఆకాశక్షేత్రముయొక్క స్థలకము.

## సమిష్టి వృత్తులు:

ఈ సూత్రాత్మ తనకు స్థూలరూపమైన పంచాది దేవతల స్వరూపమున దేవతలయొక్క స్థూలరూపమగు పంచబీజముల ప్రేరేపణచే, పంచబీజములయొక్క స్థూలమగు పంచశక్తులతో కూడుకొని పంచశక్తులకు స్థూలమగు పంచతన్మాత్రలద్వారా పంచతన్మాత్రలయొక్క స్థూలమైన పంచభూతములను క్షేత్రములనుండి చేయువృత్తి పృథ్వినుండి సృష్టి, జలమునుండి స్థితి, అగ్నినుండి మరణము, వాయువునుండి విస్తీర్ణము, అకాశమునుండి ఆకర్షణ జీవేశ్వర జగత్తును వ్యవహరించుచున్నాడు.

సీ॥ సప్యాది ఫలితార్థ సంయుతంబగు క్షేత్ర మతిభూతపంచకంబెంచవలయు
క్షేత్రోద్భవంబులై చెలరేగు తన్మాత్ర లై దుగాయెరుపులంచెంచవలయు
వ్యవసాయ కృషులకై ఏర్పరుచు పనిముట్లు పంచశక్తులుగ భావించ
వలయు॥ కాలగర్భంబనే ఘన ఆద్యపదనంచు విత్తన బీజాది వితతులెల్ల

గీ॥ జల్లి కృషిజేసి అనుభవస్మరణిదెల్పు పంచ ఆదిదేవతల స్వరూపరైతు
జగయుగంబులనడిపించు జంత్రకారు డలరుచున్నాడు నీరీతిఅంభుజాక్షి

1 పరాకాశము = ఉత్తమ పురుషుడు స్వయంప్రకాశము చేతన్యబ్రహ్మము
2 దహరాకాశము = అక్షరపురుషుడు సమిష్టి అంతఃకరణము మహామనస్సు
3 నిరవయాకాశము = పరాప్రకృతిసూత్రాత్మసమిష్టిప్రాణము అక్షరపురుషుడు

ఈ త్రివిధ ద్రవ్యసమూహమును బ్రహ్మాండమని అంటారు.

## విశ్వాండ నిర్ణయము:

| | | | |
|---|---|---|---|
| 1 | సూర్యాకాశము | ఈశ్వరుడు | అంతఃకరణము |
| 2 | భూతాకాశము | ,, | శిరోభాగము |
| 3 | వాయువు | ,, | కంఠస్థానము |
| 4 | అగ్ని | ,, | హృదయము |
| 5 | జలము | , | కటిస్థానము |
| 6 | పృధ్వి | ,, | పాదములు |

ఈ షడ్విధద్రవ్యములకు విశ్వాండము విశ్వాభిమాని ఈశ్వరుడని నిర్ణయము

## పిండాండ నిర్ణయము:

### పంచభూతములనుండి పిండాండము స్థూలశరీరము

| | ఆకాశము | వాయువు | అగ్ని | జలము | పృధ్వి |
|---|---|---|---|---|---|
| ఆకాశము | శోకము | కామము | క్రోధము | మోహము | భయము |
| వాయువు | ఎగురుట | పరుగెత్తుట | నడచుట | చాచుట | ముడుచుట |
| అగ్ని | నిద్ర | పిపాసదప్పిక | క్షుత్తు ఆకలి | సంగమము | ఆలస్యము |
| జలము | శ్లేష్మము | స్వేదము | మూత్రము | శుక్లము | రక్తము |
| పృధివి | నఖరోమము | చర్మము | నరములు | మాంసము | ఎముకలు |

1 బ్రహ్మాండమునందున్న పంచభూతములనుండి పిండాండమునందు స్థూల శరీరమాయెను. స్థూలశరీరమెట్లాయెననగా? బ్రహ్మాండమునందున్న పృద్ధ్వీ భూతమునుండి పిండాండమునందు 1 నరములు, 2 ఎముకల (అస్థులు), 3 చర్మము మాంసము, 5 నఖరోమములు ఏర్పడెను. ఆపృద్ధ్వీభూతముయొక్క ముఖ్యాంశము ఎముకలనే పదార్థమాయెను. ఎముకలయందు ఇతర భూత మిశ్రమము లేదు. కేవలం పృద్ధ్వీభూతముయొక్క కఠినాంశమేగలదు. కావున ఎముకలనే పదార్థమాయెను.

అ) పృద్ధ్వీభూతాంశమునందు జలభూతాంశముచేరుటవలన మాంసముయనే పదార్థమాయెను. మాంసమునందు జలభూతాంశముయొక్క మృదుత్వము మరియు పృద్ధ్వీభూతాంశముయొక్క కఠినాంశము గలదు కావున మాంస మనే పదార్థమాయెను ఇ) పృద్ధ్వీభూతాంశమునందు అగ్నిభూతాంశము చేరుటచే నరములనే పదార్థమాయెను, నరములయందు అగ్నిభూతాంశము యొక్క తేజస్సు, వేడిమి వలన రక్త చలనము కలిగెడి వేడిమి మరియు కఠినరూపమైన నరములయందు రక్త ప్రసరణము జరుగుటకు రంధ్రము అనగా భూమి యొండుటమునుండి నెఱ్ఱలు బొందుచుండును. కావున అగ్ని భూతాంశమునుండి రంధ్రము వడి ప్రసరణము నొందుట, పృద్ధ్వీభూతాంశ ముయొక్క కఠినత్వముగలదు. కావున నరములనే పదార్థములాయెను ఈ) పృద్ధ్వీ భూతాంశమునందు వాయుభూతాంశము చేరటమునుండి చర్మ మనే పదార్థమాయెను. చర్మమునందు వాయుభూతాంశ స్పర్శలు తెలి యుట మరియు పృద్ధ్వీ భూతాంశమైన కఠినత్వము కలదు, కావున చర్మ మనే పదార్థమాయెను ఉ) పృద్ధ్వీ భూతాంశమునందు ఆకాశ భూతాంశము చేరుటమునుండి నఖరోమములనే పదార్థమాయెను: నఖరోమములయందు ఆకాశ భూతాంశమగు శూన్యత్వమేగలదు. అనగా నఖరోమములు కత్తి రించినపుడు బాధ తెలియుటములేదు ఆకాశ భూతముయొక్క శూన్యత్వం మరియు పృద్ధ్వీభూతాంశమగు కఠినత్వము కలదు. కావున నఖరోమము లనే పదార్థములాయెను. ఈ విధముగా పృద్ధ్వీభూతమునుండి యెముకలు మాంసము. నరములు, చర్మము, నఖరోమములాయెను.

2 అ) బ్రహ్మాండమునందున్న జలభూతమునుండి పిండాండమునందు శుక్లము రక్తము, మాంసము, చెమట, లాలాజలములాయెను. జలభూతాంశము

యొక్క ముఖ్యాంశము శుక్లమనే పదార్థమాయెను. శుక్లము గర్భహేతువుగా నున్నది. జలబిందువులు బీజహేతువగుచున్నది మరియు తడుపుటగలదు జలముయొక్క సూక్ష్మాంశము ప్రాణమని, ఈ ప్రాణమునకు శుక్లమాధార ముగానున్నది కావున శుక్లమనే పదార్థమాయెను. ఆ జలభూతాంశము నందు పృద్ధ్వీభూతాంశము చేరుటమునుండి రక్తము పృద్ధ్వీభూతోత్పాదియగు మరియు గడ్డకట్టు స్వభావము కలదు: మరియు జలభూతాంశము తడు పుట గలదు. కావున రక్తమనే పదార్థమాయెను ఇ) జలభూతాంశము నందు అగ్నిభూతాంశము చేరుటమువలన మూత్రమనే పదార్థమాయెను. మూత్రమునందు అగ్నిభూతము యొక్క వేడిమి, జలభూతముయొక్క తడు పుట గలదు: కావున మూత్రమనే పదార్థమాయెను ఈ జలభూతము నందు వాయుభూతాంశము చేరుటచే స్వేదమనేపదార్థమేర్పడెను. స్వేదము (చమట) శ్రమవల్ల కలుగుచున్నది. వాయువుగూడా శ్రమ స్వరూపమైనది మరియు జలభూతాంశమైన తడుపుటగలదు. కావున స్వేదమనే పదార్థ మాయెను. ఈ) జలభూతాంశమునందు ఆకాశభూతాంశము చేరుటవలన శ్లేష్మము(లాలాజలము) యనే పదార్థమాయెను. లాలాయనగా ఊటలు. ఇది నోరులో చలమలనుండి ఊరుచుండును. దీనియందు ఆకాశభూతాంశ ముయగు శమ్మి, శూన్యమునుండి కలుగుట మరియు జలభూతాంశమగు తడుపుట గలదు కావున లాలాజలమనే పదార్థమేర్పడెను

3 బ్రహ్మాండమునందున్న అగ్నిభూతాంశమునుండి పిండాండమునందు ఆకలి దప్పిక, నిద్ర, సంగమము, అలస్యంములాయెను. అ) అగ్నిభూతాంశము యొక్క ముఖ్యాంశము అకలి అనే పదార్థమాయెను క్షుత్తు యనగా ఆకలి ఆకలి గలిగినపుడు శరీరమును దహించును. అగ్నికిగూడా దహించు స్వభా వము కలదు. దీనియందు యితర భూతాంశ మిశ్రమము లేదు కేవలము అగ్నియొక్క దహించు పద్ధతియేగలదు. కావున (క్షుత్తు) ఆకలియనే పదార్థ మాయెను. ఆ) అగ్నిభూతాంశమునందు పృద్ధ్వీభూతాంశము చేరుటచే ఆలస్యమనే పదార్థమాయెను. ఆలస్యమనగా సోమరితనము. దీనియందు పృద్ధ్వీభూతాంశము గు జడత్వము, అలస్యము అగ్నిభూతాంశ మాంద్యము కలదు. కావున ఆలస్యమనే పదార్థమాయెను. ఇ) అగ్నిభూతాంశము నందు జలభూతాంశము చేరుటచే (కాంతి) సంగమమనే ప[illegible]ర్థమాయెను.

సంగమమునందు జలభూతాంశము యొక్క ద్రవత్వము, అగ్ని భూతాంశమగు వేడిమిగలదు. మరియు సంగమము నుండి తేజస్సు కాంతిహీనమగుచున్నది. కావున సంగమమనే పదార్థమాయెను. ఈ అగ్ని భూతాంశమునందు వాయుభూతాంశము చేరుటమువలన పిపాస(దూపదప్పిక) యనే పదార్థమాయెను. దప్పిక గలిగినపుడు గొంతు అరుట జరుగుచున్నది. అరుటయందు వాయుభూతాంశము మరియు అగ్ని భూతాంశముయొక్క వేడిమి గలదు. కావున దప్పికయనే పదార్థమాయెను. ఉ) అగ్ని భూతాంశమందు ఆకాశభూతము చేరుటచే సుప్తి (నిద్ర) గలుగుచున్నది. నిద్రయందు ఆకాశ భూతాంశము యొక్క తెలివి శూన్యత్వం మరియు అగ్ని భూతాంశమగు వేడిమి తెలియుచున్నది. కావున సుప్తి యనగా నిద్రయనే పదార్థమాయెను

4 బ్రహ్మాండమునందున్న వాయుభూతము పిండాండమునందు చేరుటనుండి పరుగుట, నడుచుట, చాచుట, ముడుచుట కలుగుచున్నవి. అ) వాయుభూతాంశముయొక్క ముఖ్యాంశము దావనమనే పదార్థమాయెను. దావనమనగా పరుగెత్తుట. దీనియందు ఇతర భూతాంశ మిశ్రమము లేదు. కేవలము వాయుభూతాంశమైన పరుగుట మరియు చలనాంశముకలదు. కావున ధావనమనే పదార్థమాయెను. ఆ) వాయుభూతాంశమునందు పృథ్వీభూతాంశము చేరుటచే అకుంచనం (ముడుచుకొనుట) యాయెను. ముడుచుకొనుటయందు పృథ్వీ భూతాంశముయొక్క ధరించుట, మలుపుట మరియు వాయుభూతాంశము యొక్క చలనము కలదు. కావున అకుంచనంను పదార్థమాయెను. ఇ) వాయుభూతాంశమునందు జలభూతాంశము చేరుటచే చలనము చాచుటయనే పదార్థమాయెను. చాచుటయందు జలభూతము యొక్క జారుట మరియు వాయుభూతాంశమైన చలనము కలదు, కావున చాచుట యనే పదార్థమాయెను. ఈ) వాయుభూతాంశమునందు అగ్ని భూతాంశము చేరుటచే నడచుటయనే పదార్థమాయెను. నడచుటయందు అగ్ని భూతముయొక్క రూప నిర్ణయపద్ధతి ప్రదక్షణము చేయునపుడు కుడినుండి యెడమకు తిరుగుట అగ్నియొక్క మరియు రూపనిర్ణయ పద్ధతి మరియు నడచుటయందు వాయుభూతాంశముయొక్క చలనము గలదు. కావున నడచుటయనే పదార్థమాయెను. ఉ) వాయుభూతాంశమునందు ఆకాశ భూతాంశము చేరుటచే ఎగురుట యనే పదార్థమాయెను. ఎగురుటయందు ఆకాశ భూతాంశముయొక్క అవకాశము మరియు వాయుభూతాంశము

యొక్క చలనాంశము గలదు. కావున ఎగురుటయనే పదార్థమాయెను.

5 బ్రహ్మాండమునం దున్న ఆకాశ భూతము పిండాండమునందు చేరుటమునుండి కామము, క్రోధము, మోహము, భయము, శోకము యనే పదార్థములాయెను అ) ఆకాశభూతాంశము యొక్క ముఖ్యాంశము శోకమనే పదార్థమాయెను. శోకము కలిగినపుడు ఇంద్రియ ఆకారముల శూన్యత్వము అంతఃకరణమునందు కలుగుచున్నది. దీనియందు ఇతర భూతాంశములు లేవు. కేవలము ఆకాశభూతాంశము యొక్క శూన్యత్వమే కలదు. కావున శోకమనే పదార్థమాయెను. ఆ) ఆకాశ భూతాంశమునందు పృద్వీభూతాంశము చేరుటచే భయమనే పదార్థమాయెను భయము కలిగినపుడు శరీరము జడమగును. కావున పృద్వీభూతాంశమైన జడత్వము ఆకాశభూతమగు జ్ఞానశూన్యత్వంగలదు. కావున భయమనే పదార్థ మాయెను. ఇ) ఆకాశభూతాంశమందు జలభూతాంశము చేరుటచే మోహ మనే పదార్థమాయెను. మోహమనగా విడువలేనితనము. జలము యొక్క విషయాదులు విడువలేని పద్దతి మరియు ఆకాశభూతాంశముయొక్క జ్ఞాన శూన్యత్వము కలదు. కావున మోహమనే పదార్థమాయెను. ఈ) ఆకాశ భూతాంశమునందు అగ్నిభూతాంశము చేరుటచే క్రోధమనే పదార్థమాయెను. క్రోధము కలిగినపుడు శరీరముయొక్క ఇంద్రియములు దహించును గాన ఇందు అగ్నిభూతాంశముయొక్క దహించు పద్దతి ఆకాశభూతాంశముయొక్క జ్ఞానశూన్యత్వము గలదు. కావున క్రోధమాయెను. ఉ) ఆకాశభూతాంశ మునందు వాయుభూతాంశము చేరుటచే కామమనేపదార్థమాయెను. కామము నందు వాయుభూతాంశముయొక్క చలనపద్దతి ఆకాశ భూతాంశముయొక్క జ్ఞానశూన్యత్వము గలదు. కావున కామమనే పదార్థమాయెను.

ఈ విధముగా పంచభూతములనుండి పంచభూత కలయికవలన (25) స్థూలపదార్థముల నిర్ణయం స్థూలశరీరమాయెను:

సీ॥ నరములస్థులుచర్మనఖరోమమాంసముల్ భూగుణంబులు స్వేదమూత్రశ్లేష్మ
ములు శుక్లశోణితంబులు జలగుణములు। క్షుత్పిపాసాలస్య సుప్తి సంగ
మములు। వహ్నిగుణములు చలనధావన కంపనా కుంచనా ప్రసరణాది
కములు పవనాదిగుణములు భయకామమోహముల్ క్రోధలజ్జయునభోగుణ
ములివియు గీ॥ పంచభూతాంశగుణముల బారద్రోలి నీస్వరూపంబు
గనువాడు నిర్మలుండు॥ ॥రమ్య॥

సీ॥ భయము ఆకుంచనంబొంది అలవ్యమై రక్తంబుయెముకలరగిలియుండు చలనమై మోహంబు సంగంబుద్వారను శుక్లంబు మాంసంబు సుక్క జేయుక్రోధంబు నడచుకొని క్షుత్తు మూత్రంబు నరములనుండియు నడచుచుండు కామంబు పరుగిడ కనిదప్పి స్వేదంబు చర్మంబునుండి యూచనుచునుండు శోకమొందియుదాటగా సుప్తిజెంది నిద్రలోపలి శ్లేష్మంబు నిక్కుమగ నమురోమంబులను బెంచునరయగానురా జయోగీశ్వరా తెల్పు రాచబాటా!

## జాగ్రదవస్థ:

సీ॥ పంచవింశతితత్వ పరిపూర్ణమైనట్టి స్థూలదేహమునందు సురుచిరముగ రవస్పర్శలనరూప రసగంధవచనదాన గమనోత్విసర్జనానందములును మానసహంకార మతిచిత్తములగూడి జీవుండు ముఖమునజేరి నిలచి విశ్వనామముజెంది వేర్వేర విభజించి సకలవ్యాపారముల్ సల్పుచుండు

గీ॥ నదియు జాగ్రదవస్థయు ననుదినంబు జనితమై జనుచుండును జన్మ రహిత ॥రమ్య॥

తా॥ 25 తత్వములు (ఇంద్రియములు) గల ఈ స్థూల శరీరమునందు, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, విషయములు అనగా శబ్ద, స్పర్శ, రూప, రస గంధ, వచన, దాన, గమన, ఆనంద, విసర్జనలు, అంతఃకరణ చతుష్టయ విషయములు, సంకల్పము, నిశ్చయము, చింతన మరియు అభిమానము లతో గూడుకొని జీవుడు ముఖస్థానమున నిలచి పై జెప్పిన 14 విషయము లందు వేరు వేరుగా విభజించుచు సకల వ్యాపారములు అనుదినంబు జరుపు టకు జనితమై జనుచునుండును. ఈ లోపలనే శ్రీగురుమూర్తిని పొందినచో జన్మరహితమును పొందవచ్చును.

## భూతాకాశమునందు పృధ్వీభువనము:

స్థూలశరీర లక్షణము: సూర్యుడు నేత్రముగానుండును. కనుక నేత్ర స్థానముయని చెప్పబడును. రాత్రి పగలు అనే నిర్ణయము లేక యుండును కనుక జాగ్రదవస్థయని నిర్ణయము (తామ్రమ) రాగివర్ణము మానవలోక కల్యాణమునకు వలయు మానవ సౌభ్రాతృత్వము, అన్యోన్య సహకారము ఐహికాముష్మిక పురోభివృద్ధిని పెంపొందించుటకు కర్మయోనరుచును గావున

యెరుక విశ్వాభిమాని యనవలెను. సార్థత్రత యహస్త ప్రయాణము (అపాద మస్తక ప్రమాణము) అన్నమయకోశము, రజోగుణము, విపరీతజ్ఞానము, దృష్యరూపము, స్థూలభోగము, అకారమాతృక, రుగ్వేదము వైఖరి వాక్కు పంచభూతమయం, పంచవింశతి తత్వార్ధము, భూమితత్వము, భూమి యొక్క కళలు 1 ఉత్పత్తి, 2 జాగ్రత్త, 3 బోధ, 4 వ్యాపారము ఈ జాగ్రదావస్థ వ్యవహారమువంటిది దీనిని దెలియుటకు త్రివిధ వాదములను తెలియవలెను. 1 వ్యవహారవాదము, 2 పరిణామవాదము, 3 స్వభావిక వాదము.

1 వ్యవహారవాదము: అనగా ఒక బంగారము అనేక నగలైనటుల బ్రహ్మమే జీవజగత్తులుగా నైనది. సర్వము బ్రహ్మమేయని వాదము.

2 పరిణామవాదము: అనగా మార్పు. గింజచెడి పురుగులుగాను మరియు చెట్లు చేమ సస్యములుగా పరిణమించినటుల, బ్రహ్మము చెడి ఈ జగత్తు రూపమైనదనే వాదము

3 స్వాభావిక వాదము: సముద్రమునందు అనేక అలలు స్వాభావికముగానే వచ్చి సముద్రమునందు లయమైన విధముగా బ్రహ్మమునందే జీవజగత్తు రూపములు దోచి బ్రహ్మమునందే లయమగుననే వాదము ఈ త్రివిధ వాద ములు అన్ని కాలముల యందుండవు కావున అశాశ్వతమని చెప్పబడును

## 2 సూక్ష్మ శరీరము:

బ్రహ్మాండమునందున్న పంచతన్మాత్రలనుండి పిండాండమందు 25 విషయ స్వరూపములైన ఇంద్రియాదులాయెను

| పంచభూతములు / పంచతన్మాత్రలు | ఆకాసము | వాయువు | అగ్ని | జలము | పృధ్వి |
|---|---|---|---|---|---|
| శబ్దము | జ్ఞానము | మనస్సు | బుద్ధి | చిత్తము | అహంకారం |
| స్పర్శ | సమానము | వ్యానము | ఉదానము | ప్రాణము | అపానము |
| రూపము | శ్రోత్రము | త్వక్కు | చక్షు | జిహ్వ | ఘ్రాణము |
| రసము | శబ్దము | స్పర్శ | రూపము | రసము | గంధము |
| గంధము | వాక్కు<br>వచనము | పాణి<br>దానము | పాదము<br>గమనము | గుహ్యము<br>ఆనందము | గుదము<br>విసర్జనం |

1 బ్రహ్మాండ మందున్న శబ్దతన్మాత్ర మనోప్రాణముల చేరికచే శబ్దము ఏర్పడుచున్నది

అ। బ్రహ్మాండ మందున్న శబ్దతన్మాత్ర, పిండాండమునందు చేరుటచే, జ్ఞానమనే అంతరేంద్రియమాయెను? శబ్దమెచ్చటనుండునో జ్ఞాన మచ్చటనే యుండును. కావున శబ్దతన్మాత్రయే జ్ఞానమనే అంతరేంద్రియమాయెను దీనియందు ఇతరభూత మిశ్రణములేదు కేవలము శబ్దతన్మాత్ర యొక్క గుర్తెరుగు పద్ధతి గలదు కావున శబ్దతన్మాత్రయే జ్ఞానమనబడును.

ఆ। ఈజ్ఞానము వాయుధర్మమును చలనముతో చేరి, మనస్సుయనే అంతరేంద్రియ మాయెను. మనస్సునందు వాయుభూతము యొక్క ధర్మమగు చలనము (చాంచల్యము)ఒక దాని పైనుండి మరొక విషయముపై పోవు చుండుట గలదు మరియు జ్ఞానముయొక్క తెలివిపద్ధతిగలదు కావున మనస్సనే అంతరేంద్రియమాయెను.

ఇ॥ ఈజ్ఞానము, అగ్ని భూత ధర్మమగు తేజస్సుతో జేరి, బుద్ధియనే అంతరేంద్రియమాయెను, బుద్ధియందు అగ్ని భూతముయొక్క ధర్మముగు తేజో (వెలుగు)రూప నిచ్చయ పద్దతిగలదు మరియు జ్ఞానము యొక్క తెలివి పద్ధతి గలదు. కావున బుద్ధియనే అంతరేంద్రియమూయెను.

ఈ॥ ఈజ్ఞానము జలముయొక్క ధర్మము తడుపుటతోచేరి,చిత్తమనే అంతరేంద్రియమాయెను చిత్తమునందు రసరూప విషయాదులను జేర్చి వాటి కొరకు అహర్నిశలు చింతనజేయు పద్ధతి జ్ఞానముయొక్క తెలివి పద్ధతి గలదు కావున చిత్తమనే అంతరేంద్రియమాయెను.

ఉ॥ ఈజ్ఞానము పృద్వీ భూతధర్మమగు కఠినత్వముతో జేరి అంహంకారమనే అంతరేంద్రియమూయెను. అహంకారమునందు పృద్వీ కఠినత్వముయగు అభిమానము జ్ఞానము యొక్క తెలివి పద్ధతి గలదు కావున అహంకార మనే అంతరేంద్రియమూయెను.

2 వాయుభూతము యొక్క సూక్ష్మము స్పర్శతన్మాత్ర

అ॥ బ్రహాండమందున్న స్పర్శతన్మాత్ర, పిండాండమునందు జేరుటచే వ్యాసముయనే ప్రాణేంద్రియమాయెను. దీనియందు ఇతర భూతముల సముదాయములు లేవు కేవలము స్పర్శతన్మాత్ర యొక్క శీతోష్ణస్పర్శ పద్ధతి తెలియుచేయు పద్ధతి గలదు ఈస్పర్శ బ్రహ్మాండముల్ వ్యాపించియున్న వ్యాసముకూడా శరీరమంతటా వ్యాపించి శీతోష్ణస్పర్శలు తెలియుజేయుచుండును. కావున వ్యాసమనే ప్రాణేంద్రియమాయెను.

ఆ॥ ఈవ్యాసము ఆకాశభూతాంశమగు అవకాశముతో జేరి సమానమాయెను ఈసమానమనే ప్రాణేంద్రియమునందు అన్నాదులను పచనము జేసి సర్వనాళ్ళద్వారా శరీరమందంతటికి పంపించుట గలదుమరియు వ్యాపముయొక్క స్పర్శరూప వచనము దాని వ్యాపకమును తెలియ జేయుచున్నది కావున సమానమనే ప్రాణేంద్రియమాయెను.

ఇ॥ ఈవ్యాసము అగ్ని భూత ధర్మమగు తేజోరూప పద్ధతితో జేరి ఉదానమనే ప్రాణేంద్రియమగు చున్నది దీనియందు పలుకులను పలికించుచున్నది. గావునదీనియందు అగ్ని భూత తేజోరూపశక్తి మరియు వ్యాసముయొక్క స్పర్శ తెలియుజేయు పద్ధతి గలదు కావున ఉదానమనే ప్రాణేంద్రియమాయెను.

ఈ వ్యాసము జలభూతము యొక్క చేరికతో జేరి ప్రాణమనే ప్రాణేంద్రియ మాయెను. దీనియందు జలధర్మమగు విషయాదుల చేరికతో జేరి ప్రారబ్ధరూపకర్మల, నంతఃకరణమునందు జేర్చి సూర్యచంద్ర వాదులద్వారా చెలింపజేసి ప్రానహంసల బాహ్యమునందులయింపజేసి ఆయువును క్షీణింపజేసి మరణమును కలిగించుచున్నది. మరియు సంచితరూప కర్మల సుఖదుఃఖములను భవింపజేయుచున్నది ఆగామి రూపకర్మల నంతఃకరణమున జేర్చి పునరావృత్తికి కారణమగుచున్నది కావున కర్మలనీవిధముగా అంతఃకరణమునందు జేర్చుచున్నది మరియు ఉచ్ఛ్వాస నిశ్వాసల ద్వారా స్పర్శలు తెలియజేయుచున్నది కావున ప్రాణమనే ప్రాణేంద్రియమాయెను?

ఉ॥ ఈవ్యాసము పృద్ధ్వీభూత ధర్మమగు గంధకఠినత్వముతో జేరిఅపానమనే ప్రాణేంద్రియమాయెను దీనియందు పృద్ధ్వీగంధరూప విసర్జనము మరియు వ్యాసముయొక్క స్పర్శ తెలియజేయుచున్నది. కావున అపానమనే ప్రాణేంద్రియమాయె.

3 అ॥ బ్రహ్మండ మందున్నరూపతాన్మాత్ర పిండాండమునందు చేరుటచే చక్షువనే జ్ఞానేంద్రియమాయెను. చక్షుజ్ఞానేంద్రియమందు యితరభూత సముదాయములు లేవు కేవలము రూపతన్మాత్ర యొక్క రూపములు తెలియజేయు పద్ధతి గానున్నది కావున రూపతన్మాత్రయే చక్షురింద్రియ మనే జ్ఞానేంద్రియమాయెను.

ఆ॥ ఈ చక్షురింద్రియము అకాశ భూతసూక్ష్మమగు శబ్దతన్మాత్రతో జేరి, శ్రోత్రేంద్రియమాయెను. శ్రోత్రేంద్రియమునందు శృతిఅనగా వినేపద్ధతి ఆకాశభూత సూక్ష్మమగు శబ్దమును వినేపద్ధతి మరియు చక్షురింద్రియము యొక్క రూపములు శబ్దగ్రహణమునందు తెలియు చున్నది కావున శ్రోత్రేంద్రియమనే జ్ఞానేంద్రియమాయెను.

ఇ॥ ఈ చక్షురింద్రియము వాయుభూత స్పర్శతోజేరి త్వక్కుయనే జ్ఞానేంద్రియమాయెను. త్వగింద్రియమునందు స్పర్శలు తెలియజేయు పద్ధతి మరియు స్పర్శలయందు చక్షురింద్రియము యొక్క రూపనిర్మిత పద్ధతులు తెలియబడుచున్నవి. కావున త్వక్కు యనే జ్ఞానేంద్రియమాయెను.

ఈ॥ ఈ చక్షురింద్రియము. జలభూతరసత్వముతో జేరి జిహ్వాయనే జ్ఞానేంద్రి

యమాయెను. జిహ్వేంద్రియమునందు రససంబంధమైన రుచులు అరుచులయందు చక్షురింద్రియము యొక్క వస్తురూప నిర్ణయములు తెలియుచున్నది, కావున జిహ్వయనే జ్ఞానేంద్రియమాయెను.

ఊ॥ ఈ చక్షురింద్రియము, పృధ్వీభూత సూక్ష్మగంధతన్మాత్రతో జేరి ఘ్రాణమనే జ్ఞానేంద్రియమాయెను. ఘ్రాణము నుండి ఆఘ్రాణించు వాసనలు మరియు దానియందు చక్షురింద్రియము యొక్క రూపనిర్మిత పద్ధతి గలదు. కావున ఘ్రాణమనే జ్ఞానేంద్రియమాయెను.

4 జలభూతము యొక్క సూక్ష్మము రసతన్మాత్ర

అ॥ బ్రహ్మాండ మందున్న రసతన్మాత్ర పిండాండమునందు చేరుటచే రసమనే విషయేంద్రియమాయెను. (రశనేంద్రియమునందు) యిచ్ఛారూప రసనేంద్రియమునందు తీపి, కారము, చేదు, వగరు, పులుపు, ఉప్పు యనే షడ్రుచులు తెలియబడు చున్నది దీనియందు ఇతర భూతముల మిశ్రమములేవు కేవలము రసరూప విషయములే గలవు కావున యిచ్ఛారూప రసనేంద్రియమాయెను

ఆ॥ ఈఇచ్ఛారూప రసనేంద్రియము ఆకాశభూత సూక్ష్మాంశమగు శబ్దతన్మాత్రతో జేరి యిచ్ఛారూప శబ్దేంద్రియమాయెను. విషయరూప శబ్దేంద్రియమునందు శబ్దములు శృతిరూపములౌగానున్నవి. శబ్దములు విషయాదులచే కూడుకొనియున్నవి. అందు రసరూప విషయేంద్రియములు గలవు కావున శబ్దమనే విషయేంద్రియమాయెను.

ఇ॥ ఈ ఇచ్ఛారూప రసనేంద్రియము, వాయుభూత స్పర్శరూపముతో జేరి, యిచ్ఛారూప స్పర్శేంద్రియమాయెను యిచ్ఛారూప స్పర్శలయందు, తొమ్మిదివిధముల స్పర్శలుగలవు యివిత్వగింద్రియముతో తెలియబడగలవు త్వగింద్రియస్పర్శలు భార్య, పుత్ర, ధన, ధాన్య గృహారామాదుల క్షేత్రాదుల స్పర్శలు మరియు రసనేంద్రియము యొక్క యిచ్ఛజనించు చున్నది. గావున యిచ్ఛారూప స్పర్శేంద్రియమాయెను

ఈ॥ ఈయిచ్ఛారూప రసనేంద్రియము. అగ్నిభూత రూపతన్మాత్రతో జేరి యిచ్ఛారూప రూపేంద్రియమాయెను ఈరూపేంద్రియము చక్షురింద్రియముచే తెలియుచుండును దీనియందు రూపములు తెలుసుకొనినవాటియందు యిచ్ఛారూప రసేంద్రియవాంచలు గలుగుచున్నవి కావున

యిచ్ఛారూప రూపేంద్రియమాయెను

ఈ॥ ఈయిచ్ఛారూప రసనేంద్రియము పృద్ధ్విభూత సూక్ష్మమగు గంధతన్మాత్రతో జేరి, యిచ్ఛారూప గందేంద్రియమగు చున్నది ఈ విషయరూప గందేంద్రియము యొక్క వాసనలు ఘ్రాణేంద్రియముచే తెలియబడును గంధతన్మాత్ర యొక్క వాసనలయందు యిచ్ఛారూప రసేంద్రియ వాంచలుగలుగు చున్నవి. కావున యిచ్ఛారూప గంధేంద్రియమాయెను

5 పృద్ధ్వి భూతము యొక్క సూక్ష్మము గంధతన్మాత్ర

అ॥ బ్రహ్మాండము నందున్న గంధతన్మాత్ర పిండాండము నందుజేరుటచే గుదేంద్రియమనే కర్మేంద్రియమాయెను, ఇందు ఇతర భూతముల మిశ్రమములులేవు. కేవలము సృష్టికి కారణముగా గంధతన్మాత్రగలదు సృష్టికి కార్యముగా గుదేంద్రియముకలదు. కారణ మందేది గుణముండునో కార్యమందదే గుణముండును. కావున గంధతన్మాత్రయే గుదమనేకర్మేంద్రియమాయెను.

ఆ॥ ఈగుదేంద్రియము. ఆకాశభూతశబ్దతన్మాత్రతో జేరి, వాగింద్రియమాయెను వాగింద్రియమునందు కలగు శబ్దములు, (వాచకములు) శబ్దములుగా శృతిరూపముగా నున్నవి. వాటి యందుగుదేంద్రియము యొక్క కర్మనిర్మిత పద్దతి తెలియజేయుచున్నది. కావున వాక్కనే కర్మేంద్రియమాయెను.

ఇ॥ ఈగుద్రేంద్రియము, వాయుభూత సూక్ష్మమగు స్వర్శతన్మాత్రతో జేరి, పాణియనే కర్మేంద్రియ మాయెను. ఈపాణేంద్రియమునందు స్పర్శ లక్షణములు గ్రహించు పద్దతి మరియు గుదేంద్రియము యొక్క సర్వ కర్మలు జరుగుట చేయుచున్నది. గాన పాణియనేకర్మేంద్రియమాయెను?

ఈ॥ ఈగుదేంద్రియము. అగ్ని భూత సూక్ష్మమగు రూపతన్మాత్రతో జేరి, పాదమనే కర్మేంద్రియమాయెను. పాదేంద్రియమునందు రూపతన్మాత్ర యొక్క రూపములు రూపించుచున్నది. మరియు గుదేంద్రియము యొక్క గమనక్రియ కర్మజరుగు చున్నది. కావున పాదేంద్రియమనే కర్మేంద్రియమాయెను.

ఉ॥ ఈగుదేంద్రియము జలభూతముయొక్క సూక్ష్మము రసతన్మాత్రతో జేరి

గుహ్యేంద్రియమాయెను. గుహ్యేంద్రియమునందు, రసరూప అనగా విషయరూప ఆనందము మరియు కోరికయు (వాంచలు) గుదేంద్రియ మయొక్క కర్మరూప ఉత్పత్తి గలుగు చున్నది. కావున గుహ్యేంద్రియ మనే కర్మేంద్రియ మాయెను.

## జాగ్రదావస్థ

సీ॥ ఆకాశపంచక మంతరేంద్రియములు ప్రాణాదులను వాయుపంచకంబు జ్ఞానేంద్రియములు వైశ్వానరపంచకం మప్పుపంచకము శబ్దాదులైదు కర్మేంద్రియములైదు కడుభూమిపంచకం బిట్టులిరువదైదు ఇంద్రి యములు నివియాత్మ గాదని యిన్నిటి నెరిగెటి యెరుకయే పరమాత్మయని యెరింగి

గీ॥ సాంఖ్యయోగంబు సాధించి సజ్జనుండు ముక్తిజెందును నీపాదభక్తితోను ॥రమ్య॥

సీ॥ జ్ఞానసమానముల్ వీనులు శబ్దంబు వాగ్వ్యోమ్య యంశముల్ వరుసనాయె మనసువ్యానము చర్మమును స్పర్శకరములువాయువంశంబులూ సరుస నాయె? రూఢి బుద్ధియు దానరూప సాక్షి పాదముల్ వహ్నియంశంబులూ వలసనాయె? చిత్తంబుప్రాణంబు జిహ్వాశిశ్న రసంబు వారియంశంబులు వరుసనాయె?

గీ॥ గంధహంకారము అపానఘ్రాణగుదము లాయెభూయంశలిట్లు నీమాయవలన ॥రమ్యగుణ॥

( భూతాకాశాము నందు జలభువనము )

ఎరుక పురుషునికి వాయుపుగళము కనుక ఆధ్యాత్మరూప సూక్ష్మశరీర మునకు కంఠస్థానమని నిర్ణయము, అపాదమస్తక ప్రమాణము అంగుష్ట మాత్రప్రమాణము శుక్లవర్ణము తనప్రకాశముననే తాను వ్యవహరించును గనుక, అభిమాని తైజసుడు

స్వప్నావస్థ సత్వగుణము అన్యథాజ్ఞానము. దృష్టరూపం ప్రవిసిక్త భోగం ఉకార మాతృక యజుర్వేదము మధ్యమ వాక్కు అసం చీకృత మయం జలతత్వం మనోవికారం జలము యొక్క ప్రత్యేక కళలు, 1 సాదుృశ్యం 2 అసాదృశ్యం 3 యాదృశ్యం 4 తాదృశ్యం 5 సూక్ష్మ

శరీరము స్వప్నావస్థవంటిది కావున ప్రతిభాసికము యనవచ్చును దీనిని తెలియుటకు త్రివిధ వాదములు కలవు 1 ప్రతిబింబవాదము 2 ప్రతిభాసికవాదము 3 భ్రాంతివాదము.

అ॥ ప్రతిబింబవాదమనగా, జలమునందు దర్పణమునందు ప్రతిబింబించునటుల, అంతఃకరణమందు, మాయయందు, ప్రతిబింబించినటుల, బ్రహ్మమే ప్రతిబింబించినదని తెల్పువాదము.

ఆ॥ ప్రతిభాసిక వాదమనగా, ముత్యపు చిప్పయందు, వెండి తోచినటుల విద్యుత్కాంతి రంగు రంగుల కిరణములు, మరోచోట తోచినటుల, బ్రహ్మమునందు జగత్తు తోచినదనే వాదము

ఇ॥ భ్రాంతి వాదము అనగా

త్రాడుయందు పాము యెండు మొద్దు యందు దొంగ యెండ మావుల యందు జలము, లేనిదే భ్రమ వలన కలదను విధమున, బ్రహ్మము నందే జగత్తు కలదనుట ఈభ్రాంతివాదము. అన్ని వేళలలో లేవు గాన మిధ్యయనబడును.

## 3 కారణ శరీరము

బ్రహ్మాండమందున్న పంచశక్తులనుండి పిండాంతమందున కారణరూప శరీరమాయెను.

| | పరాశక్తి | ఆదిశక్తి | జ్ఞానశక్తి | ఇచ్ఛాశక్తి | క్రియాశక్తి |
|---|---|---|---|---|---|
| పరాశక్తి | అవకాశము | భ్రాంతి | అవరణము | నిరావరణం | అప్రమాణం |
| ఆదిశక్తి | విస్మృతి | శంక | శోషణం | శిధిలీకరణం | ధీరత్వం |
| జ్ఞానశక్తి | గూఢం | రూఢం | కృతజ్ఞత | అవిచారం | సంశ్లేషం |
| ఇచ్ఛాశక్తి | మృధుత్వం | పోషకత్వం | విశదత్వం | క్లేదనత్వం | ధారణత్వం |
| క్రియాశక్తి | మూర్తత్వం | శబలత్వం | లజ్జ | పిండీకరణం | కాఠిన్యత్వం |

బ్రహ్మాండమునందున్న పంచశక్తులనుండి, పిండాండమునందు విషయా నందము ననుభవించు జీవుడాయెను.

కారణ శరీరమునందు జీవుడు కార్యరూపక్రియలొనర్చుచు, విశ్రాంతి పొందును. ప్రాణుల ఏకైక రూపమందున స్వయం ప్రకాశబ్రహ్మము యొక్క అధోరూప పరిణామమే శక్తి (గామండును) యనబడును ఈ శక్తి క్రియోన్ముఖమునందు క్రియాశక్తిగను, చింతనాపద్ధతి యందు యిచ్ఛాశక్తిగను, జ్ఞానపద్ధతియందు జ్ఞానశక్తిగను, నిశ్చయాత్మకమందు ఆదిశక్తిగను మోక్షపద్ధతియందు పరాశక్తిగను జెప్పబడుచున్నవి.

వ్యష్టిప్రాణమనంబుల యొక్క ఏకైక రూపమగు ప్రత్యగాత్మ జాగ్ర దవస్థయందు విశ్వుడుగాను. స్వప్నావస్థయందు తైజసుడుగాను సుషుప్త్యవస్థయందు ప్రాజ్ఞుడుగాను. తురీయావస్థయందు ప్రత్యగాత్మగాను కేవలము పురుష రూపముగానున్న మరణావస్థయందు జీవుడని చెప్ప బడును పురుషుతో గూడిన జీవుడు క్రియాశక్తి రూపమున క్రియోన్ము ఖడగును యిచ్ఛాశక్తి రూపమున, చింతనాపద్ధతిగానుండను జ్ఞానశక్తి రూపమున జ్ఞానపద్ధతి నెరుంగును ఆదిశక్తి రూపమునందు బుద్ధికర్మాను సారిణి అనున్యాయమున, కర్మయొక్క నిర్ణయపద్ధతిబొందు చున్నాడు మరియు పరాశక్తి రూపమున ఇతడు మోక్షమొందు చున్నాడు. కావున పంచశక్తుల వలన కారణరూప జీవుడగు చున్నాడు. ఏలయనగా!

1 పరాశక్తి శబ్దరూప ఆకర్షణ అవకాశం బొందినప్పుడు, ఎరుగుటయనునది కలుగుచున్నది ఏలనగా అవకాశం (అఖండచేతన బ్రహ్మమునందు, ఎడము తెలిపి వీలు ఉండుటకు చోటు నిచ్చునది, వ్యాప్తి జెంది తనయందు సర్వబీజములుండుటకు అవకాశంబిచ్చి, సర్వమును తెలిసికొనుట జరుగు చున్నది. ఇందు యితరశక్తి సముదాయములులేవు, కేవలము పరాశక్తి యొక్క (తెలియుట) ఎరుగుటయే గలదు కావున ఎరుగుటయాయెను, అనగా అవకాశమగుచున్నది.

2 పరాశక్తి శబ్దరూప ఆకర్షణ అవకాశము ఆదిశక్తి యొక్క స్పర్శరూప శంకాపద్ధతితోజేరి భ్రాంతి(ఒకవస్తువునుజూచి మరియొకవస్తువుగా భావించుచు భ్రమగల్గించుట ఉన్నది లేనట్లు లేనిది ఉన్నట్లు తెలియుజేయుట) బొంది సంకల్ప వికల్పములు కలుగు చున్నవి. సంకల్ప వికల్పము

లందు ఆదిశక్తియొక్క స్పర్శరూప శంకాపద్ధతి పరాశక్తియొక్క అవకాశ రూపము తెలియుటయు గలదు కావున సంకల్ప వికల్పములాయెను.

3 పరాశక్తి శబ్దరూప ఆకర్షణ అవకాశం, జ్ఞానశక్తియొక్క తేజోరూప కృతజ్ఞతతో జేరి (ఆవరణంఆవరించునది కప్పియుంచునది. ఆచ్ఛాదనమొనర్చునది)ఇంటిచుట్టు ఉండు ప్రదేశము(బొంది)నిశ్చయత్వము కలుగుచున్నది. దీనియందు జ్ఞానశక్తి తేజోరూప కృతజ్ఞత పరాశక్తియొక్క అవకాశము తెలియుచున్నది, కావున నిశ్చయమాయెను గాన అవరణమగు చున్నది.

4 పరాశక్తి శబ్దరూప ఆకర్షణ అవకాశము, యిచ్ఛాశక్తి రసరూప క్లేదనత్వంతో జేరి నిరావరణం(ఆవరించనిది కప్పనిది ఆవరణములేనిది బొంది చింతనకలుగు చున్నది. చింతనయందు యిచ్ఛాశక్తి రసరూప క్లేదనత్వం, పరాశక్తి యొక్క శబ్దఅవకాశము గలదు, కావున చింతనకలుగుచున్నది కావున నిరావరణమగు చున్నది.

5 పరాశక్తి శబ్దరూప ఆకర్షణ అవకాశము క్రియాశక్తి గంధరూప కఠిన్యము తోజేరి అప్రమాణము (ప్రత్యక్షాది జ్ఞానకారణము లేనిది ప్రకృతి కొలత లేనిది) బొంది, అభిమానము కలుగుచున్నది దీనియందు క్రియాశక్తి యొక్క గంధకాఠిన్యత్వం, పరాశక్తి శబ్దరూప ఆకర్షణ అవకాశముగలదు కావున అభిమానము కలుగుచున్నది గాన అప్రమాణమగు చున్నది. ఈవిధముగా శబ్దతన్మాత్ర చేకలిగినజ్ఞానము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములకు, పరాశక్తియొక్క చేతనము తెలివి సంకల్పము నిశ్చయము, చింతన, అభిమానము అదిభౌతికములగు చున్నవి.

2 2/1 ఆదిశక్తిస్పర్శరూపవ్యాపకము శంక(సందేహము,భయము,విచారం ఆక్షేపము బొంది, తెలియజేయు చున్నది తెలియజేయుటయందు ఇతర శక్తిసముదాయములు లేవు కేవలము స్పర్శరూప శంకాపద్ధతి తెలియజేయుటయే కలదు కావున తెలియజేయుట మాయెను. గాన శంకాపద్ధతి గలుగు చున్నది.

2/2 ఆదిశక్తి స్పర్శరూప వ్యాపకత్వం పరాశక్తి శబ్దరూప ఆకర్షణ అవకాశముతో జేరి విస్మృతి (మరుపు జ్ఞానము లేకపోవుట)పొందిసర్వము వచనము చేయుచున్నది వచనము వ్యాపక పరాశక్తి శబ్దరూప అవకాశము,

ఆదిశక్తి స్పర్శరూపశంక (గుర్తు) తెలియుచున్నది. కావున వచనమాయెను గాన భ్రాంతిబొందు చున్నది.

2/3 ఆదిశక్తి స్పర్శరూప శంకాపద్ధతి జ్ఞానశక్తి తేజోరూప కృతజ్ఞతతో జేరి శోషణం(యెండుట చిక్కుట వాడుట క్షయ) బొంది వైఖరీ వాక్కులు పలుకుచున్నది. పలుకులయందు జ్ఞానశక్తి యొక్క కృతజ్ఞత తేజోరూప కృతజ్ఞత ఆదిశక్తి స్పర్శరూప శంకాపద్ధతిగలదు గావున పలుకుట యనునదాయను గాన శోషణమొందు చున్నది.

2/4 ఆదిశక్తి స్పర్శరూప శంకాపద్ధతి యిచ్ఛాశక్తి రసరూప క్లేదనత్వంతో జేరి, శిధిలీకరణం ( సందులు పొందుట జీర్ణమైనది వొదలైన) బొంది ఉశ్ఛ్వాసనిశ్ఛ్వాసరూపములుగా, సకలకర్మలను అనుభవించుటకు చేర్చ టగలదు, దీనియందు యిచ్ఛాశక్తి యొక్క రసరూప క్లేదనత్వం ఆదిశక్తి స్పర్శరూప శంకాపద్ధతిగలదు కావున ఉశ్ఛ్వాస నిశ్ఛ్వాస మనునదాయను గాన శిధిలీకరణమగు చున్నది.

2/5 ఆదిశక్తి స్పర్శరూప శంకాపద్ధతి క్రియాశక్తి గంధరూప కాఠిన్యత్వంతో జేరి ధీరత్వం(ధైర్యము స్వాతంత్ర్యము) బొంది విసర్జనంబు కలుగుచుండును. విసర్జనయందు క్రియాశక్తి గంధరూప కాఠిన్యత్వ, ఆదిశక్తి స్పర్శరూప శంకాపద్ధతి గలదుకావున విసర్జనమాయెను గాన ధీరత్వంబొందు చున్నది. ఈవిధముగా! స్పర్శతన్మాత్ర నుండి కలిగిన్న సమానవ్యాన ఉదానప్రాణ అపానములకు, ఆదిశక్తి చేతనశక్తిచే వచనము తెలియ జేయుట, పలుకుట ఉశ్ఛ్వాస నిశ్ఛ్వాసలు విసర్జనముయను ఆదిభౌతికములు కలుగుచున్నది?

3/1 జ్ఞానశక్తి తేజోరూప కృతజ్ఞత (చేసిన మేలు మరువక తలచువాడు) రూపంబొందు చున్నది దీనియందు ఇతర శక్తి సముదాయములు లేవు కేవలము జ్ఞానశక్తి తేజోరూప కృతజ్ఞత మాత్రమే కలదు కావున రూపమాయెను. గాన కృతజ్ఞత్వం గలుగుచున్నది.

3/2 జ్ఞానశక్తి తేజోరూప కృతజ్ఞత పరాశక్తి శబ్దరూపఆకర్షణతో చేరి గూఢం (రహస్యము దాచబడినది) బొంది శబ్దమగుచున్నది ఈశబ్దమునందు పరాశక్తి శబ్దరూప అవకాశము జ్ఞానశక్తి తేజోరూప కృతజ్ఞత కలదు కావున శబ్దమాయెను గాన గూఢత్వం బొందుచున్నది!

3/3 జ్ఞానశక్తి తేజోరూప కృతజ్ఞత। ఆదిశక్తి స్పర్శరూప శంకా పద్ధతితో జేరి, గూఢం (ప్రసిద్ధికెక్కినది, నిశ్చయింపబడినది,) బొందె. స్పర్శ యగుచున్నది. స్పర్శయందు ఆదిశక్తియొక్క స్పర్శరూప శంకాపద్ధతి, జ్ఞానశక్తి తేజోరూప కృతజ్ఞత్వము గలదు. కావునస్పర్శయగుచున్నది గావున గూఢత్వంబొందుచున్నది.

3/4 జ్ఞానశక్తి తేజోరూప కృతజ్ఞత, యిచ్ఛాశక్తి రసరూప క్లేదనత్వంతో జేరి అవిచారం (యే ఆలోచన లేనిది) బొంది రసమగుచున్నది. రసమునందు యిచ్ఛాశక్తియొక్క రసరూప క్లేదనత్వం జ్ఞానశక్తి తేజోరూప కృతజ్ఞత గలదు. కావున రసమగుచున్నది. గాన అవిచారం బొందుచున్నది

3/5 జ్ఞానశక్తి తేజోరూప కృతజ్ఞత। గంధరూప కాఠిన్యత్వంతో జేరి, సంశ్లేషం (ఆలింగనము కౌగిలించుకొనుట)బొందిగంధమగుచున్నది. దీనియందు క్రియాశక్తియొక్క గంధరూపకాఠిన్యత. జ్ఞానశక్తి తేజోరూ పకృతజ్ఞత కలదు. కావున గంధమాయెను, గాన సంశ్లేషం బొందుచున్నది. ఈ విద ముగా రూప తన్మాత్రచే, శోత్ర, త్వక్, చక్షు. జిహ్వ, ఘ్రాణములకు, జ్ఞానశక్తియొక్క చేతనశక్తిచే శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు, యను అదిభౌతికములు గలుగుచున్నది.

4 4/1 యిచ్ఛాశక్తి రసరూప వ్యాపకత్వం, క్లేదనత్వం తడుపునది)బొంది పెరుగుట యాయెను పెరుగుటయందు యితరశక్తి సముదాయములులేవు కేవలముయిచ్ఛాశక్తి యొక్క రసరూపక్లేదనత్వం గలదు. కావున పెరు గుటయాయెను, గాన క్లేదత్వంబొందుచున్నది.

4/2 యిచ్ఛాశక్తి రసరూపక్లేదనత్వం, పరాశక్తి శబ్దరూప అవకాశముతో జేరి, మృధుత్వం (మెత్తదనం) బొంది, శృతివినుట యనునదాయెను, వినుటయందు పరాశక్తి శబ్దరూప అవకాశము యిచ్ఛాశక్తి రసరూపక్లేద నత్వం గలదు కావున వినుటయాయెను,గాన మృధుత్వం బొందుచున్నది

4/3 యిచ్ఛాశక్తి రసరూప క్లేదనత్వం. ఆదిశక్తి స్పర్శరూప శంకాపద్ధతితో జేరి, పోషకత్వం (పోషింపబడునది)బొంది, తాకుటలేక తగులుటయనున దాయెను. తలుగుటయందు ఆదిశక్తియొక్క స్పర్శరూప శంకాపద్ధతి, యిచ్ఛాశక్తి రసరూపక్లేదనత్వం గలవు కావున తగులుటయాయెనుగాన పోషకత్వంబొందుచున్నది.

4/4 యిచ్ఛాశక్తి రసరూప క్లేదనత్వం, జ్ఞానశక్తి తేజోరూప కృతజ్ఞత్వంతో జేరి విశదత్వం (తెలిసినది) (స్పష్టమైనది) బొంది, చూచుటయనునదా యెను, చూచుటయందు జ్ఞానశక్తియొక్క తేజోరూప కృతజ్ఞత, యిచ్ఛా శక్తియొక్క రసరూప క్లేదనత్వం కలవని తెలియుచున్నది. కావునచూచుట మాయెను, గానా విశదత్వంబొందుచున్నది.

4/5 యిచ్ఛాశక్తి రసరూపక్లేదనత్వం, క్రియాశక్తి గంధరూప కాఠిన్యత్వ ముతో జేరి, ధారణత్వం (భగవంతునియందు చిత్తమునిలుపుట, వస్తువిస మయము) బొంది మూర్కొనుటయనునదాయెను, మూర్కొనుటయందు క్రియాశక్తి గంధరూప కాఠిన్యత, యిచ్ఛాశక్తి రసరూపక్లేదనత్వం కల వని తెలియుచున్నది. కావున మూర్కొనుటమాయెను, గాన ధారణత్వం బొందుచున్నది. ఈ విధముగా రసతన్మాత్రచే కలిగిన, శబ్ద స్పర్శ రూప గంధములకు, యిచ్ఛాశక్తియొక్క చేతనశక్తిచే వినుట, తగులుట, చూ చుట, పెరుగుట, మూర్కొనుటయను అదిభౌతికములాయెను

5 5/1 క్రియాశక్తి గంధరూప వ్యాపకత్వం, కాఠిన్యత్వం (కఠినత్వం గట్టి నిర్ణయము నిష్ఠూరము) బొంది, విసర్జనమాయెను, విసర్జనయందు ఇతర శక్తి సముదాయములులేవు, కేవలము క్రియాశక్తి గంధరూపకాఠినత్వమే గలదు. కావున విసర్జనమాయెను, గాన కాఠిన్యంబొందుచున్నది.

5/2 క్రియాశక్తి గంధరూప కాఠినత్వం। పరాశక్తి శబ్దరూప అవకాశముతో జేరి, మూర్తత్వం (మారుతము కఠినమైనది మూర్ఛరోగ స్వరూపము) బొంది వచించుటమనునదాయెను. వచించుటయందు పరాశక్తి శబ్దరూప అవకాశము, మరియు క్రియాశక్తి గంధరూప కాఠినత్వం గలదు. కావున వచించుటమాయెను, గాన మూర్తత్వం బొందుచున్నది.

5/3 క్రియాశక్తి గంధరూప కాఠిన్యత. ఆదిశక్తి స్పర్శరూప శంకాపద్ధతితో జేరి, శబలత్వం (కదలిక చిత్రపర్ణములు) బొంది, యిచ్చిపుచ్చుకొనుట యనునది కలిగినది, గాన శబలత్వం బొందుచున్నది.

5/4 క్రియాశక్తి గందరూప కాఠిన్యత్వం, జ్ఞానశక్తి తేజోరూప కృతజ్ఞ తతో జేరి, లజ్జ (సిగ్గు) బొంది, గమనము కలుగుచున్నది. గమనము నందు జ్ఞానశక్తి తేజోరూప కృతజ్ఞత్వం, క్రియాశక్తి గంధరూప కాఠిన్య త్వం దలదు. కావున గమనమనునదిమాయెను, గాన లజ్జయగుచున్నది.

5/5 క్రియాశక్తి గంధరూప కాఠిన్యత్వం, యిచ్ఛాశక్తి రసరూప క్లేదసత్వం తోజేరి, పిండీకరణం (ముద్దగాజేయు సాధనము) బొంది, ఆనందమానున దాయెను. ఆనందమునందు యిచ్ఛాశక్తి రసరూప క్లేదసత్వ, క్రియాశక్తి గంధరూప కాఠిన్యత్వం గలవు. కావున ఆనందమాయెను, గాన పిండీకరణ ముబొందుచుండును. ఈవిదముగా గంధ తన్మాత్రిచే గలిగిన, వాక్కు, పాణి, పాద, గుహ్య, గుదములకు, క్రియాశక్తి యొక్క సత్తా చేతనముచే వచన, దాన, గమన, విసర్జనా, నందములనే, అదిభౌతికములాయెను. అనగా పంచతన్మాత్రిలచే కలిగిన, 25 యింద్రియములకు పంచశక్తుల యొక్క సత్తాచేతనముచే, 25 ఆదిభౌతికములు కూడికచే కారణ శరీరమాయెను.

## కారణ శరీరము
## భూతాకాశమునందు తేజోభువనము

ఎరుక పురుషునికి అగ్నిహృదయము కనుక, కారణదేహమునకు, అగ్నిహృదయ స్థానమని నిర్ణయము (ఆపాదమస్తక పర్యంతం) అంగుష్టార ప్రమాణము, కృష్ణ వర్ణము, ఇతరాభిమానము లేకుండా స్వయముగా, సర్వము తన సామార్థ్యముతో నే యొనర్చును, కనుక ప్రాజ్ఞడభిమాని తనయందుతాను ఆశ్రియము కలవాడు. కావున సుషుప్తి అవస్థ నిర్ణయము, తమోగుణం, అజ్ఞానస్థానం, అదృశ్యరూపం, ఆనందభోగం, మకారమాతృక, సామవేదం, పశ్యంతివాక్కు, తేజోభువనము, తేజసత్వం.

అగ్నియొక్క కళలు

1 మరణం 2 విస్మృత 3 మూర్ఛ 4 నిద్రా అగ్నియొక్క ప్రత్యేకకళలు ఈ సుషుప్త్యావస్థయందు పారమార్థికము వంటిది దీనిని తెలియుటకు 5 విదముల వాదములు తెలియవలయును.

1 అవిచ్ఛిన్న వాదము: దేశకాల వస్తువులచే బ్రహ్మము ఖండములుగాలేదు ఇదిలేకముందు ఉన్నపుడు పోయిన తరువాతగూడా! అఖండముగానే ఉన్నదనువాదము

2 నివర్తనవాదము: యా!మా సా! మాయా! యేది లేదో అదిమాయ అని బోధించువాదము

3 తుచ్ఛవాదము! గొడ్రాలుబిడ్డ, ఆకాశపుష్పము, శశవిషాణము, రజ్జుసర్ప భ్రాంతి, దారుపురుషుడు, ఇత్యాదివాక్యములచే జగత్తు బ్రహ్మములో లేదు యనువాదము

4 బ్రహ్మవాదము, బ్రహ్మము తప్ప ఇతరమేమియు లేదు, అనిబోధించువాదం

5 అజాతవాదము, ఇతరమేమియు పుట్టనేలేదు, అనువాదము

## మహాకారణ శరీరము

## భూతాకాశమునందు వాయుభువనము

బ్రహ్మాండము నందున్న పంచబీజములనుండి పిండాండమునందు మహాకారణ శరీరమాయెను

| బీజములు | హం | యం | రం | వం | లం |
|---|---|---|---|---|---|
| హం | పూర్ణత్వం | అసంగత్వం | వ్యాపకత్వం | సర్వబీజత్వం | అఖండత్వం |
| యం | అఖండత్వం | అభేదత్వం | పరాత్పరత్వం | నిర్మలత్వం | అజరత్వం |
| రం | ఉదాయత్వం | ఊర్ధ్వపరత్వం | ప్రకాశత్వం | చైతన్యత్వం | అనర్ఘత్వం |
| వం | అక్లేదత్వం | జగజ్జీవత్వం | పరంజోతత్వం | అమృతత్వం | కారుణ్యత్వ |
| లం | అశోషత్వం | కారణత్వం | పావనత్వం | సంపదత్వం | సర్వాధారత్వం |

మహత్తుయొక్క అధోరూప పరిణామము పంచబీజములు

పంచబీజములనుండి, ప్రాణమాయను, ఆ ప్రాణము శరీరమునందు, 25 స్థానములు ఏర్పరుచుకొని, ఇంద్రియములను బంధించి, గతిని గలిగించుచున్న, స్థూల, సూక్ష్మ, కారణ శరీరముల అంతరమునందు, మహాకారణ శరీరముండును. బ్రహ్మాండమందున్న పంచబీజములనుండి, పిండాండమందు

గతిగలిగించి, సకల వ్యవహరములు జేయుటకు ప్రాజ్ఞమేర్పడెను, దీనిని మహాకారణశరీరమందురు. ప్రాజ్ఞమనంబుల చేతచే. పరాపశ్యంతి మధ్యమ వైకరియను నాలుగు వాక్కులు కలుగుచున్నవి. ఈ వాక్కుల నిర్మితముల యందు లకారబీజముచేత, చిత్ర కర్మక్రియయు, వకారబీజముచేత మోహనక్రియయు, రకార బీజముచేత మారణక్రియయు, యకారబీజము చేత ఉచ్చాటనక్రియయు, హకార బీజముచేత ఆకర్షణక్రియయు కలుగుచు చున్నవి, కావున, దీనివలన కలుగు కర్మాను భవమునకు ప్రాణోపాధియేర్ప డుచున్నది. అందుచేత బీజముల వలన ప్రాణము, ప్రాణము వలన వాక్కుకు మూలమైన బీజములు కలుగుచున్నవి. అసంచీకృత రూప తన్మాత్రల సూక్ష్మ ము పంచశక్తులు, పంచశక్తులకు సూక్ష్మము పంచబీజములు,

1 1/1 అంబీజము శబ్దరూప వ్యాపకత్వ, ఆకర్షణ పూర్ణత్వం (సర్వమునందు వ్యాపించి నిండియున్నది) బొంది, మూర్ధ స్థానమేర్పర్చుకొని, అందుజ్ఞా నమును బంధించిగతిని గలిగించుచున్నది, దీనియందు అంబీజముయొక్క ఆకర్షణ పూర్ణత్వమే గలదు. ఇందు ఇతర బీజమిశ్రమములు లేవు. కేవలం అంబీజ ఆకర్షణ పూర్ణత్వమే గలదు. గావున మూర్ధస్థానమాయెను.

1/2 అంబీజ శబ్దరూప ఆకర్షణ పూర్ణత్వం. యంబీజము స్పర్శరూప ఉచ్చా టన అభేదత్వంతో జేరి, అసంగత్వం (దేనిచేకూడనిది దేనిచే కలువనిది) బొంది, కంఠస్థానమేర్పచుకొని, అందు మనస్సును బంధించి, గతిని కలి గించుచున్నది. దీనియందు యంబీజ స్పర్శరూపవుచ్చాటన అభేదత్వం, అంబీజ ఆకర్షణపూర్ణత్వం కలదు. కావున కంఠస్థానమాయెను, గాన అసంగ త్వం బొందుచున్నది.

1/3 అంబీజ శబ్దరూపఆకర్షణపూర్ణత్వం, రంబీజతేజోరూపమారణత్వము ప్రకా శముతో జేరి, వ్యాపకత్వం సూక్ష్మముగా సంతట వ్యాపించునది) బొంది, ముఖస్థానమేర్పచుకొని, అందు బుద్ధిని బంధించి గతిని కలిగించుచున్నది. ఇందు రంబీజమారణ ప్రకాశత్వం, అంబీజ ఆకర్షణ పూర్ణత్వం రెండుకలవు గాన వ్యాపకత్వం బొందుచున్నది, ముఖస్థానమేర్పడెను,

1/4 అంబీజము శబ్దరూపఆకర్షణపూర్ణత్వం, వంబీజరసరూప మోహన అమృ తత్వంతో జేరి సర్వబీజత్వం (అంతట బీజముతి కలిగియుండుట) బొంది, నాభిసానమేర్పచుకొని, అందు చిత్తమును బంధించి గతిని గలిగించుచు చున్నది, దీనియందు వంబీజ మోహనత్వం అమృతత్వం, అంబీజ ఆకర్షణ

పూర్ణత్వం, రెండు ఉన్నట్లు తెలియుచున్నది, కావున నాభిస్థానమాయెను, గాన సర్వ బీజత్వం బొందుచున్నది,

1/5 అంబీజ శబ్దరూప అకర్షణ పూర్ణత్వం, లంబీజ గంధరూప స్థంభన సర్వ ధారత్వంతో జేరి అఖండత్వం (ఖండములుగానిది, అంతట నిండినది, ఏక మైనది రెండుగానిది) బొందిహృదయస్థానమేర్పరుచుకొని, అందుఅహంకా రమును బంధించి గతిని కలిగించుచున్నది. కావున ఇందులంబీజ సర్వాధా రత్వం అంబీజ పూర్ణత్వం రెండున్నట్లు తెలియుచున్నది. కావున హృదయ స్థానమాయెను, గాన అఖండత్వం బొందుచున్నది. ఈ విధముగా శబ్దత న్మాత్రచే కలిగిన, జ్ఞానమనస్సు బుద్ధి, చిత్తము అహంకారములకు, పరా శక్తి చేతనమునకు, అంబీజముచే మూర్ధ, కంఠ, ముఖ, నాభి, హృదయ స్థానములయందు బంధించి, పరాశక్తియొక్క చేతనమునకు అంబీజము చలనము కలిగించుచున్నది.

2/1 యంబీజము స్పర్శరూప ఉచ్చాటన వ్యాపకత్వంబొంది, అభేదత్వం (భేదింపబడనిది భేదములేనిది)బొంది, సర్వాంగస్థానమేర్పచుకొని, అందు వ్యానమును బంధించి గతిని కలిగించుచున్నది, యిందు యితరబీజమిశ్ర మములులేవు, కేవలము యంబీజ స్పర్శరూప ఉచ్చాటన వ్యాపకత్వం మాత్రమే గలదు. కావున సర్వాంగస్థానమాయెను. గాన అభేదత్వం బొందుచున్నది.

2/2 యంబీజస్పర్శరూప ఉచ్చాటన అబేదత్వం అం జ అకర్షణ పూర్ణత్వ ముతోజేరి, అఖండం (సమస్తము ఏకరూపమైయున్నది ఖండములు గానిది, నిరంతరము వెలుగుచున్నది, సర్వము వ్యాపించునది) బొంది, నాభిస్థానమేర్పచుకొని, అందు సమానమును బంధించి గతిని గలిగించు చున్నది. కావున నాభిస్థానమందు యంబీజ ఉచ్చాటన అభేదత్వం, అంబీజ అకర్షణ పూర్ణత్వం కలవు. కావున నాభిస్థానమాయెను. గాన అఖండ త్వం బొందుచున్నది.

2/3 యంబీజము స్పర్శ ఉచ్చాటన అబేదత్వం, రంబీజతేజోరూప ప్రకాశ త్వంతో జేరి, పరాత్పరత్వంబొంది (పరమునకంటే పరమైనటువంటిది. శ్రేష్టమునకంటే శ్రేష్టమైనది గొప్పదానికంటే గొప్పది) బొంది, కంఠస్థాన మేర్పచుకొని అందు ఉదానమును బంధించి గతిని గలిగించుచున్నది. కావున దీనియందు రంబీజ మారణప్రకాశత్వం, యంబీజ ఉచ్చాటన

అభేదత్వం రెండు ఉన్నట్లు తెలియుచున్నది. కావున కంఠస్థానమాయెను గాన పరాత్పరత్వం బొందుచున్నది.

2/4 యంబీజ స్పర్శరూప ఉచ్చాటన అభేదత్వం వంబీజమోహన అమృతత్వంతో జేరి, నిర్మలత్వం (మలదోషములు లేనిది పాపములేనిది) బొంది హృదయ స్థానమేర్పర్చుకొని, అందు ప్రాణమును బంధించి గతిని కలిగించుచున్నది. కావున దీనియందు వంబీజమోహన అమృతత్వం, యంబీజ ఉచ్చాటన అభేదత్వం రెండును కలవు. కనుక హృదయస్థానమాయెను, గాన నిర్మలత్వం బొందుచున్నది.

2/5 యంబీజ ఉచ్చాటన అభేదత్వం, ఈ లంబీజ గంధరూప సర్వాధారత్వముతో జేరి, అజరత్వం (ముదిమి లేనిది-నశించనిది) బొరది, పాయుపస్థలస్థాన మేర్పచుకొని, అందు అపానమును బంధించి గతిని గలిగించు దీనియందు దీనియందు లంబీజ గంధరూప సర్వాధారత్వం, యంబీజ అభేదత్వం రెండును కలవు కావున పాయుపస్థల స్థానమాయెను, గాన అజరత్వం బొందుచున్నది. ఈ విధముగా స్పర్శతన్మాత్రచేత గలిగిన సమాన, వ్యాన, ఉదాన, ప్రాణ, అపానములు, ఆదిశక్తి చేతనమునకు, యంబీజములు మేను, కంఠము, హృదయము, పాయు, పస్థలస్థానములు, ఏర్పరచి యంబీజము గతిని గలిగించుచున్నది.

3/1 రంబీజతేజోరూప మారణ ప్రకాశత్వం (తన తేజమునందు సర్వమును చూపునది) బొందినేత్రస్థాన మేర్పచుకొని, అందు చక్షువును బంధించి గతిని గలిగించుచున్నది. ఇందు యితర బీజ సముదాయములు లేవు. కేవలము రంబీజ తేజరూప ప్రకాశమే గలదు. కావున నేత్రస్థానమాయెను గాన ప్రకాశత్వం బొందుచున్నది.

3/2 రంబీజ తేజోరూప ప్రకాశత్వము, హంబీజ శబ్దరూప ఆకర్షణ, పూర్ణత్వతో జేరి, ఆదాయత్వం (పంచుకొనుటకు) సొత్తుకానిది) బొంది, కర్ణ (చెవి) స్థానమేర్పచుని, అందుశోత్రమును బంధించి గతిని గలిగించుచున్నది. దీనియందు హంబీజ శబ్దరూత ఆకర్షన పూర్ణత్వం, రంబీజ ప్రకాశత్వం గలవు. కావున కర్ణస్థానమాయెను గాన ఆదాయత్వం బొందుచున్నది.

3/2 రంబీజతేజోరూప ప్రకాశత్వం, యంబీజ ఉచ్చాటన అభేదత్వంతో జేరి, ఊర్ధ్వపరత్వం (పై భాగములో అన్ని నశించినను శేశించియుండునది) బొంది, చర్మస్థానమేర్పర్చుకొని, త్వక్కును బంధించి, గతిని కలిగించు

చున్నది, యిందు యంబీజ ఉచ్చాటన అభేదత్వం, రంబీజ తేజోరూప ప్రకాశత్వము రెండును కలవు కావున చర్మస్థానమాయెను. గావున ఊర్ధ్వ పరత్వం బొందుచున్నది.

3/4 రంబీజతేజోరూప ప్రకాశత్వం, వంబీజ మోహన అమృతత్వంతో జేరి, చైతన్యం (కదిలించునది తెలివి ప్రాణము)బొంది, నాలుక స్థానమేర్పచు కొని, అందు జిహ్వను బంధించి, గతిని కలిగించుచున్నది. దీనియందు వంబీజమోహన అమృతత్వం, రంబీజతేజోరూప ప్రకాశం కలదు. కావున నాలుకయనే స్థానమాయెను. గాన చైతన్యం బొందుచున్నది,

3/5 రంబీజం తేజోరూప, ప్రకాశం, లంబీజం గంధరూప స్థంభన సర్వాధారత్వంతో జేరి, అనర్ఘత్వం (అడ్డులేనిది బొంది ముక్కుస్థానమేర్పరుచ్చకొని అందు ఘ్రాణమును బంధించి, గతినికలిగించుచున్నది. దీనియందు లంబీజగంధరూప స్థంభనసర్వాధారత్వం, రంభీజతేజోరూప ప్రకాశము గలవు కావున ముక్కుస్థానమాయెను గాన అనర్ఘత్వంబొందుచున్నది. ఈవిధముగా రూప తన్మాత్రచే కలిగిన శ్రోత్రము, త్వక్కు, చెక్షు, జిహ్వ, ఘ్రాణములకు జ్ఞానశక్తి చేతనమును, మరియు, రంబీజ మారక ప్రకాశముచే, కర్ణము, చర్మము, కళ్ళు నాలుక, ముక్కు, యనే స్థానముల యందు బంధించి, రంబీజము గతిని గలిగించుచున్నది.

4/1 వంబీజము రసరూపమోహన వ్యాప్తిచెంది అమృతత్వం (చావనిది మృత్యువులేనిది) బొంది, నాలుక స్థానమేర్పరుచ్చకొని, అందువిషయరూప రసనేంద్రియమును బంధించి, గతిని కలిగించుచున్నది, ఇందు యితర బీజ సముదాయములులేవు. కేవలం వంబీజమోహన అమృతత్వంబే కలదు కావున నాలుక స్థానమాయెను। గాన అమృతత్వం బొందుచున్నది

4/2 వంబీజము మోహన అమృతత్వం, హంబీజ శబ్దరూప ఆకర్షణ పూర్ణత్వముతో జేరి, అక్లేదత్వం (తడియనిది ఉపద్రవము లేనిది) బొంది, కంఠ స్థానమేర్పరచ్చకొని, అందు విషయరూప శబ్దమును బంధించి గతిని గలిగించుచున్నది దీనియందు అంబీజ శబ్దరూప ఆకర్షణ పూర్ణత్వం, వంబీజ మోహన అమృతత్వం కలవు కావున (కర్ణ)చెవిస్థానమేర్పడెను గాన అక్లేదత్వం బొందుచున్నది.

4/3 వంబీజము రసరూపమోహన అమృతత్వం, యంబీజ స్పర్శరూప ఉచ్చాటన అభేదత్వంతో జేరి, జగజ్జీవత్వం (జగత్తులో బ్రతుకుదెరువు)

బొంది, చర్మస్థానమేర్పర్చుకొని, అందు విషయస్పర్శను బంధించి గతిని గలిగించుచున్నది. కావున చర్మస్థానమాయెను. ఇందు వంబీజ రసరూప మోహన అమృతత్వం, యంబీజస్పర్శరూప ఉచ్చాటన అభేదత్వం రెండు కలవు. కావున చర్మస్థానమాయెను, కావునా జగజ్జీవత్వం బొందుచున్నది.

4/4 వంబీజ రసరూప మోహన అమృతత్వం, రంబీజ తేజోరూప ప్రకాశత్వముతోజేరి, పరంజ్యోతిత్వం (గొప్ప వెలుగు అన్నిటిని శేషించిన వెలుగు) బొంది, నేత్ర స్థానమేర్పర్చుకొని; విషయరూప రూపేంద్రియమును బంధించి గతిని గలిగించుచున్నది. ఇందు రసరూపమోహన అమృతత్వం రంబీజ తేజోరూప ప్రకాశత్వం రెండు కలవు. నేత్రస్థానమాయెను. గాన పరంజ్యోతిత్వం బొందుచున్నది.

4/5 వంబీజ రసరూప మోహన అమృతత్వం, లంబీజ గంధరూప సర్వధారత్వంతో జేరి, కారుణ్యత్వం (దయకనికరము గలది) బొంది, నాశికస్థానమేర్పర్చుకొని, అందు విషయరూప గంధమును బంధించి గతినిగలిగించు ఇందు లంబీజ గంధరూప స్థంభన సర్వాధారత్వం, వంబీజ మోహనరూప అమృతత్వం కలవు. కావున నాశికస్థానమేర్పడెను గాన కారుణ్యత్వము బొందుచున్నది, ఈ విధముగా రసతన్మాత్రచే కలిగిన, శబ్ద, స్పర్శ, రూప.రసగంధములనేవిషయేంద్రియములను,వంబీజమోహన అమృతత్వముచే, కర్ణములు, చర్మము,నేత్రములు, నాలుక, నాశికస్థానములయందు బంధించి, వంబీజము గతిని కలిగించుచున్నది,

5/1 లంబీజము గంధరసరూప స్థంభన వ్యాపకత్వము నొంది, సర్వధారత్వము (అంతట ధరించునదికూడవస్తు వినిమయము అంతట పదను. కత్తికి ధార అనగా పదును) బొంది, ముడ్డి స్థా మేర్పర్చుకొని, అందు గందమును బంధించి గతిని కలిగించుచున్నది. ఇందు ఇతర బీజ మిశ్రమములు లేవు. కేవలము లంబీజ స్థంభన సర్వధారత్వం మాత్రమే క డు. అనగా అన్నిటికి ఆధారమైయున్నది. ఇది ప్రధమక్రియ గావున ముడ్డి స్థానమాయెను గావున సర్వధారత్వం బొందుచున్నది.

5/2 లంబీజ గంధరూప స్థంభన సర్వధారత్వము, హంబీజ శబ్ద రూప ఆకాశ పూర్ణత్వముతో జే , అశోషత్వం (ఇనుఃనిది, ఎండనిది. జిడ్డుగా పదను కలది. క్షీణింపనిది) బొంది నోరు స్థానమేర్పర్చుకొని అందు వాక్కును బంధించి, గతిని కలిగించుచున్నది దీనియందు హంబీజ శబ్ద పూర్ణత్వం,

లంబీజ సర్వధారత్వం రెండు తెలియుచున్నవి. కావున నోరుస్థానమాయెను గాన అశోకత్వము బొందుచున్నది.

5/3 లంబీజం గంధరూప స్థంభన సర్వధారత్వం, యంబీజం స్పర్శరూప ఉచ్చాటన అభేదత్వంతోజేరి, కారణత్వం (హేతువు పనిముట్టుకు మూలమైనది) బొంది హస్తము (చెయ్యిస్థానమేర్పరుచ్చకొని అందుపాణిని బంధించి గతిని కలిగించుచున్నది ఇందు యంబీజ స్పర్శరూప ఉచ్చాటన అభేదత్వం, లంబీజ గంధరూప స్థంభన సర్వధారత్వం, రెండుతెలియుచున్నవి కావున హస్తమాయెను. గాన కారుణ్యత్వం బొందుచున్నది.

5/4 లంబీజం గంధరూప స్తంభన సర్వధారత్వం, రంబీజతేజోరూప ప్రకాశత్వంతోజేరి, పావనత్వం (పవిత్రతగలది)బొంది, కాళ్ళు స్థానమేర్పరుచ్చ కొని, పాదమును బంధించి గతిని కలిగించుచున్నది. ఇందు రంబీజతేజోరూప ప్రకాశత్వము, లంబీజ గంధరూప స్థంభన సర్వధారత్వం రెండు కలవు కావున కాళ్ళుయనే స్థానమాయెను గాన పావనత్వంబొందుచున్నది

5/5 లంబీజ గంధరూప స్థంభన సర్వధారత్వం వంబీజం రసరూప మోహన అమృతత్వంతో జేరి, సమృద్ధత్వం (మిక్కిలి, పంపద, తృప్తి, నిలువు అభివృద్ధి) బొంది, లింగోపస్థస్థానమేర్పరుచ్చకొని, అందు గుహ్యమును లంబీజ గంధరూప స్థంభన సర్వధారత్వం, రెండునుకలవు. కావున లింగోపస్థల స్థానమాయెను. కావున మృదుత్వం బొందుచున్నది ఈ విధముగా గంధతన్మాత్రచే కలిగిన వాక్కు, పాణి, పాద,గుహ్య, గుదములను లంబీజస్థంభన సర్వాధారత్వముచే నోరు, హస్తము, కాళ్ళు, లింగోపస్థలు, ముడ్డి స్థానములయందు, బంధించి లంబీజం గతిని కలిగించుచున్నది: పంచ తన్మాత్రలచే కలిగిన 25 యింద్రియములను, పంచబీజములనుండి 25 స్థానములేర్పరచి, అస్థానములయందు యింద్రియములను బంధించి గతిని కలిగించుచున్నవి, కావున మహాకారణ శరీరమని చెప్పబడును, కానీ దీనిని ప్రాణమనీ, మహకారణ శరీరమనీ, చెప్పబడును, కానిదీనిని ప్రాణమని, మహకారణ శరీరమని, ఈశ్వరాధిదేవతలచే, ప్రాణపంచకమున, పంచబీజములనుండి (25) స్థానములు నిర్ణయించుకొని, అందు (25) ఇంద్రియములను బంధించి, వాటికి గతిని గలిగించుచున్నవి, కావున మహాకారణ శరీరమని మూర్ధస్థానమని, వసురామాత్ర ప్రమాణము, నీల వర్ణము। ప్రత్యగాత్మాభిమాని। తురియావస్థ సగుణమని, వివేకజ్ఞానము పరాశక్తి వాయుమండలము। వాయుతత్వము.

# మహాకారణ శరీరము

భూతాకాశమునందు వాయుభువనము-వాయుభూతముయొక్క ప్రత్యేకకళలు 1 వైరాగ్యం 2 ముముక్షత్వం 3 ఆత్మత్వం, తదదర్శినత్వం 4 తురియావస్థ ఈ నాలుగు వాయువు యొక్క కళలు,

| శరీరము | స్థూలము | సూక్ష్మము | కారణము | మహాకారణము |
|---|---|---|---|---|
| కళలు | 4 | 4 | 4 | 4 |
| అభిమాని | విశ్వుడు | తైజసుడు | ప్రాజ్ఞుడు | ప్రత్యగాత్మ |
| అవస్థలు | జాగ్రత | స్వప్నావస్థ | సుషుప్తి | తురీయం |

## సమిష్టి శరీరము

| శరీరము | విరాట్టు | హిరణ్యగర్భుడు | అవ్యాకృతులు | ఈశ్వరుడు |
|---|---|---|---|---|
| అవస్థ | సృష్టి | స్థితి | లయము | సాక్షి |

వీటి వ్యవహారములు ప్రకృతి పురుషులయిన నేను మేములకు, స్థూలాతి స్థూలమైన స్థూలదేహమునందు యిరువది ఐదుఇంద్రియములుండును యీ ఇంద్రియాది అధి దేవతలయొక్క చేతన స్వరూపుడైన జీవుడు, జీవునకు చలన సత్తానిచ్చు ప్రాణము, ప్రాణచలనమునకు సత్తామాత్రమైన ప్రకాశమునిచ్చు ఆత్మ, వీటియొక్క కూడికచే, సకల వ్యవహారములు క్రియా పూర్వకముగా చేయుచుండును, ఈ విధముగా చేయుచున్నది అంతఃకరణము, ఇది ప్రాణ

వాయువుతో గలసి, నేత్రేంద్రియముల ద్వారా బయటకు పోయి, బాహ్యప్రకాశములో గలసి: సకల దృశ్య ప్రపంచపదార్థములను, వ్యవహారములను, తనయొక్క వ్యవహారములను, సర్వము తెలుసుకొని, విశ్వాభిమానముతో అనగా విశ్వుడను పేరుతో, సకల సుఖ దుఃములను అనుభవించుచుండెను, యిది జాగ్రిదావస్థయనబడును. యీ జాగ్రదావస్థయందు, ద్వంద్వరహితమైన శాశ్వత సౌఖ్యము లేదనెటి భావముతో, ఈ జాగ్రతవస్థను విడచును, ఈ జాగ్రతవావస్థ వ్యవహారము వంటిది దీనిని తెలియుటకు, త్రివిద వాదములు స్థూల శరీరము జాగ్రిదావస్థయందు చెప్పబడినవి కావున ఈ జాగ్రదావస్థ త్రికాలములయందు తెలియుట లేదు, యిది అశాశ్వతమైనదని దీన్ని విడిచి, అనగా స్థూలశరీరమును శయ్యపై వదలి, తాను సూక్ష్మ శరీరముతో కంటస్థానమందు హితయనే నాడియందుజేరును అప్పుడు కొన్ని యింద్రియములను విడుచుచున్నది, ఈ స్థూల శరీరమును గుర్తెరిగేజ్ఞానము చింతనాభిమానములు గల చిత్తము, అహంకారము విషయభోగముల ననుభవించు విషయేంద్రియ పంచకం, ఈ మొత్తము ఎనిమిది స్థూలశరీరమందే వదలి, 5 జ్ఞానేంద్రియములు 5 కర్మేంద్రియములు, 5 ప్రాణేంద్రియములు, మనస్సు, బుద్ధి, మొత్తం 17 యింద్రియ సముదాయములతో, సూక్ష్మ శరీర రూపమున, కంఠ స్థానమున హితయనెడియందు నిలిచి, భావనారూప అన్యధా పదార్థములను, తనప్రకాశమునందే, తైజస్సుడనబడు తనయందే కల్పిత జగములను కల్పించుకొని, వ్యవహారము చేస్తున్నాడు ఇది స్వప్నావస్థయని, ఈ స్వప్నావస్థ ప్రతి భాశికము వంటిదని తెలియుటకు, త్రివిద వాదములు ముందే చెప్పబడినది, ఈ త్రివిధ వాదములు అన్ని కాలములలో లేవు కావున మిధ్యయే! దీనియందు ద్వంద రహితమైన, శాశ్వత సుఖములేదని సూక్ష్మ శరీరమును విడచి మనో బుద్ధుల సూక్ష్మాంశముల తీసుకొని, హృదయమునందు పురీతయనే నాడియందు చేరి, అవిద్యావరణమైన అజ్ఞానమును ముసుగులో, మగ్నతజెందియుండును ఈ సుషుప్తి అవస్థపారమార్థికము వంటిది. దీనిని తెలియుటకు 5 విధముల వాదములు ముందే చెప్పబడినవి, యిక్కడ ద్వంద్వ పద్ధతి లేకపోయినా, అజ్ఞానమువలన తనసౌఖ్యము తెలియుటలేదని తాను ప్రత్యగాత్మయని, మహాకారణ శరీరము మూర్ధిస్థానమున, తూరియావస్థ పొందుచున్నాను, వ్యష్టిభేదములచే, ఇవి అశాశ్వితమని తనస్థూల శరీరమును పంచభూతములయందు, సూక్ష్మశరీరము తన్మాత్రల

యందు, కారణ శరీరము పంచశక్తులయందు, మహాకారణ శరీరమును పంచ బీజములయందైక్య పరచిన, తనవ్యష్టి శరీరాభిమానము విడచి, సమిష్టి శరీరాభిమానము అనగా బ్రహ్మ, విష్ణు రుద్రుడు, ఈశ్వర, సదాశివులనే, అభిమాన రహితులై, అనగా స్థూలము, విరాట్టు, సూక్ష్మము, హిరణ్యగర్భుని యందు కారణము, కారణముఅవ్యాకృతునియందు. మహాకారణము ఈశ్వరు నియందైక్య పరచి, సమిష్టి శరీరాభిమానిగా విరాట్టు, హిరణ్య గర్భుని, అవ్యాకృతిని ఈశ్వరుని యందైక్య పరచిన ఒక్క బ్రహ్మము మాత్రము నిలిచియుండును!

## పంచ కోశములు

సాధన చతుష్టయములలో, ప్రథమ సాధన యగు, నిత్యా నిత్య వస్తువివేక ములేనివారు మూఢుడు అతడు దేహమేనని, జీవుడనని, ఈ శరీరము నేను అనితలపోయును. అలాతలంచుట అజ్ఞానమే పండితుడనగా వివేకజ్ఞానము గలవాడు, దేహము జీవుడు, యీ రెండును వేరువేరని, తలంచును ఏలానగా నేనుయనునది అహంకారము, నాదియనునది మమకారము, నేను నాదియని తలంచునప్పుడు నేనువేరు, నాదియగు వస్తువువేరు, అని తెలియుచున్నది ఏలాననగా! నా చెవి, నా ముక్కు, నా చెయి, నా కళ్ళు, నా దేహము. అను నప్పుడు తాను వేరు, దేహమువేరుగా నుండుట తెలియుచున్నది. ఈ భేదము తెలియక, తనదేహము చిక్కిన నేను చిక్కిపోయితిని, నేను అలసితిని అను చెప్పు మాటలు, చిక్కినది. అలసినది తాన,లేక శరీరమా! శరీరము అలసితి అనుమాటతోనే లేక మనస్సా? అలసినది మనస్సు ఈ వివేకము లేకపోవుటకు ఆత్మ ప్రకాశము బహిర్గతముగాకుండా, కోశములచేత కప్పబడి, అనగా మూయబడియున్నది. వివేకము గలవాడు కోశాంతమునున్న, ఆత్మప్రకాశమునే చూడగలడు. అందరికి ఆపదు ఏలాయనగా; ఆత్మప్రకాశం అగుపడకుండా, ఆనందమయ కోశముయనే ముసుగుధరించి, అనగా కప్పబడినది ఈఆనంద మయకోశముపై విజ్ఞానమయము కప్పబడి యున్నది దీనిని ప్రాణమయకో శము కప్పబడియున్నది. దానిని అన్నమయకోశముచే కప్పబడియున్నది.

సీ॥ అన్నరసంబుతోనయిన శోణితశుక్లమయమైన ఈదేహమన్నమయము పంచప్రాణంబులూ గూడి కర్మేంద్రియ పంచకంబునుగూడి ప్రాణమయము జ్ఞానేంద్రియములైదు మానసంబొక్కటి కూడిమైనది మనోకోశమయము

చెలగి జ్ఞానేంద్రియములు బుద్ధియునుగూడి విజ్ఞానమయము నవిద్యయందు
గీ॥ మనసుగూడిన యానందమయములిట్లు పంచకోశంబులకుసాక్షిపరఁడవీవె
॥రమ్య॥

ఈ కోశములుగూడ ఒకదానికన్న మరొకటి సూక్ష్మముగా నున్నవి ఏలాయ
నగా అన్నమయకోశముకన్నా ప్రాణమయకోశముసూక్ష్మము. ప్రాణమయ
కోశముకన్నా, మనోమయ కోశము సూక్ష్మము, మనోమయ కోశముకన్నా
విజ్ఞానమయి కోశము సూక్ష్మము, విజ్ఞానమయ కోశముకన్నా ఆనందమయ
కోశము సూక్ష్మము, ఆనందమయకోశముకన్న (హిరణ్యమయకోశరూపమున
సూత్రాత్మ)సూత్రాత్మ సూక్ష్మము ఆత్మకన్న ఆనందమయకోశము స్థూలము
ఆనందమయ కోశముకన్న విజ్ఞానమయ కోశము స్థూలము, విజ్ఞానమయ
కోశముకన్న మనోమయకోశము స్థూలము, మనోమయ కోశముకన్న ప్రాణ
మయ కోశము స్థూలము, ప్రాణమయ కోశముకన్న అన్నమయ కోశము
స్థూలం ఈ కోశములు ఉల్లిగడ్డ పొరలవలె (అరటి పొరలవలె, నొకదానిలోనొ
కటి ఇమిడి యున్నవి) విమర్శించి చూడగా, ఆత్మ స్వయం ప్రకాశం అని
అర్థము, దీని ప్రకాశము బహిర్గతముగాకుండా, అయిదు కోశములచే కప్పబడి
లేక మూయబడి, అచ్ఛాధితమై యున్నది,గాన దానిప్రకాశం బహిర్గతమగుట
లేదు, అందువలన అన్నిటికన్నా పైనా కప్పబడి యున్నది, అన్నమయకోశం

1 కరచరణాది అవయవములతో, ప్రత్యక్షముగా కనిపించుచున్న స్థూలదే
హమే అన్నమయ కోశము, ఈ అన్నమయకోశమే ఆత్మయని, అదితా
నని తలంచిన వారు అజ్ఞానులు ఈ అన్నమయ కోశమునే పురుషుడని
దీని నిర్ణయము, అన్నరసంబుతో తల్లిదండ్రులకు కల్గుశుక్లశోణితము లచే
ఏర్పడినది. అన్నరసంబుచే పెరిగి, జనించి, పాలచే పెరిగి, అన్నముచే
వృద్ధిపొంది, చివరికి మృతినొందిన పిదప, కుక్క, నక్కలు, మొదలగు
చీమలు, క్రిములకు, జంతువులకు, అన్నమగుచున్నది. లేక అన్నముకు
కారణమగు, అన్న రూపమగు భూమియందు కలిసిపోవుచున్నది, దీనిని
అన్నమయ కోశము అందురు, ఈ కోశము పురుషునికి ఆత్మయని తల
చినారు దీనిని ధర్మమగు మనుష్యాది జాతులు, స్త్రీ పురుషులు, నపుం
సకాది లింగములు, హ్రస్వదీర్ఘాది పరిణామములు శ్వేద రక్తాది వర్ణము
లు, జాగ్రదవస్థలు, జనన మరణాలు దీనికి కారణములు మొదలగునన్ని
యు ఆత్మయందు ఆరోపింపబడుచున్నది. కాబట్టి ఆత్మ అన్నమయ

కోశమునకంటే వేరుగానున్నట్లు తెలియబడుటలేదు। ఉత్పత్తి,స్థితిలయాదులకు కారణమగుటచే, అన్నమే బహ్మముగానగును, గాన అన్నము త్రికాలములయందు ఉంటున్నది గాన, శాశ్వతమని, ఈ కోశముకు కారణమగు, క్షుత్తునునాశముచేయుచున్నది గాన, ఈ పురుషుడే బ్రహ్మమని, భ్రాంతివలన నిర్ణయించినారు అన్నమయు దేహమునెముకలకు స్థూలము భ్రమలతో కూడినది ఈ శరీరము దహింప బడుచున్నది. అశాశ్వితముగాన యిట్టిదేహముతానన్న (అత్మ అదిజలక్షణమై,సకలవేదితమైన ఆత్మకాదుఅన్నము అకలిబాధ తీర్చుచున్నందున, బ్రహ్మమనినతీరుగా, అకలి కలుగుచున్నది గాన ఇది బ్రహ్మముకాదు. ఇదిప్రాణము లేనిచో కుళ్ళి నశించుచున్నది కనుక దీని అంతరమునందు ప్రాణమయ కోశమున్నది.

2 అన్న పరిణామమైన, అన్నమయ కోశాంతరమునందు,అన్నమయకోశం లోపల ప్రాణమయకోశమున్నది. ఇంద్రియములకు బలమునిచ్చుచున్నది ఈ కోశము కర్మేంద్రియములు అయిదు, ప్రాణేంద్రియములు అయిదు మొత్తంపదిగూడి, ప్రాణమయ కోశమునవొప్పుచున్నది. ఇది శరీరము నకు యింద్రియములకు బలమునిచ్చుచున్నది. ఇది అంతయునిండిన దైవర్తించుచున్నచో, ఆ వాయువే ప్రాణమయకోశము దీనినే అజ్ఞానముచే ఆత్మయని, బ్రహ్మమని, తలంచిరి, దీని ధర్మమైన క్షుత్తుపిపాస శక్తి బలము వీర్యము వాక్కు, దాన, గమన, అనంద, విసర్జనలు, ఆత్మయందారోపించుకొని, ప్రాణశబ్దమునకు చైతన్యమని, అర్ధము అని ఊహించుకొనిరి, అలా ప్రాణమునే ఆత్మగాను, శాసించుచుఆయుషు సంపూర్ణముగా నుండునని తలంచిరి. గాని ఆత్మలేనిచో ప్రాణము జడమగుచున్నది. నదిగాలియే, గాలిగాలిలోకల్సి దీనికి ఉత్పత్తి నాశనము లుఉండుటచే నది అసత్యము, దృశ్యమగుటచే నాశనము, జడము వికారియగుటచే, యన్నృతజడము దుఃఖరూపము గాన న్నది ఆత్మకాదు.

3 ప్రాణమయకోశాంతరములో, జ్ఞానేంద్రియములు, అనగా శ్రోత్ర, త్వక్, చక్షు, జిహ్వ, ఘ్రాణములు వీటిలో మనస్సుగూడి, మనోమయకోశము అజ్ఞానముచే మనోమయకోశధర్మములు శోకమోహాదులు, రాగద్వేషాలు సంకల్ప వికల్పములు. వినుట, తాకుట, చూచుట, భోగము వాసన నాఘ్రాణములు చేచుటచే, దానిని ఆత్మగా తలంచినారు. దీనినే బ్రహ్మమనినారు. ఏలయనగా జడములగు దేహం యింద్రియ ప్రాణములు

మనస్సుచే, ప్రకాశించుచున్న విగాన, బ్రిహ్మమనిరి. యిదిప్రాణమయ కోశాంతరమున, బాహ్యమున నిండియున్నది. ఇది మొట్టమొదటిది (ప్రత్యగాత్మయనే పరమాత్మ పరాత్పరుడు, సకల జ్యోతులకు జ్యోతిర్మయం ప్రకాశమానుడు, శివుడనే, నేను ఆత్మజ్యోతిరూపము) మనస్సు అనేజ్యోతి, ఈ జ్యోతియనే నేత్రము అదియే చూచును, నామరూప జాత్యాది భేదములను కల్పించి బలవత్తరమగుచున్నది అనగా ఈ సూక్ష్మకార మనస్సు, సప్తాదిభేదభావంబులచే స్థూలాకారమగుచున్నది. వాటియందు సూక్ష్మకార మనస్సై ఉంటున్నది. మనస్సుయనగా సంకల్ప, వికల్పరూపమాయమోహాత్మకవస్తుభ్రాంతియే!యన్య అనేనేతి యన సమస్తము దీనిచే తలంపబడుచున్నది. ఒక్క నిమిషములోనే సమస్తమైన వస్తువులను భావింపశక్తి కలది. మనస్సుయనగా సంకల్ప వికల్పాత్మ అనే వృత్తి మతి అంతఃకరణం, సుఖదుఃఖాలకు ఆధారమై కామ సంకల్పో వికిత్సం శ్రద్ధా శ్రద్ధాతి ధైర్య ధైర్యములు, మనోమ కోశము, ఈ మనస్సే ఒక హోమాగ్ని ఈ మనోమయాగ్ని పంచేంద్రి యములను హోతలచే శబ్దాది, వనితాది, విషయములను ఆజ్యధారలచే తను, వృద్ధిని పొందినదై, నానా జన్మల! పరా పరంబులను, జన్మమ లినవాసనా,రూపవృత్తులను, కట్టెలవేత విశేషముగా ప్రజ్వలింపుచున్నది ఈ ప్రపంచమునే దహించుచున్నది. అనగా సమస్తజనులకు నీమనోమ యాయగ్ని కారుచిచ్చు దహించునటుల, సకల వాసనలకు లోనగునటు లజేసి, చింతాజాలంబులచే ఉడికించుచున్నది. చెడ్డ మనస్సే, సమస్తం విషమే, దుఃఖమే, మనస్సు అనిన మాయ ప్రపంచము విషమయముగా చేసి, అగ్నిరూపమై వెలుగుచున్నది. అందుచేత "సంసార" అమృతమ యకింవిషయా మనస్సు మంచిదగునేని, సంసారంకు (జగత్తు) గూడ పరమాత్మ రూపమగుటచే, అమృతమయము చేయును, చెడ్డగునేని, సమస్తము విషమే, దుఃఖమే, మనస్సు అనిన,మాయ, యిట్టి మనస్సే సంసార కారణమున, అదిలయించిన సమస్తములేక పోవును, నది చలి యించిన సమస్తము చలియించుచున్నది, నదిలేకపోయిన ప్రపంచమే, లేకపోవుచున్నది ఈ మనస్సు త్రిగుణాత్మకమైనది, సత్వగుణమనస్సు రజోగుణమనస్సు తమోగుణమనస్సు అని 3 విధములుగా నుండును సత్వగుణ మనస్సు సదామోక్షమందభిలాష గలిగి, సమస్త ప్రజలను తమతో సమానులుగా ఎంచుచు భ్రాంతి రహితమునకు సద్గురువులను

నాశ్రయించి, భ్రాంతిరహిత పర్చుకోనంతవరకు, విశ్రాంతి యనునది లేకయుండును. తమోగుణ మనస్సు క్రూరవ్యాఘ్రముతో పరిపోల్చు కున్నారు. కొంతమంది పెద్దలు ఏలననగా పెద్దపులి, యిది శబ్దాది విష యములనెడి, మహా భయంకరములగు, ఘోరారణ్యములందెప్పుడు సంచరించుచు, వ్యాఘ్రభావము గలది గాన, యే సాధువులు సాధకులై మొక్షముగావలెననే కొందరు అచ్చోటికి పోజనరు, దుష్టమనస్సు మహావ్యా ఘ్రమును పోల్చినారు గాన, వ్యాఘ్రధర్మములో మనస్సు గలవు, వ్యాఘ్ర ము మహా భయజనకమై వికృతాకారము గలది, అటువలనే దుష్టమనస్సున్న మోక్షమునకు మహాప్రతి బంధ కారి, తనుపోవలసిన, చోటికి పోనివ్వదు, సంకల్పములకు వృధా కష్టాదులను, జరుపుచున్నది. అద్వికారముజెంది స్వ భావము ప్రతి ఎక్కువగా రాత్రులయందే సంచరించును, మరియు మృగ ములన్నియు యే అపకారము చేయకపోయినా, అపరాధములు లేకపోయి నను, సంహరించును తినును అలాగే యింద్రియాదిపతియగు దుర్విషయ మనస్సు, తమోగుణముయందుండునట్టిది, పెద్దపులి పగలుకూడఅప్పుడప్పుడు సంచరించును, తర్వాత స్వస్థానమగు, గుహలో చేరియుండును, మనస్సు గూడా సత్వగుణముతో గూడియుండిన జాగ్రదులయందు సంచరించుచు, రజోగుణమగుస్వప్నములోనుసంచరిస్తుతమోగుణమగుగుహలోప్రవేశించును,అది పశువులను నిద్రనుండినప్పుడు గర్జించి లేపుచుండును గుహలో చేరగనే దేనికి భయమందు, అటిగి నిద్రగుహ్యయందుండును. ఈ మలిన మనస్సు క్రూర మైన దుష్ప్రవర్తనయందు, క్రూరమృగముల వలెనుండి, విషయాదులగూడి క్రూర మృగముగానుండును. విషయారణ్యములలో నివసించుచుండెను,అడవి లో గొప్పగొప్ప ముళ్ళచెట్లు వేరులతో నాటుకొని పెరిగియుండునటుల శబ్దాది విషయములతో ఘోరారణ్యమున అనేకమలిన వాసనలనే వేళ్ళతోగూడుకొని గొప్పదుర్గంధజాలముల నేటిముళ్ళచెట్లున్నవి, ఆవిషయారణ్యములో బాగుగా జేసిన విశాలబాట ఏర్పర్చుకోవలయును ముముక్షువు క్రూరమనస్సుయొక్క దగ్గర పైపుకు పోకూడదు, పోయినచో దానికి పశులై ప్రాకృతులై క్రూరుల గుదురు. సమస్త ప్రపంచమువిషమయముగాతుంచి, అగ్నిరూపమైదహించు పద్ధతిగానుండును. అందువేత సంసార అమృతమయం కిం విషయ మనస్సు మంచిదయ్యేనేని, సంసారం (జగత్తు) గూడ పరమాత్మ రూపమగుటచే అమృ తమయమైయుండును, మనస్సు చెడ్డదగునేని సమస్త (జగత్తు) విషమయ ము దుఃఖమే. మనస్సే అవిద్యా, మాయ, ఇట్టి మనస్సే సమస్త కారణమై

యున్నది. అదిలయించిన సర్వప్రపంచములయించును. అదిచలించినసమస్తము చలించుచున్నది. ఇక రజోగుణమనస్సుకు కోతితోబోల్చుకున్నారు. జ్ఞానవేత్తలు, దానికి కల్లు త్రాగించిన దానికి అధికచలనం జూడుడు ఆ సమయముననే దానికి తేలుకుట్టిన, దానిబాధ చలముజూడ, సఖ్యముగాదు పైగా దానికి పిశాచములు గూడా! ఆవరించినది. ఇట్లుండ దాని చలన స్వభావము విషయమై యేమి చెప్పవలయును మనస్సుకూడానట్టిదే, దీనిని సంకల్పించకుండుటకు ఈ మనస్సును వేదించుటకు శాంతియే శస్త్రమగును, కదలకసంకల్పించక నుండుటయే మనోనిగ్రహము, మనస్సు జాగ్రదావస్థయందు, నానావిధ వస్తువులను, సంతానమును భోగాదులు, మొదలగు భావములచే అనుభవించుచున్నాడు, స్వప్నములలో,నేవస్తువుండదు. ఈ బాహ్యప్రపంచమేమియు నిచ్చుట నగుపడదు, కనుమూసినంత మాత్రమున, స్థూలప్రపంచమేమియు కనుపించదు స్వప్నావస్థ నిట్టిదే స్వప్నావస్థలో నింతవరకు ననేక విషయములందు ప్రవర్తించి, సంసార రూపముగా మనస్సున్నది గాన, అదితానే కర్తృత్వరూపమునందు, కారణ కార్యరూపముగాను, భోక్త భోగ భాగ్యరూపము గనుబడుచుండెను ఇది అరూపములను సృష్టించుచున్నది. మనస్సెకన్నా స్వప్నావస్థవేరుగాదు, విచారించగా జాగ్రదావస్థలోసమస్త వ్యవహారములైన చెప్పినరీతిగా మనస్సుకు సంబంధించకనే, మనస్సులేక పోయిన జాగ్రదావస్థ దశయందే సేకరణ మేమియును గ్రహింపజాలదు, అది బ్రహ్మకారణమైన తానును బ్రహ్మమే అది(లేని)బోనేమియు లేదు జగత్తు మిథ్యారూపము గనుక, జాగ్రత అందుగూడ మిథ్యాభూత? జగత్తునంతయు సమస్తమును సృజించుచున్నది కర్త కార్య కారణములు భోక్త భోగములు మనస్సేయాయెను షుప్తావస్థా మనస్సునేర్పరుచుచున్నది. నిద్రావస్థయందు మనస్సు తమోగుణములో లీనమై, లీల మాత్రముగానుండును. అందుచేతనే నిద్రావస్థయందు, ప్రపంచమే లేదు, యేమియు తెలియదు దయయు లేదు అను విషయము అను భేదరూపమైన, పర జన వ్యవహారములకు, స్థిరమై యున్నది. గనుక పురుషునికి ఆత్మ అచ్ఛాదన రూపమగు సుషుప్తియందు, సంసారముగూడా మనస్సుచే, కల్పితము, ఇలా విచారించిన పరమాత్మకే అవస్థలు లేవని తెలియుచున్నది. మరియు ఆ మనస్సు యోగులుకొందరు మనోలయమే అమనస్కమని, సమాధియని చెప్పుదురు. నిద్రావస్థయందు మనస్సులయమగు చున్నది కదా! సమాధి నిద్రావస్థకేమిభేదము? అని విచా

రించగా, నిద్రావస్థయందు మనస్సు అవిద్యయందు లయమగుచున్నది. సమాధియందు మనస్సుపరమాత్మయందు లయమగుచున్నది. అనగా తేజోరూపమొందుచున్నది. సందుచేపరమాత్మవిషయకమైనజ్ఞానము గలదిగానున్నది ఆ మనస్సుతమస్సులో లీనముగాక బ్రహ్మరూపనుగుచున్నది యే ప్రకారము మనస్సుచే బంధమోక్షములు వచ్చిపోవుచుండును గాన, తదంతరము సూర్యుడు ప్రకాశవంతముగా నుండునటుల, కామశక్తితో కూడుకొన్న మనస్సు తమోశక్తి రహితమై, చిత్తము మోక్షము కలుగజేయును మనస్సులేనిచో, బంధమోక్షములు వేరితో పనిలేదు కాన, ఈ మనోమయ పురుషుడు ఆత్మగాదు, బ్రహ్మముగాదు ఏలయనగా యీ మనోమయ కోశము సర్వకాలముల యందుండుట లేదుగాన అశాశ్వతము బ్రహ్మముగాదు? మనోమయ కోశాంతరమున, విజ్ఞానమయ కోశమున్నది. ఈ విజ్ఞానమయ కోశము. శ్రోత్ర, త్వక్, చక్షు, జిహ్వ ఘ్రాణములు ఐదు, మరియు బుద్ధియుగూడి, విజ్ఞానమయ కోశము ఈ కోశమున నిశ్చలత్వము గలదు, మనోమయ కోశము చంచలత్వము గలదు, ఈ కోశము అలాగాక నిశ్చలత్వము నుండుటచే, తత్వపరిశోధన దీనియందు జరుగుచుండుటచే, దీనిని విజ్ఞానమయ కోశమని చెప్పబడుచున్నది. మనోమయకోశము కార్యరూపముగానున్నది ఇది కారణరూపముగానున్నది. జ్ఞానేంద్రియ వ్యాపారమగుయజ్ఞయాగాది సమస్తధర్మములకు కారణమై కర్తయగుచున్నది. సర్వ కర్మలు విజ్ఞాన యుక్తముగా, శాస్త్రములందు సంపూర్ణ విశ్వాసముగల బుద్ధియందు. బ్రహ్మత్మాకార వృత్తులుకలుగుచున్నది. ఈ విజ్ఞానమయ కోశము పురుషునకే ఆత్మయని తలంచారు, ఏలయన సంసార కారణం అనగా బంధమోక్షములకు, అనుకూలమిచ్చుచున్నది. ఇది ఆత్మగా దానిని గప్పుకొని ప్రకాశింపజేయును ఇచ్చట మనోమయకోశము కార్యముగాను, విజ్ఞానమయకోశము కారణముగా నున్నది. అన్ని వృత్తులకు పైన కర్తనను జ్ఞానముగలది. విజ్ఞానమయకోశము ఇందు నేను అహం వృత్తి గలదు అంతఃకరణము మొదటిదగును, రెండవది అహం వృత్తి గలదు వృత్తిభేదములచే రజోతమోగుణములు గలిగి మూర్ఖత్వముగా కార్యరూపమైనది దీనికి కారణం విజ్ఞానమయకోశము అంతర్వృత్తి గలదు ఈ విజ్ఞానమయ కోశము ప్రకృతియొక్క వికారమే, అనగా ప్రకృతి రూపమేర్పడెను. కూటస్థునియొక్క ప్రతిబింబశక్తితో కూడియున్నది. లేక బ్రహ్మము ప్రతిబింబములో కూడియున్నది కనుకనే ఇది దేహేంద్రియాదులు నావని అభిమానించును, ఈయింద్రియములయొక్క జ్ఞానమును వ్యాపారము

గలదై, కర్తృత్వరూపమైయున్నది. అనగా జీవుడే విజ్ఞానమయ కోశమని, నిరంతరం మిక్కిలి అభిమానముతో, కూడుకున్నవాడై, దేహేంద్రియాదుల యందు వ్యవహరించుచున్నాడు. అని భావము ఈ కోశము జీవుని స్వరూపము, ఈ దేహేంద్రియాదులు నాయనియు, అవియే నేననియు, భేద జ్ఞానము గలవాడై, వీటన్నింటికి నేను వ్యతిరేకుడను, వానికినాకు యెలాంటి సంబంధము లేదు, అని తెలియువాడే, అంతరాత్మ ఈ విధముగా జీవత్వం, ఈశ్వరత్వం, అభిమానం, నిరభిమానముచేఏర్పడినదని తెలియవలెను. చిదాభానుడు బ్రహ్మముకన్న వేరే, బ్రహ్మమువలే నేననబడేవాడు కూటస్థుడు ఈ కోశముచే చూడదగినది ఆత్మ, అధిష్టాన చైతన్యము, సాక్షియను పేర్లు, జీవుని ఆకారము ను కనుగొని సదా ఏకరూపముననుండునుకాని, ఇది ఆత్మగాదు. ప్రాణమయ మనోమయకోశము విజ్ఞానమయ ఈమూడుకోశములుసూక్ష్మశరీరమనబడును సమిష్టి సూక్ష్మ శరీరము, హిరణ్య గర్భుడని చెప్పబడును.

5. విజ్ఞానమయ కోశముకన్నా సూక్ష్మము, అనగా దీనిలో ఆనందమయ కోశమున్నది. అదియు ఆత్మకాజాలదు. దీనియందు జీవుడు ఆనందము అనుభవించుచున్నాడు ఈ ఆనందమయ కోశము, ఆత్మనావరించియున్నదిగావ దీనియందు ఆత్మానందమును తెలియజేయుచున్నది, ఈఆనందమయకోశము మనస్సు ప్రకృతియనగా అజ్ఞనవృత్తియందు అయమౌట, యనగా నిద్రావస్థ ఇది జీవునికి కారణదేహము, జాగ్రావస్థలో ఆనందమయ కోశము యొక్క ఉనికి గలదు ఈ ఆనందమయ కోశమనునది, పరమాత్మచేత సృజింపబడిన స్వరూపము గలదై, తమోగుణముచే విజృంభణము పొంది (అతిశయమైన, వృత్తియై ఆనందము ఇది జాగ్రద స్వప్నావస్థ యందు కూడా క్షణికముగా పొందింపబడును

1 ఇష్టమైన వస్తువులచే గలిగిన ఆనందమును ప్రియమనదను,
2 ఆ వస్తువు ప్రాప్తించగ గలిగినది ఆనందమోదమని,
3 ఆ వస్తువును అనుభవించిన ప్రమోదమనబడును.

ఈ విధముగా ప్రియమోద, ప్రమోదములయందు బుద్ధిఅంతఃకరణముఖమగుచున్నది అప్పుడు ఆనందరూప ప్రతిబింబము సృజించుచున్నది, ఈ ఆనందము స్థిరముగానుండదు క్షణికముగాన, కొద్దిసేపు ఉండి నశించుచున్నది, నిద్రావస్థలో పొందు ఆనందము స్థిరమని యెంచును, తిరిగి జాగ్రత్తకు వచ్చినచో, వెంటనే ఆనందము స్ఫురణకు వచ్చి, నేను ఆనందించితినని పలుకను, తిరిగి చూడగాలేదు, గాన ఆనందము వచ్చుచు పోవుచున్నది గాన,

ఇది ఆత్మగాదు, సవికల్ప సమాధియందు స్థిర ఆనందము బొందును, దీని కన్నా నిర్వికల్ప సమాధి యుండదిక ఆనందముండును, ఈ సమాధుల యందు ఆత్మ స్థిరముగా యుండును, గావీ మనోబుద్ధులు భాషింపవు, సుషుప్తియందు, మూలప్రకృతియొక్క వికారరూపమే కారణ శరీరముగా పరిణమించుచున్నది. పుణ్య కర్మలయొక్క అనుభవ రూపమైనది గనుకనే సుకృతాత్మలు శ్రేష్ఠమైనబడసి నందములో నుండును, మరియు నేను సుఖిని, నేను భోక్తను, నేను ఆనందమయుడను, అను వికారములకు లోనౌను, గాన నిది ఆత్మగాదని, పదేపదే సుషుప్త్యావస్థను బొంది, ఆనందించును గాన, ఇది ఆనందమయ కోశమని చెప్పబడినది, ప్రియ, మోద, ప్రమోదములను, సాత్వికాంతఃకరణ వృత్తుల యందును, ఆత్మానందము వ్యాపించి అనుభవింపుచున్నది, ఈ విధముగా కోశములు ఆత్మను ఆవరించుకొని యున్నవి, నిలువు కత్తికి ఒర అవరించుచున్నది గదా! అలాగున నుండుటవే, వీనికి కోశములని ప్రసిద్ధి వచ్చెను, గాన పంచకోశములు కత్తికి పొరవలె, ఆత్మకు కోశములుగా! నుంటున్నవి, వొరలో నుండు కత్తియగుపడనట్లు కోశములలోనుండు ఆత్మగోచరము కాదు, అలా చెప్పిన ఆత్మ పరిజ్ఞానముగను ఆత్మ కోశముల అంతరము నందు, బాహ్యమునందు, అపరిజ్ఞానముగానున్నది ఆత్మనే హిరణ్మయ కోశము అనబడును,

## వ్యష్టిశరీరముల నిర్ణయము

1) అన్నమయ కోశము, స్థూల శరీరము, జాగ్రితావస్థ, విశ్వుడు

2) ప్రాణమయ కోశము | మనోమయ కోశము | విజ్ఞానమయ కోశము — సూక్ష్మ శరీరము స్వప్నావస్థ తైజసుడు

3) ఆనందమయకోశము, కారణశరీరం, సుషుప్త్యావస్థ, ప్రాజ్ఞుడు

4) హిరణ్మయకోశము, మహాకారణ శరీరం, తురియావస్థ, ప్రత్యగాత్మ

## సమిష్టికోశ నిర్ణయము

1) పృథ్వి సమిష్టి అన్నమయ కోశము, దీనియందు సకల జీవజంతువులు, మానవోపాధి, సకల చరాచరములు సృష్టిబొంది, వ్యవహరించి దీని

యుండే లయమగుచున్నవి, గాన, యీ పృధ్వియే అన్నమయకోశము (స్థూల శరీరము) విరాట్టు అనబడును

2) జలము ఇది సమిష్టి ప్రాణమయకోశము సకల జీవో... దప్పులను దీర్చి రక్షణ జేయుచున్నది,

3) అగ్ని ఇది సమిష్టి మనోమయకోశము సకల పదార్థములను తెలుసుకొని తెలియజేయుచున్నది, వ్యష్టిజీవోపాధులకు సకల వ్యవహారములు జరుపుటకు, వాటి కర్మల ఫలితములు యిచ్చుచు, అనగా ప్రారబ్ధములను నొసంగి, సంచితములను గైకొని తనయందు నిలువ నుంచును,

4) వాయువు ఇది సమిష్టి విజ్ఞానమయకోశము, జీవోపాధులకు ప్రారబ్ధరూపకర్మల, అగ్నిగుండా (సమిష్టి మనోమయ కోశమునుండి, అందించి సంచిత కర్మలను అగ్నినుండి గైకొని, చనిపోయినవారి సూక్ష్మశరీరాదులను, దుష్కర్మను చేసిన జీవోపాధులను, అధోరూపముగానుండు(4) నరకలోకములకు పంపును, కర్మలచే నొప్పు జీవులకు, పితృలోకములకు సత్యలోకములకు పంపించును. 2,3,4, జలము, అగ్ని, వాయువు ఈ మూడు కోశములు సమిష్టి సూక్ష్మ శరీరము, అనగా హిరణ్మయ గర్భ డను పేరుచే, జీవోపాదుల సకల కర్మలను, వాటి ఫలితములను, అనుభవింపజేసి సృష్టి, స్థితి, లయాదులను చేయుచున్నది.

5) ఆకాశము సమిష్టి ఆనందమయకోశము, ఈశరీరము అవ్యాకృతరూపము (అవ్యాకృతుడను శరీరము)నందు నిండియుండి, జీవోపాధుల కర్మానుసారఫలంబుల నిచ్చుచు, సకల జీవులు ఉండుటకు, తిరుగుటకు, సకల కర్మలు చేయుటకు, అవకాశమిచ్చుచున్నది. కారణ శరీరము, అవ్యాకృతుడు సుషుప్త్యావస్థయుగు శూన్యము.

6) మహాకారణ శరీరము, ఆత్మలేక పరమాత్మ, తురియావస్థఅనగా ప్రశాంతం

1) వ్యష్టి అన్నమయ కోశము, స్థూల శరీరము కార్యము దీనికి, కారణరూపమైన సమిష్టి అన్నమయ కోశమగు విరాట్టులోనే ఉన్నది వ్యష్టిస్వరూపము సర్వరూపము కార్యముగాక, సమిష్టి అన్నమయ కోశమగు, పృధ్వి కారణముగానున్నది. ఈ రెంటికి భేదము లేదని తెల్సుకొని దృఢత్వము కలిగిన, కూపస్థ మండూకముగాక, విరాట్టునందుండుటక తానేమై విరాట్టుయొక్క విశాలత్వము గ్రహించి, తాను విరాట్టుగానేయుండును. ప్రాణమయ కోశాంతరమున తాను ప్రాణమయమని తలంచును.

2) వ్యష్టిప్రాణమయ కోశము. సమిష్టి ప్రాణమయకోశములో నైక్య పరచిన, ఈ కోశము బయటి వాయువువలే వాయురూప చలన, రూపరాకపోకలు గలదు। యిది శాశ్వితముగ్గాదు, అనే నిర్ణయము పైన సమిష్టిరూపక్రి యోన్ముఖుడగు సూత్రాత్మననే జ్ఞానము కలుగును గాన, కార్యరూప ము ను విడచి, కారణరూప ప్రాణమయ కోశమగు, సమిష్టి క్రియోన్ముఖుడ నగు, సూత్రాత్మననే భావనచే, ఆ రూపము బొందును.

3) వ్యష్టి మనోమయ పురుషుడనుగాను, సమిష్టి మనోమయ కోశరూపుడు (అగ్ని)తేజోరూపుడననే నిర్ణయము పై, తాను సమిష్టి మనోమయ సంక ల్పాత్మకుడగు,సూత్రాత్మగానొప్పుచుండును క్రమక్రమంగారూపుడగును

4) వ్యష్టి విజ్ఞానమయ కోశరూపుడను గాను సమిష్టి విజ్ఞానమయ కోశరూపు డగు నిశ్చయాత్మకమగు సూత్రాత్మ (వాయువు) నేనేయను అనే భావన కల్గును అప్పుడు నిజముగా తాను నిశ్చయాత్మయగు సూత్రాత్మననే భా వన కలుగును జల, మగ్ని, వాయువు,అనగా, ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఈ మూడు కోశములు సమిష్టి సూక్ష్మ శరీర వృత్తితుడగు హిరణ్మయ గర్భుడగుచున్నాడు భూలోకమునందు పదునాల్గు లోకముల యందు నేనేయుండి దేనిదృష్టి గలిగిన దానిలోనేచుండి అక్కడి భోగము లను సుఖ దుఃఖము ల్వేచికల చదంబున బొందుచుండును.

5) వ్యష్టి ఆనందమయకోశమును నేనుగాను అని, తనదృక్కు నిర్ణయము, సమిష్టి ఆనందమయ కోశమునేనను భావనచేతను, అవ్యాకృతుడై సర్వ మునందునిండి, ఆనందమయుడగుచున్నాడు, గాన తానువ్యష్టికోశ శరీ రమగు అజ్ఞానమును పోయి, సమిష్టి కారణరూపుడగు అవ్యాకృతుడై యుండును.

6) వ్యష్టి హిరణ్మయకోశ స్వరూపడగు, చిదాభానుడ నేనుగాను, సమిష్టి హిర ణ్మయ కోశరూపుడగు పరబ్రహ్మ స్వయం ప్రకాశకుడుగా భావన గల్గిన చిదాభావత్వం నశించిన, ప్రకాశస్వయంభూయగు, పరమాత్మయేయగు బిందువు సింధువులలో గలిగిన, బింధువనేనామము నసించునందు నేలా గున నగుచున్నదో, తాను పరమాత్మ స్వరూపుడ తత్వమని, భావన, వాచ్యార్థ లక్ష్యార్థములచే అనుభవార్థము కలిగినతాను, పరబ్రహ్మయే యగుచున్నాడు, గాన వ్యష్టిరూప బింధువు నశించిన సమిరూప సింధువుయగునని తలంచి, వ్యష్టిరూపమును వదలి తాను పరమాత్మదే

యగుచున్నాడు. అష్టతనువులు శూన్యమొందినతనకు, పరిపూర్ణమునందు నుండుటకు తావులేదు. ప్రస్తుతము తాను ఎక్కడ ఉండి పరిపూర్ణమును దర్శించ వలయును? దర్శించిన తానుండ గలడా? యీ అష్ట తనువుల యందు, విషయరూప అంతఃకరణముతో సహ, విషయరూపమైయున్నది గావున వీటిబారినుండి తప్పుకొనుటకు, తాను సద్గురు స్వాముల పాదపద్మముల యందుండిన విషయాదులు నిర్విషయమైపోవును కావున గురుపాదములయందు, తాను అష్ట తనువులను విడద, ఆ పరిపూర్ణబోధ పొందుటకు, కైవల్య శరీరములు కల్పించుకొని, గురువాజ్ఞ ప్రకారము వర్తించ వలయును.

# కైవల్య దేహ నిర్ణయము
## మహాకాశమునందు భూతాకాశ భువనము

| | నిర్విషయా అంతఃకరణము | నిర్విషయ సమానాదులు | నిర్విషయ రూపాదులు | నిర్విషయ రసాదులు | నిర్విషయ గంధాదులు |
|---|---|---|---|---|---|
| సదాశివుడు | మహాకాశము | దహరాకాశము | నిరవయాకాశము | సూర్యాకాశము | భూతాకాశము |
| ఈశ్వరుడు | ఆత్మారామత్వం | అనామృత చైతన్యత్వం | చిదీశ్వర భావసమఖిలలీనత్వం | సత్యజ్ఞానమనంతలక్ష్యణపరత్వం | అంతర్బాహ్య స్ఫూర్తి రహితత్వం |
| రుద్రుడు | స్వయం జ్యోతిత్వం | పరంజ్యోతిత్వం | జ్యోతిర్మయత్వం | ఆపోజ్యోతిత్వం | జగత్ జ్యోతిత్వం |
| విష్ణువు | పరాత్పరత్వం | పరమ సత్యం | తత్వామృత తత్వం | అమృతత్వం | బోధామృతత్వం |
| బ్రహ్మ | భేదాభేదాతీతత్వం | అభేదాభేదత్వం | భేదాభేదత్వం | అఖండత్వం | ద్వయత్వం |

# కైవల్య శరీరము

1) సదాశివుడు నిర్విషయాంతఃకరణ శుద్ధసాత్వికము మహాకాశము,(గొప్పది) అన్నిటిని తనయందుండుటకు స్థానమిచ్చినది. అన్నింటికి అవకాశమిచ్చినది. అన్ని తనలో తనను మరుగు పర్చుటకు కప్పుకొనినది. అచ్ఛాదితమొనర్చు కొనునది. అన్నిటియందనిగి, తనఉనికిని తెలియనీయక అన్నింటిని ప్రకటనపర్చు రూపము(బ్రహ్మము)గానున్నది. ఇందు ఇతర దేవతల సముదాయము లేదు, కేవలము శుద్ధ సాత్వికమే గలదు. మరియు తనయందు తనను మరుగు పరుచుటకు, దహర, నిరవయ,, సూర్య, భూతాకాశ ఆవరణములుయుండుటకు, స్థానమిచ్చిన అదికాల చక్రమనబడుచున్నది. అయిన తనవునికికి భంగముకలుగదు, కావున ఉత్తమ పురుషుడని, అఖండపు బెరుకని, స్వయంప్రకాశచేతన బ్రహ్మమని, సకల చరాచరములు యుండుటకు, అన్నింటికి స్థానమిచ్చునది. తనకు స్థానము, అచలపరిపూర్ణమందు లేదు, కావున మూలములేనిది, ఎండమావులయందు జలము అగుపడుటయేగాని, వెదకిన లేదు, ఆ విధముగా యిది అచలపరిపూర్ణ పరంయులుయందు లేకనేతోచినది. కావున మూలములేని యీగుర్తెరిగే శరీరము యేమిలేదు అనినిర్ణయము, తనయందు తాను,బ్రహ్మండపిండాండములుగా పరిణమించినది, కావునబ్రహ్మండమందు ఉత్తమ పురుషుడని, పిండాండమునందు అక్షర పురుషునిగాను, కూటస్థుడుగాను. వ్యవహరింపబడుచున్నాడు. కావున మహాకాశమని పరాకాశమని చెప్పబడును

2) సదాశివుడు నిర్విషయాంతఃకరణ శుద్ధ సాత్వికము మహాకాశము, ఈశ్వరుడు నిర్విషయ సమావాధులు సాత్వికము అనామృత చైతన్యముతో జేరి, దహరాకాశ (అన్నిటిని తనయందుంచుకొని, అచ్ఛాదనమొనర్చుకొని, ఒకదానికొకటి సంబంధములు కలుగుటకు, అన్నియు అన్ని విధముల నడచుటకు, అవకాశమిచ్చునది బ్రహ్మము) రూపముగా అక్షర పురుషుడగు చున్నాడు. దీనియందు మహాకాశము యొక్క అచలస్థితి, మరియు యీతని సంకల్పముచే సృష్టి జరుగుచుండును యితని వికల్పములచే లయమును బొందుచున్నది యితని తటస్థ లక్షణముచే స్థితిజరుగుచున్నది. కావున బ్రహ్మండమునందున అక్షరపురుషుని గాను, పిండాండము నడుపుటకు, పదార్థరూపమైన

చంద్రుడుగాను, వ్యవహరించుచున్నాడు. నిర్విషయ సమానాధులు పిండ బ్రహ్మాండముల భరించి, ధరించి గతి గలిగించుచున్నది. కావున దహరాకాశరూపమున సకల జగత్తులను లీలమాత్రముగ ఆడించుచుండును, యీ అక్షర పురుషునిచే, లోకంబులు లోకేశులు, అధిదేవతలు, దిక్పాలకులు, నవగ్రహములు, నక్షత్ర మండలములు, వాటివాటి పనులు నెరవేర్చుటకు, సత్తానొసంగబడుచున్నది. కావున సూత్రధారుడనబడును, ఈ అక్షర బ్రహ్మము ఊర్ణనాభి తననోటినుండి వెడలు దారములచే, పటములు అల్లు విధముగా, తిరిగి అదే హరించు విధముగా, సర్వ బ్రహ్మాండ పిండాండములకు, ఖండా ఖండములుగా సృష్టించి, తాను కదలక ఖండములుగాక, అఖండముగనే యున్నాడు కావున అవ్యక్తుడని, అక్షరుడని నిర్విషయ సమానాధులని చెప్పబడును.

3) సదాశివుడు నిర్విషయాంతఃకరణ శుద్ధ సాత్వికము, నిర్విషయ రూపాదులు మలిన సాత్వికము, జ్యోతిర్మయత్వముతో జేరి, నిరవయాకాశము (అవయవములు లేనివ్యాప్తి బొంది, అన్నిటికి అవకాశమిచ్చునది, స్వప్రకాశ బ్రహ్మము) రూపముబొంది అక్షరుడకుచు, పరమేష్టియగుచున్నాడు దీనియొక్క మహాకాశముయొక్క అచలస్థితి, మరియు నిర్విషయరూపాదులు, జ్యోతిర్మయత్వం సూత్రాత్మ (అక్షరునియొక్క పట్టు విడుపులు) యగుచున్నాడు, అనగా దారము మణులు పూసలు ధరించియున్న దారమగుపడని విధముగా దీనియందు సకల జీవులు గృచ్చబడియున్నవి. అనగా నడుపబడియుండుట మునుండియు, వాటి కర్మలకు తగుఫలంబులనొసంగుచు, ఆడించును తాను, అవ్యక్తముగా యే అవయవములులేక అక్షర పురుషుడని చెప్పబడును. ఏలయన తనయందు సర్వములయమైనా, తాను కదలక, తన ఉనికికి భంగము కలుగక, ఉండుటమునుండి, అక్షర పురుషుడని చెప్పబడును. ఏలయన తనయందు సర్వములయమైన, తాను కదలక తన ఉనికికి భంగము కలుగక, ఉండుటమునుండి, అక్షరపురుషుడని, ప్రకృతికి పరముగా నుండి సృష్టిస్థితిలయము విస్తీర్ణ ఆకర్షణములు చేయుటచే, పరాప్రకృతియని, చెప్పబడును. ఇది అన్ని దేవతలకన్న గొప్పది. దీనియందు పిండ బ్రహ్మాంటములున్నవాటిని, భరించిధరించి, జీవోపాధులకు గతులు గలిగించుచున్నది. మరియు సకల దేవతలకు సత్తానిచ్చుచున్నాడు. జీవోపాధులకు సకల విద్యలు,

సమస్త ఐశ్వర్యములు, అష్టసిద్ధులు, 32 బ్రహ్మవిద్యలు, 32 అసుర విద్యలు, 14 కామ్య విద్యల ప్రాప్తింపజేయుచున్నాడు. మరియు మోక్షమునొసంగుటచే మూలపురుషుడని, పురాణపురుషుడని, విధ్వాంసులు చెప్పుచున్నారు. కావున అక్షరపురుషుడై, బ్రహ్మాండమును నడుపుచు పరమేష్ఠియై, పిండాండమును నడుపుచు, తనయందుతాను నిర్విషయ రూపాదుల నిరవయాకాశముగా నుండును.

4) సదాశివుడు నిర్విషయాంతఃకరణ శుద్ధ సాత్వికము, విష్ణువు నిర్విషయ రసాదులు, రజోగుణము అమృతత్వముతో జేరి, సూర్యాకాశము (సర్వమును ప్రకాశింపజేయుచున్న అన్నిటికి వెలుగై సుజ్ఞానము నిచ్చుచున్నది. కాలరూపమైఅవకాశమిచ్చుచు, సృష్టిస్థితికి కారణమగు బ్రహ్మము) రూపమున అక్షరుడై క్షేత్రజ్ఞుడగుచున్నాడు. ఇతడే సర్వమునకు సకల సృష్టికి మూలము, దీనియందు మహాకాశముయొక్క అచలస్థితి, మహద్ (గొప్ప) (అహం నేను) అనుచు సకల కాలములగుచు, దీనినుండి సకల ఐశ్వర్యములను జీవోపాధులన్నిటికి యివ్వబడుటము నుండి, సితారూపమున, మాతారూపమున, ప్రకృతియందు బీజమునుంచి, సృష్టి కారకుడగుచు పోషించి రక్షించుచున్నాడు గాన, ఈశ్వరుడు లేక అంతఃకరణమని, పంచభూతములే శరీరము కలవాడు కాన, విరాట్టు అనియు, మరియు పంచభూతముల ఆవరణములచే కప్పబడి (మూయబడి) వాటి అంతరమునుండి, సత్య సంకల్పములు చేయుచు, సృష్టిస్థితి, లయ, విస్తీర్ణ, ఆకర్షణములచే, నడిపించుచు, కాలానుసారముగా. పంచభూతములు అనగా, పృథ్వి, జలమందులయంబై, ఆ జలము అగ్నియందు లయంబై, ఆ అగ్ని వాయువు యందులయంబై, ఆ వాయువు ఆకాశము యందులయంబై ఆ ఆకాశము తనయందు లయుబైన, తన ఉనికికి భంగం కలుగక తిరిగి వాటిని సృష్టిస్తూ, అక్షర పురుషుడగుచున్నాడు. ఈశ్వరుడని, పరాప్రకృతియని చెప్పబడును. పిండాండము నడుపుటకు క్షేత్రజ్ఞుడగుచున్నాడు. కావున జీవోపాదులకు జివ్వోపస్త విషయ లోలత్వమొందించి, నంత నాపేక్షగానుండుటకు సత్యమునుంచి తాను,నిర్విషయ రసాదులుగా, దీనిని అంటక సూర్యాకాశముగా నుండును.

5) సదాశివుడు నిర్విషయాంతఃకరణ శుద్ధ సాత్వికము మహాకాశము. బ్రహ్మ నిర్విషయ గంధాదులు తమోగుణము, ద్వంద్వముతో జేరి భూతాకాశము (అల్పాంధకారము అజ్ఞానము స్థూలరూపమున యుగుపడి అజగద్వ

స్తువులను అనగా, సకల దేశములు, సకల వస్తువులు వుండుటకు అవకాశ మిచ్చునది, వాటిని తనయావరణమునందు కప్పియుండి, శూన్యముగా మరుగు పర్చునది) రూపమును బొంది, సమిష్టి శరీరమగు రుద్రుడగు చున్నాడు. దీనియందు మహాకాశముయొక్కఅచలస్థితి, అనగా ఉత్తమ పురుషుడే అక్షరపురుషుడై మరియు భూతాకాశయావరణరూపమగు, బ్రహ్మ నిర్విషయ గంధాదులు, యనగా వాసనలు (కర్మ) లేక సంబంద ములు, యివి తొమ్మిది విధములు 1) భార్యభర్త 2) పితాపుత్రులు 3) రక్ష రక్షక 4) శేషశేషిక 5) జ్ఞాతుజ్ఞానము 6) శరీర శరీరి 7) ఆధారదేయ 8) భోక్తు భోగము 9) స్వామిభృత్యులమ నవవిధ సంబంధ ములు భ్రాంతియుండుటచే, భూతాకాశ అజ్ఞానముచే కప్పబడినందున (మరుగు పరచబడి) పిండాండమందు దుఃఖములు కలుగుచు, ద్వంద్వా దులయందు స్వరూపత్వము కలిగి, మూర్ఖత్వము జెందుట దుఃఖములు నివారించుటచే, రుద్రుడగుచున్నాడు. కనుక బ్రహ్మాండమునందు సమిష్టి శరీర అక్షర పురుషుడని, పిండాండము నడుపుటకు రుద్రుడగుచున్నాడు తనయందు నిర్విషయ గందాదులుగా నుండుటమునుండి భూతాకాశము యగుచున్నది. ఈ విధముగా శబ్ద తన్మాత్రచే కలిగిన జ్ఞాత, మనస్సు బుద్ధి, చిత్తము, అహంకారములకు నిచ్చు చేతనశక్తి చలనమునకు నిచ్చుకూటస్థుడు. చంద్రుడు, పరమేష్టి, క్షేత్రజ్ఞుడు, దుర్గలను, ఆదిదే వత్వములకు సదాశివుని తేజస్సుచే, తన చలనమునకు తేజమును కలి గించు చేతనమున్న సాత్వికము.

2/1 ఈశ్వరుడు నిర్విషయ సమానాదులు అనామృత చైతన్యం (నృతా మృతములు లేనిది తెలివి గలవాడు కదలిక సహజ చైతన్యము) అనబ బడను, దీనియందు యితర దేవతామిశ్రములు లేవు, కేవలను ఈశ్వరుని నిర్విషయ సమానాదులే కలవు, దీనియందు బ్రహ్మాండ పిండాండములు భరించి, ప్రచురించుచున్నది కావున విశ్వయోని (అనగా పరిణమించు బ్రహ్మాండమును భరించుటకు సమిష్టి ప్రాణపంచకమై, వాటియందు పిండాండ స్పర్శలనుతెలుసుకొనును దానియందు విషయరూప సుఖదుఃఖ ములను తెలియక, నిర్విషయ సమానాదులను అనామృత చైతన్యముగా నుండి. బ్రహ్మాండమును భరించి, అక్షర పురుషుడగుచున్నాడు, ఇతను పిండాండ ఈశ్వరాండములు, మహా ప్రళయమునందు లయంబై నశి యించిన, సమానాదులు, లయంబై వాటి దానికి తెలియక పోయినను

అక్షర పురుషుడుగా, తన ఉనికికి ఎట్టి హాని కలుగనీయక, ఉండుటము నుండి అక్షర పురుషుడనబడును, ఈ అక్షర పురుషుడు బ్రహ్మాండమున మరలోక సూక్ష్మ శరీరాదులు ఉండుటకు, 14 విధముల ననుభవించుటకు, ఒకదానికన్న ఒకటి, సూక్ష్మముగా ఆనందముగా నిర్మించి సంచిత ఖర్మ అనుభవించిన, సూక్ష్మ శరీరాదులయందున్న, కారణ జీవచయంబుల చేర్చుచు, భరించుచున్నాడు. కావున పిండాండమునందు, జీవేశ్వర జగదోపాదులు కలిగించడము నుండి, విశ్వయోనియనబడును. క్షరాక్షరపురుషద్వయ పద్ధతులు, వాటియొక్క ద్వయపద్ధతులు, పిండాండ విశ్వాండములు, యనగా జీవ ఈశ్వర జగదోపాదులు, తనయందు బహిర్గతము యగుటము నుండి, విశ్వయోనియని చెప్పబడును. తనయందు నిర్విషయ సమానాదులుగా నుండుటము నుండి అనావృత చైతన్యమనబడును.

2/2 ఈశ్వరుడు, నిర్విషయ సమానాదులు, సాత్వికము, అనావృత చైతన్యము, సదాశివుడు నిర్విషయాంతఃకరణము, శుద్ధ సాత్వికము, మహాకాశముతో జేరి, ఆత్మరామత్వం (ఆత్మలోనే అనగా తనలోనే తాను కలిసి ఆనంద స్వరూపుండగుట) బొందిజయుడగుచున్నాడు. దీనియందు సదాశివుని మహాకాశము యొక్క చలనస్థితి, మరియు ఈశ్వరని అనావృత చైతన్యము, అనగా తాను కదలక, సర్వమును చలింపజేయుచు, బ్రహ్మాండ స్పర్శలుభరించుచు, బ్రహ్మాండమునందు కారణరూప జీవచయంబుల తనయందుంచి, ఆనంద సాగరమున ఏమియుతెలియక, బ్రహ్మమునందు బ్రహ్మమై చేరియుండునని గతకర్మను భవంబున, అవిద్య అవరణమగు మరుపునందు విశ్రాంతినొందుచు, అత్మారామత్వమును బొంది, అందుతాను నిర్విషయముగా నుండును. కావున బ్రహ్మాండమునందు అక్షర పురుషునిగా, పిండాండము నడుపుటకు యే ఆటంకము లేక, నిర్విరామంగా నడిపించడము నుండి జయుడగుచున్నాడు కావునతనయందు తాను, నిర్విషయ సమానాధులుగా నుండి ఆత్మరామత్వం బొందుచున్నది

2/3 ఈశ్వరుడు నిర్విషయసమానాదులు సాత్వికము అనావృత చైతన్యము రుద్రుడు నిర్విషయ రూపాదులు మిశ్రమ సాత్వకము జ్యోతిర్మయత్వం తోజేరి, చిదీశ్వరభావ మఖిలలీనత్వము (చేతనమైన ఈశ్వరుడు అంతట ప్రకాశిస్తు, అన్నిటియందు అంతటాలీనమైయుండుట) బొంది అజుడగుచున్నాడు. ఇందులో ఈశ్వరుడు తానుకదలక, సర్వమును చలింపజేయుచు స్పర్శలనుభవించి బ్రహ్మాండమునందు, నిర్విషయముగా నుండును,

మరియు రుద్రుని నిర్విషయ రూపాదులు, భూతభవిష్యత్తు వర్తమాన కాలములను తెలియజేయు చున్నాడు, బ్రహ్మాండమునందు చేతనము కల్గించి పునర్జన్మముల సృష్టించి, ఉరుములు మెరుపులు గల్గించి, పిడుగులను కురిపించి దృష్ట పదార్థముల నశింపజేసి, సస్యములను ఉత్పత్తి జేసి, జీవోపాధులకు రక్షణనొసంగుటకు కర్తయై, తనయొక్క భావన అఖిలమునందు, మరియు వాటి అంతర్ బాహ్యములయందు, విషయములను గుర్తించుచు, సకలజీవుల ప్రాప్తము యొక్క కర్మానుభవము తెలసి, ఆచరింప జేయుటకు కర్మ అనుభవింపజేసి, వాటికి రక్షణ నొసంగుటకు, పలుకులను ఉత్పత్తి జేయుచు అజుడగుచున్నాడు. మరియు బ్రహ్మాండమునందు అక్షరునిగానుండి నిర్విషయరూపాదులగుచున్నాడు.

2/4 ఈశ్వరుడు నిర్విషయ సమానాధులు సాత్వికము అనామృత చైతన్యం విష్ణువు నిర్విషయ రసాదులు రజోగుణము అమృతత్వంతో జేరి, సత్యజ్ఞానమనంత లక్షణ పరత్వము (సత్యమైన తెలివి అంతట అంతులేనిదియై సలక్షణముగా పరమై మిగిలియుండుట)బొంది, విశిష్టుడగుచున్నాడు, అనగా ఈశ్వరుని నిర్విషయ సమానాదులు అనామృత చైతన్యము, తాను కదలక సర్వమును చలింపజేయుచు, స్పర్శల భరించి బ్రహ్మమునందు కారణరూప జీవులు, తనయందు ఉన్న ఉత్తమోత్తమ పదవులయందు. సత్యజ్ఞానమైన అంతటికి పరమైయుండు దానియందు విశ్రాంతినిచ్చును, అక్షర పురుషునిగాను, మరియు విష్ణువు యొక్క రసాదులు, జిహ్వారసమురుచి అంగరసము ప్రాణముగా ప్రాణరసము ఆత్మయని, క్షరపురుషుని చర్విత చర్వణముగా కర్మలుసల్పుటకు విశిష్టతనిచ్చును కావున బ్రహ్మాండమునందు అక్షరపురుషుడు సత్యజ్ఞానమనంత లక్షణ పరత్వము శక్తిగాను పిండాండమునందు కామ సంకల్పములు, లోక కల్యాణకరముగా నుండునటుల, శిష్టాచారముగ సూరి జనులను, దుష్టులుశిష్టులను బాధించు సమయమునందు వారిని శిక్షించుటకు వుపయోగపడు విధముగా, తాను ఏది కోరదగినది లేకుండ, మానవ సౌభ్రాతృత్వము, అన్యోన్య సహకారము, ఐహికాముష్మికా పురోభివృద్ధికి, అనుకూలముగా నుండు విధముగా, తనకు స్వార్ధము యేదియు నుండక విశిష్టుడగుచున్నాడు కావున నిర్విషయ రసాదులుగా నుండును.

2/5 ఈశ్వరుడు నిర్విషయ సమానాదులు సాత్వికము అనామృత చైతన్య బ్రహ్మనిర్విషయ గంధాదులు తమోగుణము ద్వయత్వముతో జేరి, అంతః

ర్ బాహ్యస్ఫూర్తి రహితత్వము (లోపల వెలుపలయును తెలివిలేనిస్థితి) బొంది, విశ్వకర్త యగుచున్నాడు. ఈశ్వరుడు అనావృత చైతన్యము అక్షర పురుషుని గాను, మరియు బ్రహ్మ నిర్విషయ గంధాదులు ద్వయ త్వముచే, అంతర్ మలినాదులు బాహ్యమునకు తీసుకొని వచ్చుట, అనగా క్షేత్రముల నుండి ఓషధులను బాహ్యమునకు తీసుకొని వచ్చును. అనగా బ్రహ్మాండమునందు, కారణరూప జీవచయంబులు అంతర్ బాహ్యమున, స్ఫూర్తి రహితంబైన వాటికిజన్మంబులు పొందుటకు, ఋణానుబంధముగా జన్మములుపొందుటకు, తీసుకొని వారివారి కర్మానుసారముగా, కర్మలను అనుభవించుటకు సరిపోవు జన్మముల నిచ్చుచున్నాడు. పిండాండమున బీజముల మధ్యనుండి మొలకలను పైకిలాగి, మరియు గర్భస్థ శిశువులను బాహ్యమునకు ప్రసరింపజేసి, బ్రహ్మమునందు లోపలబయట తెలివి రహితమునొంది, అక్షరపురుషునిగా పిండాండమునందు, క్రోధ లోభ సంకల్పములు పరులకు కలుగునటుల శిష్టుల రక్షించుటకు క్రోధము లోభ ములను బొంది, తనయందుతాను స్వార్థములేకుండా, విశ్వకర్త యగుచు నిర్విషయముగా నుండును, ఈ విధముగా వ్యర్థతన్మాత్రచే కలిగిన, సమాన, వ్యాన, ఉదాన. ప్రాణ. అపానములకు నిచ్చు చేతనశక్తి, చల నాంశములో ఈశ్వరునిచే, జయుడు, విశ్వయోని, అజుడు, విశిష్టుడు, విశ్వకర్తలను అధిదేవత్వమునకు ఈశ్వరుని (చేతన చలనాంశములకు) తేజోరూప చేతనమును కలిగించుచున్నాడు.

3/1 రుద్రుడు నిర్విషయ రూపాదులు మలిన సాత్వికము జ్యోతిర్మయత్వం (తనంతటతానే వెలుగుచు వెలుగులోనేవెలుగై పోవుట)బొంది,జగద్రక్షకుడు, యగుచున్నాడుఏలాయనగా బ్రహ్మాండపిండాండములుగా పరిణమించుటకు, మహత్తులో మహదహంకారరూపమున జగచ్చక్షువుఅగుచున్నాడుదీనియందు ఇతర దేవతాంశములు లేవు కేవలము రుద్రునియొక్క జ్యోతిర్మయత్వం బ్రహ్మాండమంతట వ్యాప్తిబొంది, అక్షర పురుషుని గాను, పిండాండము నందున సకల జీవోపాధుల రూపముల రూపింపజేసి, కష్టమునుండి సుఖ ము బంధములనుండి మోక్షములనిచ్చును, సకల కర్మలను చేయుచు ఆవకాశమిచ్చి, ఆ కర్మలకు తానే సాక్షియై జీవోపాధులకు గతినిగలిగించు చు, మలిన సత్వగుణముగుచు, పిండాండమునందు సకల విధముల వ్యవ హారములు సల్పిన, నారు కర్మ పద్ధతులను కల్పించుచు, జన్మాదులని చ్చుచు, జగచ్చక్షువు అనబడును, దీనియందు 6 సాంచలుగా కలవు

(30 × 20 × 11 × 10 × 9 × 4) 84- మొత్తము ఎనుబది నాలుగు లక్షలు 6 సొంచాలనుండి కర్మ విభాగములు గలవు దీనియందు యెవరి కర్మానుభవమునకు అగు రూప కల్పనలు చేసి ఆయా జీవోపాధులయందు జనింపజేయుచు, వాటి కర్మలకు తగు రూపాదులు తననుంచి యివ్వబడినవి. కావున బ్రహ్మాండమునందు అక్షర పురుషునిగా పిండాండమను నడుపుటకు జగచ్చక్షువై సాక్షిగానుండి, తనయందు నిర్విషయ సమానాదులుగానుండును.

3/2 రుద్రుడు నిర్విషయ రూపాదులు మలిన సాత్వికము జ్యోతిర్మయత్వం సదాశివుడు నిర్విషయాంతఃకరణ శుద్ధసాత్వికము మహకాశముతో జేరి, స్వయం జ్యోతిర్మయత్వం (ఇతరుల సహయుం లేక తనకై తాను ప్రకాశిస్తు అనగా వెలుగుట తెలియుబడుట) పొంది దిక్కులగుచున్నవి! యిందు మహకాశము యొక్క అచలత్వము, శుద్ధ సాత్వికముగాను, మరియు రుద్రుడు నిర్విషయ రూపాదులతో కూడిన, బ్రహ్మాండమునందు స్వయం జ్యోతిత్వం అక్షర పురుషునిగాను, పిండాండము నడుపుటకు సకలకర్మలు వ్యవహరములు సల్పుటకు ఉండుటకు, అక్కడ, ఎక్కడ, ఏక్కడెక్కడ, యనుభేదములచేదిక్కులుగాను ప్రకాశిస్తున్నదని, అందుజీవోపాదులకర్మానుభవమును, అనుభవించుటకు ఉనికి మరియు స్థాననిర్ణయమును తెలియుచున్నది. అయిన అది ఎక్కడ ఏదిక్కున,ఏదేశమో ఏకాలమో, అనునవి తెలియజేయుచున్నవి। తనయందు నిర్విషయముగా నుండును.

3/3 రుద్రుని నిర్విషయ రూపాదులు మలిన సాత్వికము జ్యోతిర్మయత్వం, ఈశ్వరుని నిర్విషయ సమానాదులు అనామృత చైతన్యము జేరి, పరంజ్యోతిత్వం (గొప్పవెలుగుచున్నది. అన్నివెలుగులు పోయిన తనవెలుగు శేషించి ఉండునది పరమైనది)పొంది, వాయువగుచున్నది. దీనియందు నిర్విషయ రూపాదులువ్యాపకత్వముగా, కారణమగు జీవచ్ఛాయంబులకు సూర్య, చంద్ర, నక్షత్రముల, విద్యుత్ దీపముల ప్రకాశింపజేస్తు, జ్ఞానోదయంజేస్తు బ్రహ్మాండమునందు అక్షర పురుషునిగాను, పిండాండమునందు జీవోపాదులు ఉండుటకు, తనయందు పదునాలుగు భువనముల ప్రకాశింపజేస్తు, సుఖ దుఃఖముల ననుభవింపజేసి, తిరిగి జన్మలకు పంపుచు, రాత్రి పగలు యని బేదములేక, అన్నింటికి అవరణరూపమై కప్పి, స్థూల, సూక్ష్మ, కారణ, జీవోపాదులు అంతర్ బాహ్యమునందుండి ప్రారబ్ధ

కర్మలననుభవింపజేస్తు, వాయువగుచున్నది. మరియు బ్రహ్మాండము నందు అక్షరునిగాను, పిండాండమునందు వాయువుగానుండి, తనయందు తాను నిర్విషయుడుగానుండును

3/4 రుద్రుడు నిర్విషయ రూపాదులు మలిన సాత్వికము జ్యోతిర్మయత్వం విష్ణువు నిర్విషయ రసాదులు రజోగుణము అమృతత్వముతో జేరి, ఆపో జ్యోతిత్వం (నీటియందు వెలుగుచుండెడి జ్యోతి, విద్యుత్ నేత్రముల యందు వెలుగు సర్వమునందు వ్యాపించి వెలుగుచుండెడి జ్యోతి)బొంది, వర్ణుడగుచున్నాడు. బ్రహ్మాండమునందు అక్షరపురుషుడుగాను, పిండాండ మునందు యోగాదులచే పొందవచ్చుననే అపేక్ష నిర్ణయము, ముద్రలచే పొందవచ్చునని, ప్రయత్నించి పొందుటకు, ఆపోజ్యోతియే ప్రత్యగాత్మ యని, మతనిర్ణయము, యిది పిండాండము నిల్పుటకు వర్ణుడగుచు ఆపో జ్యోతి యెరుపువలె ప్రకాశించి, విద్యుత్‌గా పరిణమించి వరుణుడగుచు న్నాడు, యజ్ఞయాగాదులచే అహుతులు పొంది, అఫిలితమై వర్ణుడై వర్ష ములు గురిపించి, పంటలు పండించి, జీవోపాల పోషించుచున్నాడు. మరియు విషయాదుల జిహ్వావస్థలయందు జేర్చి, మోహమున బంధించి దాసునిగా జేయును. తన శరీరవృద్ధికి ఇతర జీవోపాదుల మాంసమును కోరుచు, సంపర్కమే ఆనందమని, పారమార్థిక చింతన కలుగనీయక, అజ్ఞానమునందుంచి వీటి నివారణకు ఆపోజ్యోతి దర్శన మాత్రముననే యని, మోహమును వీడి, మోక్షమార్గమునందున నిశ్చయము కలిగి యుండును. కావున బ్రహ్మాండమునందు అక్షరపురుషునిగాను, పిండాండ ము నడుపుటకు ఆపోజ్యోతి, రూపమున ఊరుములు మెరుపులు కలిగి వర్షించటమునుండి వర్ణుడగుచున్నాడు. తనయందుతాను నిర్విషయముగా నుండును.

3/5 రుద్రుడు నిర్విషయ రూపాదులు మలిన సాత్వికము జ్యోతిర్మయత్వం బ్రహ్మ నిర్విషయ గంధాదులు తమోగుణ ద్వయత్వంతో జేరి, జగజ్యోతి త్వం (జగత్తునకు వెలుగై జీవితమునునడుపునది)బొంది. అశ్వనీదేవతలు (నాసత్యుడు దస్యుడు) యగుచు జీవోపాదుల యందుండు నాతపిత్తశ్లే ష్మాదులను, మలినత్వ దోషములను గుర్తెరింగి, దానికి సరిపోవు ఔషధ ములను నిర్ణయించి రక్షణ బొందించును. బ్రహ్మాండమునందు అక్షరపురు షునిగాను, జగజ్జ్యోతిత్వం సకల జీవోపాధులకు ప్రకాశమొసంగుచు, కాల మును వస్తువులను తెలియజేయుచుండును, పిండాండమునందు, సకల

సకల జీవోపాధుల ఆయుస్సులను క్షీణింపజేయుచునన్నను, అపమృత్యు వునుండి తప్పుకొనుటకు త్రిదోషముల పారద్రోలుటకు, అమృతమును ప్రసాదించి, వైద్యబిషగ్గ్రహుండులును జయాపజయంబులకు కారణమై, ఓషధులను గుర్తింపజేసి, శరీరాదుల శుద్ధిజేయుచు, భూతభవిష్యద్ వర్త మాన కాలములలో జరిగినవి, జ్ఞప్తికిదెచ్చి వర్తమానకాలము నడుపుటకు క్షణక్షణము తెలియజేయుచు, అశ్వినీదేవతలుగను, బ్రహ్మాండమునందు అక్షరునిగాను, నిర్విషయముగా నుండును. ఈ విధముగా రూప తన్మా త్రలో కలిగిన శ్రోత్ర త్వక్, చక్షు, జిహ్వ, ఘ్రాణములను, జ్ఞానేంద్రియ ములకు శక్తుల సత్తా, బీజ స్థానములకు మరియు రుద్రాది దేవతలచే, దిక్కులు, వాయువు, జగచక్షువు, వర్ణుడు, అశ్వనీ దేవతలకు, చేతన చల నాంశములకు నిచ్చి, రుద్రునియొక్క తేజశాంశము.

4/1 విష్ణువు నిర్విషయ నిర్విషయ రసాదుల రజోగుణము వ్యాపకత్వం అమృతత్వం (మృతములేనిది నిలచియుండునది మార్పులేనిది) బొంది, విషయరూప విష్ణువు అక్షరుడగుచున్నాడు. దీనియందు యితర దేవతమి శ్రమములేవు. కేవలము విష్ణువుయొక్క నిర్విషయరసాదులే గలవు. రజో గుణము జీవత్వముయొక్క ప్రత్యేకమైన జిహ్మావస్థలయందు, మరియు సప్తధాతువులవృద్ధి చేయుచు పోషించుచు, యిచ్ఛారూప రసనేంద్రియ వాంచలు, స్త్రీపురుషవిషయమైన మైధునాధు యంగు వాంచలు కలిగించి స్వర్గగతులుపొందుటకు, పిండప్రధానములు ఆచరింపజేయుచు, ఆనదింప జేయుచు, మరియు ఇది తిరిగి జన్మాదులకే కారణము. బ్రహ్మాండము నందు ఈ రసరూపరుచిని మరిపించే రుచినేకోరుచుండు ముందుచెప్పిన జిహ్వారసం రుచియనియు అంగరసం ప్రాణమనము ప్రాణరసం ఆత్మ యనియు ఈ ఆత్మ రసమునకు రహితపర్చుచున్నది పరిపూర్ణబోధగనుక పరిపూర్ణస్థితి వలన జన్మలేకుండ పోవును యిహపరాదులయందు బుషు లకు రుచులకు రుచిని చేకూర్చు రుచియని, వాటి మరిపించే రుచులకుఅపె పిండాండమునందు, విష్ణువు నిర్విషయ రసాదులుగా, ఈ మోహములో తాను చిక్కక, ప్రపంచము మాయయని దాని మోహబంధనంలో చిక్కక ఈ బంధమునుండి ఏలా తప్పుకోవలయుననే తలంపుచే బ్రహ్మాండము నందు అక్షరునిగాని నిర్విషయముగా నుండును.

4/3 విష్ణువు నిర్విషయ రసాదులు రజోగుణ అమృతత్వం, సదాశివుడు నిర్విషయాంతఃకరణ శుద్ధసాత్వికము మహకాశముచే జేరి, పరామృతత్వం

(గొప్పయనగా అన్ని పోయినను శేషించియుండునది గొప్పదా, మార్పులేనిది మరణము లేనిది, కనుక గొప్పది) బొంది, విషయ రూప సదాశివుడగుచున్నాడు. ఇతడు జీవేశ్వరానందమనుభవించుట కొరకు, అన్ని జన్మాదులకు పరంపరంగా మూలమైన, మహాకాశరూప అంతఃకరణ మునందు పరివర్తన, కర్మేంద్రియముల ద్వారా వ్యాపారము, అనగా వచన, దానగమన, ఆనంద,విసర్జనముల విషయాదులందలి ఫలములను వసుధైక కుటుంబ రక్షణ పద్ధతిగా, ఉండును, పిండాండమునందు రజోగుణ వ్యాపకత్వముతో। విషయానందము సత్యముగానే అగుపడువాటిని ఆక ర్షించి, శబ్దములద్వారా విషయాదులయందు బోధించుటకు ఉపయోగపడు విధముగా, ఏదికోరదగినది లేకుండ, మానవ సౌభ్రాతృత్వమునకు అన్యో సహకారము, ఐహికాముష్మిక సంకల్పముతో, లోక కల్యాణమునకు, శిష్టాచారముగా, సూజనులను దుష్టులు బాధించు సమయమున, అట్టి దుష్టులను శిక్షించుటకు పురోభివృద్ధికి అనుకూలముగా నుండు విధముగా తన స్వార్థమనేది ఏదిలేకుండా, బ్రహ్మాండమునందు అక్షరపురుషుడుగా ను నిర్విషయముగా నుండును.

4/3 విష్ణువు నిర్విషయ రసాదులు రజోగుణము అమృతత్వం, ఈశ్వరుడు నిర్విషయి సమానాదులుసాత్వికము అనామృత చైతన్యముతో జేరి, పరమ సత్యం (అనగా త్రికాలములయందుండునది అన్ని నశించినను శేషించి యుండునది) బొంది, విషయరూప ఈశ్వరుడగుచున్నాడు. ఇత డు బ్రహ్మాండమును పరమ సత్యముగా ధరించి వాటి స్పర్శాదులకులోను గాక, తన పద్ధతియందు (వాయువు( ఉతోటలనుండి సువాసన, పెంట కుప్పలనుండి దుర్వాసనను మోసుకొని వచ్చిన, వాటి వాసనలకు లోను గాక. అనగా ఆనందము విరక్తి చెందని విధముగా తనయందు జీవులు కర్మానుసారఫలంబుల ననుభవింపజేయుచు, తాను ఏవికారములు బొంద క, నూతనముగా ఏదికోరదగినది లేకుండ, ఉన్నది ఉన్నట్లు కామ విష యముల ఆచరించుచు, అనుభవింపజేస్తు, పిండాండమునందు విషయ రూప స్పర్శలు, అనగా భార్య, పుత్రి, ధన, వస్తు, వాహనాది, చీని చీనాంబరముల వెలగలనగల స్పర్శలకు లోనుజేయును తాను నిర్విషయ ముగానుండును.

4/4 విష్ణువు నిర్విషయ రసాదులు రజోగుణము అమృతత్వ రుద్రుడు నిర్వి షయ రూపాదులు కలిన సాత్వికము జ్యోతిర్మయత్వంతో జేరి, తత్వా

మృతత్వం (తత్ అనగా అది అనగా ఈశ్వరుడు త్వంఅనగా నీవుజీవుడు అనగా జీవేశ్వర ఐక్యము సత్యమైనది మార్పుజెందనిది నిలచియుండునది అది నేను) బొంది,విషయరూప రుద్రుడగుచున్నాడు. తన సత్వగుణ ప్రకాశము దరిద్రునినుండి నవఖండ మండలాది సంపన్నులవరకు, సుఖ దుఃఖముల బంధమోక్షముల కోరక, తత్వామృతత్వంబుగను, పిండాండమునందు యజ్ఞయాగాదులచే సత్యలోకముల కామనాదుల కొరకు, మహావాక్య నిర్ణయపద్ధతులుగా వైరాగ్యముపొంది కైలాసవైకుంఠలోక భ్రమ జెందక యున్నను బ్రహ్మాండమునందు అక్షర పురుషునిగాను తనయందు తాను నిర్విషయముగా నుండును.

4/5 విష్ణువు నిర్విషయ రసాదులు రజోగుణము అమృతత్వం బ్రహ్మనిర్విషయ గంధాదులు తమోగుణద్వయత్వంతో జేరి బోధామృతత్వం (పెద్దలచే ఉపదేశింపబడిన వీటి సత్యము నీతర్కమునకు నిలచిన అంతఃకరణమునందు శాశ్వతము మరువక మార్పుజెందక యధాతధముగానుండుట) బొంది విషయరూప బ్రహ్మ అగుచున్నాడు, బోదవలన తెలిసిన విషయములు అచరణలో పెట్టుటకు జీవేశ్వర ఐక్యమనునది ఆనందింప జేయుటకు పిండాండమునందు ద్వయత్వం దేనికి సంబంధమున్నదో దానికదే ఆకర్షించి బంధించి జనన మరణముల బోధించుచు, పోషిస్తు నాకుయేమి సంబంధము లేదు యనుచు బ్రహ్మాండమున అక్షరపురుషుడగుచు పిండాండమున బ్రహ్మనిర్విషయుడై యున్నాడు ఈ విధముగా రపతన్మాత్రతో కలగిన శబ్దస్పర్శరూప రసగంద తన్మాత్రలకు ఇచ్ఛా శక్తియొక్క చేతన సత్తా వంబీజముయొక్క చేలన సత్తాకు విష్ణువుచే సదాశివుడు ఈశ్వరుడు, రుద్రుడు,విష్ణువు,బ్రహ్మలయొక్క తేజోచేతనాంశమున్ను ప్రకాశమున్ను

5/1 బ్రహ్మనిర్విషయ గంధాదులు, తమోగుణ వ్యాపకత్వంబొంది ద్వయత్వం రెండు (శ్రేష్టమైనవిగా) బొంది సర్వమును విశదపరచుచు, జీవించుటకు సకలపదార్ధములు భుజించు మృత్యువు యగుచున్నది దీనియందు ఇతరదేవతాంశములు లేవు కేవలము బ్రహ్మనిజాంశమైన నిర్విషయ గంధాదులు ద్వం ద్వత్వమే బేదము గలవు వాసన యనగా సంబందములు అనేనవవిధములు అనుభవింపజేయువారు అనుభవించువారు ద్వయత్వం ధనక నకవస్తువాహన పశుపత్ని సుతులుయనే బోగములయొక్క భ్రాంతి

పైన జెప్పిన నవవిధ సంబంధములగు బేధములు వ్యవహరించుచు మృత్యువుపాలేతుదురు మరియు బ్రహ్మాండమందు నిర్విషయుడగుచున్నాడు పిండాండమునందు కర్మబద్ధుండై కర్మనాచరించును,అనగా కామక్రోధాదులకు దాసుడై, వాదినేను యనునకంమును కూర్చుకొని విడువలేని తన షును అనుభవించలేక 84లక్షల జీవయోనులయందు జన్మించుచు అజ్ఞాన తామసాదులను కప్పుకొని భవిష్యత్తును తెలియక కఠినముగా అనగా (విడువలేని తనము) అనుభవించక ఇతరులకు నివ్వక దానియందే మృత్యువును బొంది అధనము తనసంతానమునకు లేక తనకు అనుకూలురైన వారికే చెందవలయునని కోరికతోయుండును. కావున ఈ విషయముల నంటక మోహమును విడచి తనపద్ధతియందు నిర్విషయముగా నుండి బ్రహ్మాండమునందు అక్షరుడగు చున్నాడు

5/2 బ్రహ్మ నిర్విషయ గంధాదులు తమోగుణము ద్వంద్వత్వం సదాశివుడు నిర్విషయాతః కరణ శుద్ధసాత్వికము మహాకాశముతో జేరి భేదా భేదత త్వం (వేరై పేరుగాక ఈరెంటికి అతీతమైనది) బొంది అగ్నియగుచున్నది. దీనియందు సర్వమును నిర్ణయము జేయుచు అంతర్ బాహ్యముల యందు ఏకత్వమొనరించి యజ్ఞయాగాదులయందు దేవతలకిచ్చు ఆహుతులను, ఆవిరిభాగములను యాయాదేవతలకు అందించి తృప్తిగలిగించుచున్నది. బ్రహ్మాండమునందు, స్వార్థ నిస్వార్థముల నిరూపించు చున్నది. కావున భేదా భేదత్వం త్రివిధములు ప్రస్థాన త్రయములు అనగా పితృయానము (దక్షిణాయనము) దేవయానము (ఉత్తరాయణము) హీన యానము (నరకమునకు)గా కల్పించి కర్మను సారముగా తన నుండి పంపించుటకు సిద్ధముగా నుంచును. పిండాండ వ్యవహరమునకు సకల జీవోపాదులకు మరణము తప్పించుటకు యిచ్చుటకు తానుకర్తయైయుండి మరణించిన వారికి స్వర్గనరకములకు బోవువారికి దారులు నిర్మించుటకు పిండప్రదానములు చేయుచు, ఆలోచకవాసులకు అందగలదనే భ్రమచే, దానధర్మములు జేయుచు తనకొరకు సద్గురువుల నాశ్రయించి అట్టిలోక భ్రమలను విడచి కైవల్య శరీరమునందు నివసించుటకు గురువాజ్ఞ ప్రవర్తనకల్గి బ్రహ్మాండమున అక్షరుడై నిర్విషయములుగా నుండును

5/3 బ్రహ్మనిర్విషయ గంధాదులు తమోగుణము ద్వంద్వత్వం ఈశ్వరుడు

నిర్విషయసమానాదులు సాత్వికము అనామృత చైతన్యముతో జేరి అభేదత్వం (తాను వేరనక వేరుకానను నిర్ణయముచే దృఢముగా నుండుట) ఇంద్రుడగుచున్నాడు బ్రహ్మాండమునందు పర్జన్యాదులు ఋతువులనను సరించి మేఘముల సృష్టించి ఉరుములు మెరుపులతో కూడుకొని వర్షములను కురిపించుచు నదీనదంబుల నిండించి ఓషధులనుండి అన్నాదులు కల్గించి జీవోపాదుల రక్షించుచుండును. పిండాండమునందు స్వర్గలోక సుఖములుగోరి యజ్ఞయాగాది తపములు యోగములు ఆచరించుచు భ్రమించివీటిని భ్రమయని తెలుసుకొని నూతనముగా ఏదియు కోరదగినదిలేకుండ, ఉన్నది ఉన్నట్లు ఆచరించుచు యజ్ఞఫలములు గోరక తాను సద్గురువు సన్నిధిలో అనుష్టాన పద్ధతిగా నుండి లోకభ్రమలను విడచి అనగా భేదా భేదత్వములను విడచి నిస్వార్థత్వముగా కర్మలనాచరించి భోగములను గోరక అవి భ్రాంతి పద్ధతియని దెలిసి నిష్కామ కర్మల నాచరించుచు బ్రహ్మాండము నందు నిర్విషయముగా నుండును?

5/4 బ్రహ్మ నిర్విషయ గంధాదులు తమోగుణము ద్వంద్వత్వం రుద్రుడు నిర్విషయ రూపాదులు మలిన సాత్వికము జోతీర్మయత్వంతో జేరి భేదాభేధత్వం (బేదములు కలిగి బేదత్వములు లేక యుండుట) బొంది ఉపేంద్రుడగు చున్నాడు ఇతడు పిపీలికాదిబ్రహ్మ పర్యంతం ప్రకాశింపజేస్తు పిండాండము నందు సకల జీవోపాధులు కర్మలాచరించుటకు వారి వారి ప్రారబ్ధరూప కర్మలననుభవింపజేయుచు ఆనందసాగరను బొంది ఇతరు కష్టములను తనవిగా భావించి, తగుసహాయములొసరించి, కాపాడి వారి దుఃఖము లనివారింపజేయుటయే! ధర్మమని, తనకుగలదానిలోనే ఇతరులకు నిచ్చి, తాను తృప్తిజెందుచు బ్రహ్మాండమునందు, కారణరూపజీవచయంబులకు, వారివారి కర్మలకు తగురూపాదులుకల్పించి. అనుభవింప జేయుచు, తన పద్ధతియందు నిర్విషయముగా నుండును, పిండాండము నందుబుద్ధిఃకర్మానుసారిణీ యనుశృతిగా, ప్రారబ్ధకర్మలను సంతోషముగా అనుభవిస్తు, తనయందు తాను నిర్విషయముగా నుండును

5/5 బ్రహ్మనిర్విషయ గంధాదులు తమోగుణం ద్వంద్వత్వం, విష్ణువు నిర్విషయ రసాదులు రజోగుణం అమృతత్వంతో జేరి, ఖండత్వం (ఎడతెగక ఏకమగుట) బొంది, ప్రజాపతియగుచున్నాడు, ప్రకృతియనగా నాలుగు యాకాశములు, పంచభూతములు యనగా, ప్రకృతిలోనే దీనిసూక్ష్మరూప మగు, అదిత్యవర్ణ యగు పరమాత్మ ఇదియే ప్రకృతిపురుషులు, ఈ ప్ర

కృతి పురుషులు వేరుగాకుండ, అనగా భేదములులేకుండ, అనగా, అగ్ని నివిడచి అగ్నిశక్తి (కాల్చుపద్ధతి) యెట్లు వేరుకాదో, అట్లేపురుషునికన్నా పురుషశక్తియగు ప్రకృతి వేరుగాదు ఈ పురుషప్రకృతులయందు సృష్టి స్థితి, లయములు, పొందుచున్ననూ. వీటియందు నిర్విషయముగానుండి ప్రకృతి అశాశ్వితమని, వీటి సంయోగము ఎడతెగకుండా యుండునని యిందు పురుషుని విడిచి ప్రకృతిగాని, ప్రకృతిని విడిచి పురుషుడుగానీ, వేరుండబోరని నిర్ణయిము. ఇందు ప్రకృతిని విడిచి పురుషుడు బ్రహ్మైక్యము పొందుట అసత్యమని, అక్షరునిగానుండి పిండాండమునందు ప్రజావశియై, జిహ్వోవస్థల విషయములయందు వాంచలుకలగి, శరీరబలముకై మధుమాంసముల భుజింపజేసి. మైధున క్రియలు సలిపి దానిచే సుఖానుభవము కలుగునని, అహోరాత్రిలు వినోదములయందు కోరిక ఎడతెగక, అఖండముగానుండి సంతానములజడసి, రోసి, యీస్త్రీపురుషసాంగత్యమే నరకమని, సన్యాసము పొంది, అధిష్టాన చేతన బ్రహ్మమునందు అనగాఆదిపురుషుడని।తాను ప్రకృతిరూపస్త్రీనని, ఉపరతిగోరుచు, ఆనందమునందున్నానని తలంచును, ఇదికూడ అశాశ్వితమని దేనిని పొందక కర్మానుసారముగా ప్రారబ్ధ కర్మలననుభవించుచు, తనయందుతాను నిర్విషయముగా నుండును. ఈ విధముగా గంధ తన్మాత్రిచే కలిగిన వాక్కు, పాణి, పాద, గుహ్య, గుదములనే కర్మేంద్రియములకు నిచ్చు శక్తికి, ప్రాణసత్తాకు బ్రహ్మయొక్క చేతనాంశమున, అగ్ని, యింద్రిడు ఉపేంద్రిడు, ప్రజాపతి, మృతువులకు,నిచ్చు చలనచేతనాంశమున్నా అపంచీకృత పంచభూత పంచతన్మాత్రిలచే కలిగిన (25) యింద్రియములకు పంచశక్తులసత్తా దానికి పంచ ప్రాణముల చలనాంశము వాటికి పంచాదిదేవతలయొక్క చేతనముచే కైవల్య దేహమాయను.

## * కైవల్యదేహము *

ఆకాశము వాయువు అగ్ని జలముపృద్వి కూటస్థుడు కైవల్యదేహనిర్ణయము నిర్గుణము అచల పరిపూర్ణ అద్వితీయమునందు కాననగున ఇది అమళవనీయము శక్తి ద్వయపద్ధతి యేలాయనగా అంటరానిది శక్తిద్వయరహితము నుండి యనగా కైవల్య శరీర నిర్ణయము కైవల్య శరీరమందు బ్రహ్మండ పిండాండములను నడుపుచు, తనయందు నిర్విషయముగా నుండి, అచల పరిపూర్ణ పరబయలుయందు, లేశమాత్రముగా లేక మృషయగుచున్నది.

# శ్రీ బృహద్వాశిష్టము అను శివరామదీక్షితీయము పూర్వభాగములో అహంకార నిరసన

పకరణములో చివరిభాగము పేజినం. 42

నామతము రూఢిగా నమ్మవలె, అందుకు ఒకటి గలదు, నేను సన్యసించితిని, ఏలాగననగా నా మనసునే విడచితిని, నన్ను నేనునమ్మను, నేను ఒకరిని నమ్మను. అనేకులు నన్ను నమ్ముమందురు: నన్ను అనగా ఏటువంటిదనగా నీవేనందురు. నీకు శరీరంలేదందురు నాశరీరం నేను ఓకటిగాని, రెండుగా నాకు తెలియదు. నాముచ్చట నాకు తెలియదు, నా పుట్టుక నాకు తెలియదు నా సంగతి నాకు తెలియదు, నేను శరీరమేకానీ: శరీరం కన్నను వేరులేదు. అందరూ ఈ లాగుననే అందురు. అందరి మాటలునమ్మినాను. ఎవరిమాటలు విన్నను, నేను శరీరమును గాదందురు, నాశరీరమును విడచి, నన్నునేననే కకాలములు వెదకినాను. నాకేమియు తెలియలేదు. ఒకమహాత్ముని కలుసు కొన్నాను. ఆయనకు పదిరెండు సంవత్సరములు శుశ్రూష చేసినాను. ఆయన అనుగ్రహమును సంపాదించినాను ఆయన ఉన్నది తెల్పినాడు, ఆయన చెప్పినదే సూటియైనది అ సూటినే దప్పినా అది తప్పక యున్నది, అది మార్గముగానేయున్నది. అది బౌద్ధముగాదు, జీవాకారమైయుండె, తానులేక పోవుట, తాను శరీరము ఒక్కటేయని చెప్పినాడు, అందుకు కొన్నిమాటలు అడిగినాను, ఆమాటలుగురిగానే యున్నవి? ఆసరిగా ఉన్నమాటలు అనుభవ ముగానే యున్నవి, ఆయితే బౌద్ధమతముగాదు పాషాండ మతముగాదు, అది మంచి మతమే, ఆ మతము అందరికి సమ్మతమే! అసమ్మతము పెద్దలు హర్షించే యున్నారు, అందుకేమికొదువలేదు, దేహమునకు యెరుకకు బేదము లేదు, యెరుక యెన్నడులేదో నాడే దేహములేదు, దేహములేనినాడే యెరుక లేదు, యెరుకలేని శరీరము మాత్రము యేలాగునగలదు, ఎరుకలేక శరీరం కలవారు యెవ్వరులేరు, నేను అనేకమందిని చూచినాను, యోగులకు ఎరుక గలదు, శరీరము గలదు, ఋషులకు ఎరుక గలదు, అవతారములకు ఎరుక గలదు, శరీరము గలదు. ఎరుకలేకపోతే శరీరము లేదు, ఎరుకను విడచి శరీరము ఉంటే, అది వట్టిశరీరము మాట్లాడువా?

అన్ని శరీరములు మాట్లాడుచున్నవికదా? అందరికి అన్నిరూపులుగా అహంకా రమే యెరుకై, యెరుకయే శరీరమై, శరీరమే మరణదేహమై, మరణదేహమే మన్నై, మన్నే నీరై, నీరే అగ్నియై అగ్నియే వాయువై, వాయునే

అకాశమై ఆకాశమే అహంకారాత్మకమై, అహంకారతత్వమే మహదాంకారమై, మహదాంకారమే ప్రకృతియై, ప్రకృతియేఅచలమై, అచలమేశూన్యమై, శూన్యమేమహాశూన్యమైమహాశూన్యమే అగోచరమై నశించుచున్నది, అయితే మరణమయ్యే వారందరూ, యీలాగుననే జన్మ రహితులగుచున్నారా! యని శంఖరాగా, అందరి కాలాగున జన్మరహితము కాదు అజ్ఞాన అందరు ముక్తులగుచున్నారు అని శంకరాగలదు, అలాగున ఒప్పుకొనిన గురుశిష్య న్యాయము లేకపోవు చున్నది, పాపపుణ్యములు లేకపోవుచున్నవి, ఈవిపరీతార్థములు అన్నియు కలుగుచున్నవి, ఇది ముక్తులయినవారు ఒప్పుకుందురు, ఏలాగనగా రజ్జు భ్రాంతికలిగినంతసేపు సర్ప భ్రాంతితోచదుకదా అలాగుననే ముక్తులకు అముక్తులు, అముక్తులకు ముక్తులు గనుపడరు, కనుక ముక్తులందరూ? ముక్తులే అముక్తులందరూఅముక్తులే, ఇదే సిద్ధాంతముగాను సాధారణముగా నిరపేక్ష పణముగా అందరికి తెచ్చదు, అందులో నామాట యెంతమాత్రము నమ్మరాదు నాజోలి పట్టదు, నాముచ్చటగారాదు నన్ను నమ్మరాదు, నన్ను నమ్మరు, నా పలుకులు నమ్మరు, నా చదువు వినరు, నావృంతాంతముగారాదు నాగుణ మెన్నరాదు, నాసలహ కూడదు, నా సౌంజ్ఞనాకే తెలుసున, నాకు నామాటలే విచిత్రములు నాకు నాకథలే విచిత్రములు నాకునేనుగాను, నేను వకరికిగాను నాయందు కనికరముంచుతుందురు, నేనందునుగదా నాయందు మీ అనుగ్రహముంచు మంద్రును, ఆ నానాలు నానాలుగానే పోవును, నానాలు నానాలు అనానాలు, అనేక నానాలు ఆ అనేక నానాలు అనేక నానాలే అనానాలకు నానాలే అనర్థకములు, ఇది నిజము మొదటి నావకటి గలిగెను, నాకు నావ నటి గలిగెను ఆ రెండు నానాలకు మూడు నానాలు గలిగెను, మూడునానాలకు మూడు అయిదులు పదిహేను నానాలు గలిగెను, ఇదిగాక ఈ పదిహేను నానాలకు ఇరువదియైదు నానాలు గలిగెను కొన్నిటికి పదిహేడు నానాలు కొన్నిటికి ఒక ఒకటి గల్గిగి, అనేకమై ఈతోటి నానాలను పెండ్లి చేసుకొని అన్నిటికి అన్ని నానాలై అనానాలనేక ప్రపంచకములై। ఆ నానాలకు అనేక నానాకులములై, నానాకులములన్నియు నానాలనే పరిమళ్ళలో। నానాలనేత, నానా ప్రయాసగా దున్నిన నానామళ్ళలో నానానారు। నానాల చేతపాతినట్లుగా, చెడక నానాకారులై, నానాగింజలై, నానా జనులై నానా అన్నములై నానాలుగా ఉన్నవీ? నా ప్రకృతికి నా అహంకారము గలిగి నా మహ ద్రూపంబాయెను, నాఅహంబునకు నాత్రిగుణంబులు గలిగెను నాసత్వంబునా ఇంద్రియాధిపతులు గలిగిరి, నారాజనంబున సూక్ష్మదేహబాయెను, నా

తామసమువ పంచభూతములై నా దేహంబాయెను, నా కులమే వ్యాకులము వ్యాకులమే నా కులము, నా కులము విడువ వలెను. నా కులము మాదిగ కులము, మాలకులము, తురక కులము, ఈలోకమందు నాలుగు కులములు ఏలాగున ఏర్పడెనో, నాలాగుననే, ఈ పరమార్థమందు నాలుగు కులములు గలవు. అవి వివరించుచున్నారము విశదముగా వినవలెను. అచలకులము బ్రాహ్మణ కులము, ముఖ్యమైన కులము, చలకులము శూద్రకులము శూద్రకులముకన్న శ్రేష్టకులముకన్న శ్రేష్టమైన క్షత్రియకులము భూతకులము అనగా వైశ్యకులము, నా కులము శూద్రకులము చాండలపుకులము, అచలకులస్తులు నా కులస్తులను తాకితే స్నానము చేయువలయును, నా కులస్తులు అచలకులస్తులు అగుమరుగాని, అచలకులస్తులు నాకులస్తులు యెంతమాత్రము కారాదు ఈ వృత్త బట్టబయులందు యేమియు పుట్టలేదు, పుట్టినదనుటకు ఏలాగుననోరాదును, బట్టబయులు అంతటా ఉత్తది. ఆ బట్టబయులులో, మనుష్యులు, పందులు, కుక్కలు, నక్కలు. ఏమిన్ని పుట్టలేదు. యిందుకు దృష్టములేదు, ఎందుకనగా ఈ భూమకంటె ముందు పరిపూర్ణము తప్ప యేమిలేదు, పరిపూర్ణము బయలుగాదని ఎవ్వరనగూడదు ఈ పరము సృష్టికి, పూర్వమున్ను కలదు ఇందుకు ఏమి సందేహము లేదు, ఈ పరమునకు నామరూపములులేవు, యెరుకలేదు, మరుపులేదు, ఈ యెరుక మరుపులులేని దానిని అందరూ యెరిగియున్నాను నమ్మరు. ఇంతకంటే యెక్కువలేదు, ఈ బయులే దేవుడని నమ్మవలెను గ్రంథములో యున్న దేవతవంటిదికాదు, ఈదేవతకు నోరు, చెవులు ముక్కు, కన్నులు లేవు, ఈ పరిపూర్ణమునకు ప్రకృతిలేదు, మహత్తులేదు, అహంకారములేదు, ఆకాశములేదు, వాయువులేదు, అగ్నిలేదు, జలములేదు, భూమిలేదు, శబ్దములేదు,స్పర్శలేదు, రూపములేదు, గంధములేదు, జ్ఞాతలేదు మనస్సులేదు, బుద్ధిలేదు, చిత్తములేదు, అహంకారములేదు, ప్రాణములేదు, అపానములేదు, వ్యానములేదు, ఉదానములేదు, సమానములేదు శ్రోత్రము లేదు, త్వక్కులేదు, చక్షువులేదు జిహ్వలేదు, ఘ్రాణములేదు, వాక్కులేదు, పాణిలేదు, పాదములేదు, గుదములేదు, గుహ్యములేదు. ఈ బయులు పుట్టదు పుట్టించదు. రక్షించదు చంపదు, దీనిని, యెవ్వరూ యెరుగరూ. యెరుగకున్నను యెరుగరూ, చెప్పిన యెరుగరు, చెప్పకున్నను యెరుగరూ, యెవ్వరికి ఈ జోలి పట్టదు, ఇదియెవ్వరు విన్ననూ యేమోనందురు,గానీ నిజమని అనరూ? ఏమిఉన్నది అతి రహస్యము, బట్టబయులు అందరుగాని, ఆ బట్టబయులెటువంటిదో! యెరుగరు. ఆ పరమునకు నామరూపక్రియలులేవు. ఇది

సకల లోకములయందు యున్నది. యెన్నటికిని యున్నది. అందరిలోను ఉన్నది. కొండలలోను ఉన్నది. గుహలలోను ఉన్నది. గుట్టలలోను ఉన్నది చెట్లలోను ఉన్నది. అదియేదిలేదు. యెందరు యెన్ని విధముల విచారించిన. యేమిలేదు. యెవరి విషయములోను యేమిలేదు. యోగులయిన అంతకన్నను ఏమి సాధించలేరు. ఏంతటి వారికైన యిదేకానీ, యేది సాధనలోకి రాదు. నిజము.

ఇతి శ్రీ మగ్గురు శివరామ దీక్షిత నత్రిభావే వేదాంత విచారణే పూర్వభాగే అహంకార నిరసన ప్రకరణే సమాప్తం.

### పేజినం॥ 79 సన్నద్ధుష్టాంతము పూర్వభాగము

అహంకారము వదలెనేనీ అధికుడగును, అన్నిటికి అహంకారమే బలము. అహంకారము సామర్థ్యము గలది. ఆయహంకారము అనేక దినములనుండి, అనేకత్రాళ్ళచే కట్టబడి యున్నది ఆయహంకారము వదలునో అప్పుడే బంధముక్తుడగును, అహంకారము వంటి పాపిష్టిది అహంకారమేగాని, మరియొకటిగాదు ఈ ఉత్తబయలును యెవరును గుర్తెరుగరూ? ఈ పరిపూర్ణము యెన్నడూ సాకారముగాదు ఈ పరిపూర్ణము యెన్నడు మనుష్యాకారముగాదు ఈ పరము యెన్నడును అవతారములుగాదు, ఈ పరబయలు యెన్నటికి ఎరుకలేదు ఈ అచలమునకు యెన్నటికి మలినము లేదు, ఈ పరిపూర్ణము మనలను కప్పుకొని యున్నది. ఈపరమనే ముసుకులో మనము ఉన్నాము ఈ బట్టబయలుయనేది యెన్నటికి పోనేరదు, ఈ పరిపూర్ణమునకు కోపము తాపములులేవు ఈ ఘనమునకు యేమిలేదని చెప్పుచునేఉన్నారు. ఈ అచలము యెన్నడు నశించదు, నిత్యము పరాపరము మహాగాఢమైనది. నత్యము ఈ పరిపూర్ణము మహానిర్మలము నిలకడగలదు. దేహమునకు మూలము విచారించితే లేనేలేదు, గట్టిగాలేదు దేహమునకు కలతాయనినలేదు. దేహమునకు నిత్యత్వము యెన్నటికిని కలుగనేకలుగదు దేహమునకు నిలుకడలేదు. నిలుకడ గలిగితే దేహము నిత్యము దేహమునకు నాశనముగలిగిన పిమ్మట తిరిగి కలుగదు దేహమునకు నాశనము కనుపడుచునే ఉన్నది. కానీ దేహమునకు నిత్యత్వము చెప్పవలెనంటే, నమ్మకము చాలదు, దేహమునకు నియమము లేదు, నిలుపులేదు, అండలేదు, దేహమునకు జీవుడులేడు, పరమాత్మలేడు, బ్రహ్మలేడు, దేహమునకు తలనాత్రితలేదు, తలతిక్కలేదు, దేహమునకు తలతోక రెండులేవు, దీనిని యెరుగలేరు. దేహమునకు జడత్వముకాని, నిర్మలత్వము

దొరుకదు, దేహమునకు ప్రాణాయామము వలన ఆయుష్యము లేదు, దేహ దేహమునకు వికారములేకల్గు చున్నవిగానీ మరేమిలేదు, దేహమునకు ఇంద్రియములకు భేదములేదు. కలదోచిన శరీరమేమిలేదు, ఈ ఉత్త బట్టబయలు యేమిలేదు, ఒకటిలేదు, ఈ ఉత్తబట్టబయలు యేమిలేదందురు, కదా యీ ఉత్త బట్టబయలనగా యేమంటే చెప్పెదను ఈ పరిపూర్ణము అనగా, పుట్టనిది చావనిది, సర్వదేశముల యందున్నది. సర్వకాలములయందు, మొదలు, చివర, లేక చలించక యుండునది.

గీ॥ అతి రహస్యము బట్టబయలనగ వినియూ- తెలియజాలరదే మొకోదేశికేంద్ర - మాయబలమేకదా యింతమరుగు పరచే - సవ్యతరభోగి శ్రీ సదానందయోగి?

## శ్రీ బృహద్వాశిష్టము శివరామదీక్షితీయము

### ఉత్తరభాగం అమృతసారప్రకరణ ప్రారంభం

ఈ బట్టబయలు తనకుతానే స్వతసిద్ధమై చెలించకయున్నది, ప్రపంచం పుట్టనేలేదు, ఇది నిజగురూపదేశం। ఈ ఉత్త బట్టబయలే పరిపూర్ణం. ఈ ఉత్తబట్టబయలు నిజగురువు చెప్పకకానరాదు. ఆచార్యవాన్ స్వరూపోవేద॥ అని ఉన్నదిగనుక శృతికిఖం బ్రహ్మఅని। సిద్ధాంతవాక్యం ఉండనేఉన్నది, ఉన్నా భ్రాంతివాక్యం. మొదటిదికాదు మొదటయేది ఉన్నచో అదేచెప్పినాడు. నిజ గురువు పుట్టని చావని గురువు కావలె. శరీరం అయిఉన్న గురువు పనికిరాడు అహంకారం అయిఉన్న గురువు పనికిరాడు, పుట్టనిది చావనిదియేదో అదే సత్యము చెప్పేగురువు కావలె, జ్ఞానమార్గము నిషేదమే? కర్మమార్గము నిషేదమే కనుక పుట్టని చావనిది, ఈ ఉత్త బట్టబయలు గనుక, యిది మొదలు చెప్పవలె, పుట్టని ప్రపంచం యొక్క జోలేకూడదు, ఈ ఉత్త బట్టబయలు వలన మాయ పుట్టనేలేదు గనుక ఈ ఉత్తబట్టబయలు మాత్రమే ఉన్నది! ఈ ఉత్త బట్టబయలు అత్యంత విలక్షణము ఈ ఉత్త బట్టబయలు వలన పర మనే చైతన్య స్వరూపిణి అనేమాయ పుట్టనేలేదు, గనుక యేమిలేదు, ఉత్త బట్టబయలుకు పరాయేమిలేదు లేకుంటే శరీరం అనే క్షరము యేమిలేదు, ఈ ఉత్తబట్టబయలే ఉన్నది, ఈ ఉత్త బట్టబయలు పుట్టదు, పుట్టించదు, అందుకే ప్రపంచం పుట్టలేదు, చావదు, ఈ ఉత్త బట్టబయలు మాట్లాడదు, ఈ ఉత్త బట్టబయలుకు ఒక్కటైనా భ్రాంతిలేదు, బాధలేదు, జన్మములేదు జన్మములే

కుంటే అహంకారములేదు, అహంకారములేకుంటే ప్రపంచభ్రాంతి యెవరికి ఎందుకు

శ్లో॥ జన్మభావే కర్మంనాస్తి కర్మభావే ఫలంనహి ఫలభావే భయంకృత్యా భయా భావేన శంషయః

అందుకే ప్రపంచం ఎక్కడున్నది. ఈ ఉత్త భట్టభయలుకు ఏమీలేను, ఈ ఉత్త బట్టబయలే పరిపూర్ణం ఈవాక్యం సతతముమరుపక యూది ఉండవలయును ప్రయత్నంచేయవలెను ఈ ఉత్త బట్టబయలే అత్యంత విలక్షణం దీని వలన ఏవికారములు పుట్టలేదు యిది నిజగురు వాక్యం మొదటి ఉపదేశం పుట్టని చావనివాడే పరబ్రహ్మం పుట్టనిదే అమృతం అత్యంత విలక్షణంవలన ప్రపంచం పుట్టనేలేదు గనుక ఇది మొదటి ఉపదేశం, ఇది మహారహస్యం రాజగుహ్యం పరమగుహ్యం అనాదికారులకుచెప్పరాదు అనేనియమంఉన్నది పుణ్యం యిచ్చఉన్న వారలకు చెప్పరాదు పాపం యిచ్చఉన్నవారలకు చెప్పరాదు మిక్కిల్లిగురు సాంప్రదాయం యెరుగరు, ఈబట్టబయలు ప్రభావం యెరుగరు యేకులం అయిఉన్నరో వారికి ఉత్పత్తి స్థితిలయాలు కలిగి యున్నవి. ఆ ప్రమాణం దానికి వేదప్రమాణ ఈ ఉత్త బట్టబయలే పుట్టనిదిచావనిది జ్ఞానజ్ఞానాలు శూన్యం ఈ ఉత్తబట్టబయలే నిరాభాసం, సతతం మరువక యూదియుండవలెయును ఈ ఉత్త బట్టబయలు వలన సత్తుపుట్టలేదు ఆసత్తు పుట్టలేదు, ఈ ఉత్త బట్టబయిలే నిరంజనము నిర్వికారము

శ్లో॥ నిర్గుణో నిష్క్రియోనిత్యో నిర్వికారోనిరంజనః
అత్యంత విలక్షణమైన స్వరూపం

శృ॥ చితంతి సర్వశాస్త్రాణి॥
మొదట సాక్షిన్ని మాయ పుట్టలేదు అత్యంత విలక్షణం మొదట సాక్షిన్ని యే లేని యెరుక

గీ॥ అ॥5॥ శ్లో॥ విషయానినివర్తంతే నిరాహారస్య దేహినః రసవర్జ్యం రసోప్యస్యపరం దృష్ట్వా నివర్తతే

ఇంద్రియములచేత ఇంద్రియ నిగ్రహము చేయునట్టి దేహాభిమానము గల అజ్ఞులకు విషయములు అభిలాషద్భినాగా నివర్తించుచున్నది పరిపూర్ణము జూదినస్థిత ప్రజ్ఞునకు అభిలాష యున్నను, నివర్తించుచున్నది. యీ ఉత్త బట్టబయలు వలన వేదాలు భగవద్గీతలు పుట్టనేలేదు, గనుక అత్యంతవిలక్షణం ఈ వుత్త బట్టబయలు ముసుపే వున్నది. ఈ వుత్తబట్టబయలుకు జ్ఞానాజ్ఞానాలు

విద్యా విద్యలు, సదసత్తులు అనే ద్వంద్వాలు పుట్టనేలేదు, గనుక అత్యంత విలక్షణం ఈ ఉత్తర బట్టబయలు మునుపేయున్నది ఈ సతతం మరువక యాది ఉండవలెను. ఉంటే యేమి తోచదు క్షరం పాపమే, అక్షరం పాపమే, ఈ రెండు దోష స్వరూపాలు ఇందుకు క్షరాక్షరోపాధిద్వయదోషం వుత్కృష్టః అని శంకరాచార్యులవారు 185 అధ్యాయములో అన్నారు, ఈ వుత్తర బట్టబయలే నిరంజనం, నిర్గుణం, నిరవయవము, ఇందుకు.

శ్లో॥ నిర్గుణో నిష్క్రియోనిత్యో నిర్వికారో నిరంజనః
నిర్వికారో నిరాకారో నిత్యముక్తోస్మి నిర్మలః

శ్లో॥ అనన్య మస్థూల మహారస్వ మదీర్ఘం మజమవ్యయం
అరూప గుణ వర్ణాఖ్యంతత్ బ్రహ్మైవ్మవధారయేత్

చీ। చీ। లోకుల మాటలు కాకుల కూతలు

ఇతి శ్రీమద్గురు శివరామ దీక్షిత ప్రభావే వేదాంత విచారణే వుత్తరభాగే అమృతసారవా్మ ప్రధమధ్యాయ సమాప్తః

---

సాధకులు స్థూల శరీరమగు అన్నమయకోశాభిమానియగు విశ్వుడు పిండాండ మునందు విరాట్టుగానూ బ్రహ్మాండమునందు, సూక్ష్మ శరీరమగు ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ కోశములుగాను, దాని అభిమానియగు తైజసుడు పిండాండమునందు హిరణ్యగర్భుడు, బ్రహ్మాండమునందు కారణశరీర మగు ఆనందమయ కోశాభిమానియగు ప్రాజ్ఞుడుగా, పిండాండమందు అవ్యాకృతుడుగా, బ్రహ్మాండమందు మహాకారణ శరీరమగు హిరణ్మయకోశాభిమానియగు ప్రత్యగాత్మ పిండాండమునందు, పరమాత్మగా బ్రహ్మాండమందు వ్యవహారములు చేయుచున్న తాను, వీటియందు అనిశ్చయుడై, తాను వీటి కంటక కైవల్య శరీర పద్ధతిగా (అహంపదార్థరహితముగా) నుండి, స్థితి యందు అచలపరిపూర్ణ పరబయలే తన్నదని, తానులేను అనే దృఢముచే, తానులేని విధానము సద్గురు సార్వభౌములచే తెలుసుకొని, ఆచరిస్తు ఆ స్థితి గల్గియుండవలయును.

సీ॥ జలజ పత్రమునందు సలిలమంటనియట్లు అద్దమందున రూపమంటనట్లు
కురదయాతుమ్మరిపురుగు నంటనియట్లు— అజ్యంబుజిహ్వపైయంటనట్లు
భువిచింతపండుపై బొబ్బరంటనియట్లు — బలుచల్లలోవెన్నగలయనట్లు
చిత్రభానునియందు చీకటంటనియట్లు — ఆకాశమున వాయువంటనట్లు

గీ॥ బ్రహ్మవేత్తలు మాయాప్రపంచమందు

అఖిల వ్యవహారములుజేసి యంటరధిప ॥రమ్యగుణధామ॥
బ్రహ్మవేత్తలగువారు ఈ విధముగా నడుచుచుందురని సెలవిచ్చియున్నారు
దీనిని అచలపరిపూర్ణ నిర్ణయము గలవారు
కం॥ ఈ రీతిస్థితిగలిగిన నేరుపుశాలితరజనుల నిందాస్తుతులన్ తారేగిచేయ
డెన్నడు, వారలు మరిజేసిరేని, వలదానియనడూ, చెవియొగ్గికావలెనానీ
వినడూ వారూ మీ వారూ, మావారు, వీరను కొనిచు, సొరెక వీధిలో పోరాడె
వారినీ వలదానీయనడూ, చెవియొగ్గికావలెనాని వినడూ!
శ్రీ భాగవతుల శ్రీకిష్ణదేశికులవారు సెలవిచ్చియున్నారుగాన బ్రహ్మవేత్తల
యొక్క స్థితి పురుష లక్షణము, అచల పరిపూర్ణ ప్రబోధజెందినవానిస్థితిపురు
షలక్షణములు యెలా ఉంటాయో అచలర్షి దయానంద పాన్నాలరాజయోగీ
శ్వరుల వారు బోధించిన పద్ధతులు, వారిస్థితి ఏలా ఉండాలో తెలిపిన పద్ధతు
లు తెలియజేయుచున్నాను. బ్రహ్మవేత్తలయొక్క స్థితిపురుష లక్షణము।
యునికి! పైజెప్పిన పద్ధతిగా నడచినవారి యునికి, అనగా స్థితి యేలా
యుంతుననగా? జగత్మిధ్య, బ్రహ్మ సత్యం జీవోదేవో వనాపరా? అనియు
జగత్తుమాయ ఈ మాయను లేదు అని తెలిసిన, జీవుడు దేవుడే యనియు
మరియు వారలు బోధించు బోధ లక్షణము, విపీలికాది బ్రహ్మ పర్యయంత
ము. సమస్త చరాచరంబులు బ్రహ్మమేయని తెలిపెదరు. యెటులనగా (స
ర్వంఖల్విధం బ్రహ్మనేహనా? నాస్తి కించనా! అనేశ్రుతి న్యాయమున తెల్పెద
రు. వాయువుచే వీచబడిన సముద్రజలము, అలలుగా మారను. అట్టి అలలు
నీరు విడచి యెట్లు వేరుగా నుండదో, ఆ విధముగా సమస్త చరాచరములు
బ్రహ్మమును విడచి వేరుగలేవు అని సమాధానము చెప్పెదరు గాని, యిట్టి
స్థితియందు జనన మరణభ్రాంతి రహితముకలదా యనినలేదు. సమస్తచరా
చరములు బ్రహ్మమే అయిన యెడల, జనన మరణాది సంసారదుఃఖములు
బ్రహ్మమువేయని, చెప్పుకొనువారు ప్రపంచమున నొక్కరినికూడా చూడలే
ము, కాబట్టి సమస్తచరాచరంబులు బ్రహ్మమేనని, తెలియజేయు బ్రహ్మవేత్త
ల స్థితియందు, భ్రాంతిరూపకమైన పద్ధతేగాని, భ్రాంతిరహితము లేదని తెలి
యుచున్నది మరియు వారుతెలియజేయు దృష్టదార్ష్టాంతములు. సర్వంఖ
ల్విధం బ్రహ్మనేహనా? నాస్తి కించనా అనేశ్రుతి న్యాయముగా! బ్రహ్మదప్ప
ఇతరమేమియును లేదు ఉన్నదంతా బ్రహ్మమేననే బ్రహ్మవేత్తల పద్ధతి?
ఉనికి! సర్వంబ్రహ్మమైన సకల జీవజగత్తులు ఏవి జనన మరణము లెవరికి,
అనేవాడన, వీరలిచ్చు దృష్టాంతము ఒక బంగారమును దెలిసిన, దానిచే

చేయబడిన సమస్త భూషణములు (నగలు) చూచిన యివియన్నియు బంగారమేయని, యెలా నిర్ణయించెదరో, అలాగే ఒక బ్రహ్మ పదార్థమును తెలిసిన, దాని పరిణామమగు వ్యవహారికములగు, మరియు స్వభావికములచె తెలియబడు, పిపీలికాది జగత్తులు సర్వం బ్రహ్మమే యగును. మరియు వారు దార్ష్టాంతముగా చెప్పబడు సముద్రజలము వాయువుయొక్క సంయోగముచే, అలలుగా ఉత్పన్నములయినను, ఆ అలలు సముద్రమును విడచి వేరుగా లేక, సర్వము జలమే అనురీతిగా, బ్రహ్మముయొక్క పరిణామ రూపమగు, అవ్యక్త మహతత్వాదులగు, ప్రకృతి వారినుండి పరిణమించు జీవ జగత్తులు, బ్రహ్మమును విడచి వేరుగా నుండక, బ్రహ్మమేయగుచున్నదని వారిభావం అట్టి వారిస్థితియనగా బ్రహ్మవేత్తలస్థితి, అనగా ఉనికిచూచిన, ఉన్నదంతా బ్రహ్మమే అయితే, జనన మరణాలు సుఖదుఃఖములు బ్రహ్మమువేయని యెలా చెప్పకూడదు, విచారించగా ప్రప్రదమున, ఆ బ్రహ్మమే! తానే ఉండెను అపుడు సృష్టికామనా! భ్రాంతి! ఆ బ్రహ్మమునకే గల్గిన దనవలయును గదా! అనిన ఆ బ్రహ్మమునకు భ్రాంతిలేదందురు. వారి దృష్టాంతమును విమర్శించిన, సముద్రజలము వాయువుయొక్క సంయోగంచే అలలుగామారి క్రమక్రమముగా విజృంభించి, ఉప్పెనగా మారి, బీభత్సవము చేయు ప్రళయకాల రుద్రుని విధముగా, నాశనము గావించి, సముద్రజలములో తిరిగిఅందులో చేరి, అలలుగా మారుచున వి. ఆ విధముగా చూచిన, బ్రహ్మము ఉత్పత్తి, స్థితి, లయాదులు కారణభూతుడగుచున్నాడు గాన, వీరలకు జనన మరణ రహిత స్థితియెలా సంభవించును. గాన వీరలయునికి పై సీస పద్యము జలజపత్రమునందు సలిలము టనియుట్లు? అనువిధముగా నున్న మాయా ప్రపంచమందు, అఖిలవ్యవహారములు జేసి, అంటరధిప అనునటుల, తానుండి వ్యవహారములు చేయుచున్నాడు. కావున తన రహితము లెదుకనుక, జన్మకుదేనికంటక రాగలడని ప్రతివక్కరూ తెలియగలరు. గాన వీరల యునికిలో జనన మరణ రహితము విధానము లేదుయని ధృడమగుచున్నది ఇక అద్వైతుల యొక్క! స్థితియనగా! యునికి?? ప్రకృతోపాధి రహితమునందు, శేషించియున్న అధిష్టాన స్వప్రకాశచేతన బ్రహ్మము తెలియడమే! ఏలాయనగా? జాగ్రత, స్వప్న, సుషుప్త్యాదికి, అధిష్టానమైయున్న ప్రత్యగాత్మయే! విరాట్టు-హిరణ్యగర్భ-అవ్యాకృతోపాధికి అదిష్టానమైన పరమాత్మ బ్రహ్మము అదే స్వయంప్రకాశచేతన బ్రహ్మము, ఆ చేతన బ్రహ్మమే నీవుయని తెలుపుదురు. నీవే సచ్చిదానందమని బోధిస్తారు గాన–మి

థ్య-జడము-దుఃఖము-నీయందులేవు, భ్రాంతి వలన అనగా, తాడుయందు పాము లేకపోయినను, భ్రాంతి వలన తాడును పాముగా గాంచి, భయ భ్రాంతులు కలిగినటుల, తాను సచ్చిదానందుడైయుండి, భ్రాంతివలన మిథ్యజగము దుఃఖములు గలిగినవని, తాను సచ్చిదానంద జ్ఞానము కలిగిన వెంటనే, మిథ్య జడము దుఃఖములు లేక పోవునని తెలుపుచున్నారు గాన, వీరలు బోధించు స్వప్రకాశమైన బ్రహ్మము, ప్రకృత్యోపాధియందే తోచును గాని, ప్రకృతి రహితస్థితియందు తోచదు, కావున మాయయని, లేనిదియనే లక్షణము అందరూ తెలిసిన విషయము, కావున లేనిమాయా స్వరూపమునకు శాశ్వతమైన పరబ్రహ్మము అధిష్టానమని యెలాచెప్పగలము. అథవా ప్రకాశమే అధిష్టానమని ఒప్పుకున్నయెడల, నదిమాయచేత నశించునదేగాని. శాశ్వతమైన పరబ్రహ్మము మాత్రముకాదు, వీరలుఇచ్చు దృష్ట దార్ష్టాంతములు సముద్రజలము సూర్యకిరణతప్తమై, ఆవిరిగామారి మేఘమండలము జొచ్చి మేఘరూపు ధరించి, ప్రకృతిని విడచి పురుషుడు, పురుషుని విడచి ప్రకృతి ఉండజాలని విధము గా, అనగా

కం॥ కట్టెలుపిడుకలులేకను, ఎట్టుంబలె నిప్పునిలువకేగునో ధరపై, అట్టుంబలెనీవిప్పుడు-ఇట్టిశరీరంబులేక యెందుందవురా-యనిభాగవతుల క్రిష్ణదేశికేంద్రుల వారు సెలవిచ్చి యున్నారు. ఈ ప్రమాణముననుసరించి చూడగ, ప్రకృతి రహితమునందు స్వప్రకాశచేతన బ్రహ్మము తోచదు కావున దానిని మాయయని లేనివియని- లేనిదియని-మిథ్యయని- మూలంలేనిదియని చెప్పబడును. లేని మాయా స్వరూపమునకు శాశ్వతమని యేలా చెప్పవచ్చును చెప్పగూడదు, అథవా అధిష్టానచేతన బ్రహ్మమే శాశ్వతమనిన, అదిమాయచేత నసించునదేకాని శాశ్వతము గాదు. యీలాంటిస్థితియందు వీరలకు నిలుకడ యెలా ఉండును. అనినవారలు ఈ విధముగా ఉపమానమిచ్చుచున్నారు. సముద్ర జలము సూర్యునియొక్క కిరణముల ఉష్ణాగ్రతచే, ఆవిరిగామారి మేఘ మండలముచేరి, మేఘరూపమును బొంది, వర్షరూపమున భూమియందు కురిసి, కాలువలు- వంతలు, వాగులు, ఒర్రెలు, యేర్లు, ఉపనదులు-నదులు-మహానదులు-గాప్రవహిస్తు-సముద్రములో కలిసిన నిశ్చలతపొందును, సముద్రము అక్షయము అవ్యయముగానుండును, అలాగే బ్రహ్మముకూడా శాశ్వతుడు, అవ్యయుడు, అక్షరుడు, అచలుడని తెలిపెదరు. సరే: సముద్రమునందు నడిస్థితిజెందిన జలములు, తిరిగిసూర్యరస్మియనగా కిరణముల ఉష్ణాగ్రతచే, ఆవిరిగా మారదా? తప్పక ఆవిరిగా మారును,అప

క్షమున అవి మేఘరూపమున వర్షమై, భూమి పైకురిసి కాలువలు, వాగులు, వంకలు వర్రెలు, ఏర్లు, నదులు, మహానదులుగా ప్రవహించి సముద్రములో కలుస్తునే ఉండును, యిదియే జననమరణ ప్రవాహము గాన వీరిస్థితి చంచలస్థితి నిలుకడగాలేక రాత్రిబవలు తిరుగు విధముగా, నొకచోట యెరుకగా, మరొకచోట మరుపుగా, ప్రవహిస్తునే ఉన్నది, గాని యీస్థితి జనన మరణ రహితస్థితిగాదు, వారలు నేను శుద్ధ జ్ఞాన స్వరూపుడయిన ఆ బ్రహ్మములోనే ఉందురనిన,

కం॥ నేనుగాకొకటి శుద్ధజ్ఞానము గలదనుచుబల్కు జ్ఞానులమాటల్ పూనివినద గదు శుద్ధ జ్ఞానంబన నేనెనేను లేనిదియానే!

కం॥ నేమాత్రముందు ననియెను, నామాయాకూతలన్ని, యరసి సుషుప్తిన్ యేమాయె, మరణమప్పుడు యేమాయిను, గురుని మాటలేమాయనయా

కం॥ లేనినే మాయమైనను మావవులది మరుపుమూర్ఛ మరణంబును గాఢానిద్రయు నిర్ణిద్రన, నేవివి విని మృషని నమ్మనేర్తునె వాటిన్ గాన వీరల ఉనికిస్థితి జననమరణభ్రాంతి రహితములేదు ఇక ద్వైతమతాచార్యుల స్థితి యునికి జీవేశ్వరులు శాశ్వతమని, అందు ఈశ్వరుడు అధికారి, సర్వజ్ఞుడు నియంత సర్వాధికారి గావున, అతడు ప్రపంచమును తనశక్తి సామర్థ్యములచే సృష్టించాడని, అందులో నుండుటకు జీవోపాధులను సృష్టించాడని? జీవులు సుఖములనుభవించుటకే, ఇహలోకములో, సర్వసంపదలనుభవింప జేస్తు, మరణించిన వారిని ఉండుటకు 14 పదునాలుగు భువనములు, తనయందు కల్పించి పాపపుణ్యములను, అనగా పరలోక సౌఖ్యములనుభవించుటకు, అనుభవించినతోడనే, తిరిగి జన్మలు యిచ్చుచు, జనన మరణ ప్రవాహమందుంచి పొద్దు తిరుగుడు పువ్వువలె త్రిప్పుచుండును గాన వీరలస్థితి యందు జనన మరణ రహితములేదు.

పరిపూర్ణబోధ వారిస్థితి పురుష లక్షణము: నాలుగుమేనులు, నాలుగవస్థలు, నాలుగభిమానములు, ఈశ్వరతను చతుష్టయము విరాట్టు, హిరణ్యగర్భ, అవ్యాకృత. ఈశ్వర, మొత్తము నాలుగు శరీరములు, కలిసి అష్ట శరీరములు వీటియందుంటే, జనన మరణములు భ్రాంతి పద్ధతియే గలదుగాన వీటిని విడిచి కైవల్య శరీరమునందు, గురుకృపవల్ల కైవల్యశరీరమును కల్పించుకొని, జనన మరణములులేని, అచల పరిపూర్ణ సరబయలును, తనకు పైన క్రింద నాలుగుదిక్కులు, నాలుగుమూలలయందు గలిగియున్నది. గ్రహించి

తన ప్రారబ్ధ కర్మ అనుభవించినతోడనే, అష్ట తనువులు ముందే విడచియు న్నాడుగాన, ఇప్పుడు కల్పించుకున్న కైవల్యశరీరమునుగూడ విడచి, తాను ముక్తుడైపోవును, అప్పుడు జనన మరణములులేని, రాజబాట ఈ బాట ప్రపంచము దానికధిష్టాన స్వప్రకాశ చేతన బ్రహ్మమునకు గూడ, యేలాటి సంబంధములేదు, గాన ఉన్నది ఉన్నటుల లేనిది లేనటులగా, తెలిసిన తెలివి నిగూడ లేదుయని తెలుపడమే వీరిస్థితి, యునికి ఇందు ఆస్తిక మేకలదుగానీ నాస్తికములేదు, మరియు వీరలు శాశ్వితమును అశాశ్వితముగా. అశాశ్వితమును శాశ్వితముగా నిర్ణయించి చెప్పరు లేక దానికి దీనికి సంబంధములు గలపుకొని చూడరు, గనుకనే ఇది ఆస్తికమని, నిజమని చెప్పనగును, మరియు జ్ఞానవిజ్ఞానమునశ్వరములన జాతురు యేలాయనగా (సత్వాత్ సంజాయతే జ్ఞానం) అను భగవద్గీత వచనము.

కం॥ జ్ఞానంబు సత్వగుణమను దానికి జన్మించెననుచు, దామోదరుడామేనత్త కొడుకుతోననే, జ్ఞానమునకు జన్మమొకటి గలిగెగదోయి. ఈ విధముగా జ్ఞానము, సత్వగుణమునపుట్టినదిగాన జాతస్యమరణంధ్రువం అనేశ్రుతిననుసరించి

కం॥ పుట్టెంది గిట్టుజ్ఞానము, పుట్టెననుచు కృష్ణ మూర్తి, పురుహూతజుడా, నట్టి తనముద్దు మఱదికి గట్టిగ వినజెప్పెనిందు కలతేమోయీ యిలా పుట్టిగిట్టెజ్ఞానముతో మనకు పనియేమి యుందురేమో

శ్రు॥ జ్ఞానేన జ్ఞేయమాలోక్యం పశ్చాత్జ్ఞానం పరిత్యజేత్ అనుశ్రుతిననుసరించి

కం॥ జ్ఞానమగు నీవు, జ్ఞేయంబైన బయలుగాంచి, జ్ఞానమగు నినునీవే. లేనటంచు తెలియుమని ఆ నానరునకు వాసుదేవుడానతి యిచ్చెన్. అని క్రిష్ణదేశికులవారు సెలవిచ్చియున్నారు. ఈ పద్ధతి గురుముఖమున అచల పరిపూర్ణ పరబయలును తెలుసుకొనునంతవరకు. యీ జ్ఞానమగు దానిసరంజామములు యగు అష్ట తనువులు అవసరమైయున్నవి. యేలాగనగా వ్యష్టిరూపమైన జ్ఞానము సమిష్టిరూపమైన విజ్ఞానము యీ అష్టతనువులు నశ్వరములే. గాన వీటియందున్నంతవరకు జనన మరణములు బొందుచునే యుందురు. మరియు పరిపూర్ణములోనుండుటకు సందులేదు గాన నుండలేము.

కం॥ గురుడచలచలములను తనకెరిగించిన శిష్యుడెరిగి యెరుకై యుండెనెయరుకను నిల్పకు మనినను యెరుకను వినునాడి శిష్యుడెట్లుండునంటే, అట్లనే నేనింకెట్లుండునంటే, పురుషూడులే ట్టి పొలతీ సౌంధర్యావము, మరిమరి కలిగుండే మరిలేనట్లనియుంటే, యెట్లుండునంటే అట్లనే నేనింకెట్లుండునంటే.

కం॥ ఏరుకను విడనాడినయూ, పురుషుని స్థితి యెట్టిదనిన, పొందుగవినుమీ, పతిపడునరిపడదనకను, సరిగావర్తింపుచుండు, సమతబుద్ధిన్ కార్యములందు సహజప్రవృద్ధిన్, పరిపారి విధములపరవూలు బెట్టాడు, మరివైరాగ్యముచే తమూనుకోడుండాడు, సమతబుద్ధిన్ కార్యములందు సహజత్రివృద్ధిన్.

కం॥ అనహంకారుడని మిషుడు గనుకనె, విశ్వంబనేటి కల, గానడపాం జను వాడు శనిమిషుడు, గావున విశ్వంబనేటి, వ్వపోన్నద్యోగముఃబూని, చేయుచు యూవుద్యోగముమానీ, యనునీ స్వపోన్నద్యోగమునకు నే కారణమనీ తాన, నిమిషుడెన్నడనుకోడామూటాను ద్యోగాముబూనీ, చేయుచు యూవుద్యోగాముమానీ?

కం॥ కలమేలుకొన్న పురుషుడు, కలలోతలిబాములెరుక, గలిగుండగనే, తిల కింపలేవు గురుకృప, తెలివొందిన వానికింక తిప్పాలున్నావే, తెల్పరకొద్దిగొ ప్పలున్నావే, తలిదండ్రి ధారధాత కులబాంధమాప్తులుకల. బాంధవులు దేశి కులనినమ్మితె యింకాతిప్పాలున్నావె, తెల్పరకొద్దిగొప్పలున్నావే!

కం॥ యీరీతి స్థితిగలిగిన, నేరుపు శాలితరజనుల, నిందాస్తుకులన్, తారేగి చేయుడెన్నడు, వారలు మరిచేసిరేని, వలదానియనడూ, చెవియొగ్గికావలెనా ని వినడూ, వారు మీవారుమూవారు వీరనుకొంచు, సారెకువీధిలో పోరాడె వారినీ, వలదానియనడూ, చెవియొగ్గి కావలెనాని వినడూ?

పై తంపార్థము లమననము చేస్తు కైవల్య శరీర నిర్ణయము తెలిసి, తనప్రా రబ్ధ కర్మననుభవించు వరకే, ఈ అష్ట తనువుల విడచి, కైవల్య శరీర పద్ద తిగా నుండి తాను లేకపోవుచున్నాడు. అనగా ఆటు అష్ట తనవులయందు, జీవేశ్వరయేకరూపమగు, బ్రహ్మమునందు లేక, అచల పరిపూర్ణ పరబయ లందు, లేశమాత్రముఃలేక, తనుకుతానే కర్పూరదీప సంయోగమున, కర్పూ ర దీపము లేకపోయిన విధముగా, లేక పోవునూ. అదే జననమరణ భ్రాంతి లేకపోవటము,

జై సద్గురు మహరాజుకు జై

శ్రీమద్ అనసూయాంబాసమేత శ్రీమద చలద్దయానంద పొన్నాల రాజయో గీశ్వర సద్గురు స్వాముల చరణారవిందార్పణమస్తు.

ఇతి శ్రీహరకట్లగోత్రోద్భవుండగు జంగమవంశాబ్ధి చంద్రుడునగు శ్రీ రామచంద్ర యార్య యాదవ్ గారి ప్రథమ పుత్రుండును శ్రీ గట్ల వెంకటారామయార్య

సద్గురువుల శిష్యరత్నము తదనంతరం శ్రీ అచలర్షి! దయానంద పొన్నాల రాజయోగీశ్వర సద్గురు స్వాముల పాదారవిందామృత రసాయనంగ్రోలు శిష్యుడునగు శ్రీ నిత్యానంద జంగ లక్ష్మీనరస్వయార్యుల విరచితంబగు కైవల్య శరీర నిర్ణయ నిరసన కైవల్య రహితాచలబోధ సిద్ధాంతమను గ్రంథము సమాప్తం!!

ఓం శాంతిః శాంతిః శాంతిః

## మంగళహారతి

మంగళమివరే సద్గురు మూర్తికి అంగనలందరు ఇటుగూడి
భంగపరచి ఎరుకను లేకుండగ! శృంగమరచె సద్గురువేడి ॥మంగళ॥

1 ఎరుక మరుపు లేకుండగజేసియు యేలుమని దండంబిడియు
సద్గుణ పాదాబ్జంబులు బట్టియు సారెకు సేవించియు వేడి ॥మంగళ॥

2 ఎరుకమరుపు లేనట్టిది పరమని యెరిగించియు మదిదృఢపరచి
ఎరుకమాయి లేనట్టిది మృషయని ఎంతలోపడిపించెని చూడ ॥మంగళ॥

3 వేదన్నను కనుపడు బయలిది లీలఎరుక విడిచియు చూడు
నేదెలసితినని యన్నను బయటను నిలువజాల నిక్కంబనియు ॥మంగళ॥

4 ముందుగనున్నదె పరిపూర్ణంబిది ముదమున దెల్పిన గురువరుడు
ఎందులేదు నీమూలము కనుమని ఇది దెక్కడ ఇకలేదు ॥మంగళ॥

5 రారాయని పిలిచె దయానందుడౌ రాజయార్యసద్గురు వరుడు
పోరాలేనిక లక్ష్మీనరస్వయ్య పూరబోదచే మృషయాను ॥మంగళ॥



| పేజి నం। | వరుస నం। | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| | | పోద్ఘాతము | |
| 1 | 5 | పదార్థమల | పదార్థముల |
| 1 | 26 | సుసాధ్యమే | సాధ్యమే |
| 2 | 3 | మిగుడుబువ్వ | మిరుగుడుబువ్వ |
| 2 | 11 | కుదిపితిరే | కుదిపితిరేని |
| 2 | 12 | రాగలరుని | రాగలరని |
| 2 | 15 | వతులుగానున్న | వతుగానున్న |
| 2 | 24 | రహితర | రహిత |
| 3 | 15 | చాటుచున్నాదు | చాటుచున్నారు |
| 1 | 1 | జళాపూరితుండగు | కళాపూరితుండగు |
| 1 | 3 | అనుభవించి | అనుభవించు |
| 1 | 4 | మిక్కిల | మిక్కిలి |
| 1 | 4 | స్వరూడును | స్వరూపుడును |
| 1 | 15 | స్థూన | స్థూల |
| 2 | 22 | ఆవరమనే | ఆవరణమనే |
| 3 | 3 | పస్త్రై | తస్త్రై |
| 3 | 4 | అంతఃకరలయందు | అంతఃకరణములయందు |
| 4 | 3 | శిష్మలు | శిష్యులు |
| 4 | 7 | నమ్మ్యై | నమ్మి |
| 4 | 9 | సరీరం | శరీరము |
| 4 | 11 | తల్లిదడ్రులు | తల్లిదండ్రులు |
| 4 | 12 | రేదా | లేదా |
| 4 | 16 | మూరము | మూలము |
| 4 | 18 | దేహంశములె | దేహంవలె |
| 4 | 24 | మూలంఅని | మూలంలేని |
| 5 | 24 | లయును | వలయును |
| 6 | 2 | సత్యమైన | సత్యమే |
| 7 | 18 | విధతనముగా | విధముగా |
| 8 | 17 | వినుభూ | వినుచూ |
| 8 | 29 | నోలోరీతినుండు | నొకరీతినుండు |

| పేజి నం॥ | వరుస సం॥ | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 8 | 29 | బ్రహ్మండముకన్ | బ్రహ్మండములోన్ |
| 9 | 1 | బరగెదినుమీ | బరగెడిదినుమీ |
| 9 | 17 | యగుపడను | యగుపడును |
| 10 | 5 | స్రత్యక్షవర్చు | ప్రత్యక్షవర్చు |
| 10 | 6 | బోధనడుటకు | బోధపడుటకు |
| 10 | 15 | పెద్దబకు | పెద్దలగు |
| 11 | 21 | దైనము | దైవము |
| 11 | 23 | పుట్టెగిట్టునని | పుట్టెగిట్టదని |
| 13 | 11 | చుండునట | [illegible]ండుట |
| 17 | 4 | అపుషిని | అపుష్టిని |
| 17 | 28 | విధానయు | విధానము |
| 18 | 6 | బ్రహ్మముచు | బ్రహ్మము ను |
| 21 | 14 | బ్రహ్మయును | బ్రహ్మమును |
| 23 | 13 | హిమనతుని | హిమవంతుని |
| 23 | 13 | చూని | చూచి |
| 24 | 26 | అవ్యక్తమునండు | అవ్యక్తమునందు |
| 25 | 15 | చెప్పుబడున | చెప్పబడును |
| 29 | 14 | ప్రజాతతి | ప్రజాపతి |
| 30 | 3 | సున్నందున | నున్నందున |
| 30 | 8 | విస్తరించత | విస్తరింప |
| 30 | 15 | వర ము | వర్ణము |
| 30 | 17 | కంద | గంధ |
| 31 | 7 | చొక్కొక్క | నొక్కొక్క |
| 31 | 25 | పరిపాలిండు | పరిపాలించు |
| 33 | 1[illegible] | దానిధర్మము | దానికర్మము |
| 40 | 19 | మోహప్రకియ | మోహనప్రకియ |
| 42 | 1[illegible] | జన్యా | కన్యా |
| 51 | 6 | నముురోమంబులను | నఖరోమంబులను |
| 58 | 15 | వలపనాయె | వరుసనాయె |

| పేజి నం॥ | వరుస సం॥ | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 62 | 27 | వరాశక్తి | పరాశక్తి |
| 63 | 23 | రసరూవ | రసరూప |
| 64 | 2[illegible] | దలదు | గలదు |
| 68 | 19 | అంజ | అంబీజ |
| 69 | 1 | అబేద్వం | అబేదత్వం |
| 69 | 3 | వంబీజము | వంబీజ |
| 69 | 10 | బొరది | బొంది |
| 69 | 12 | లందీజ | లంబీజ |
| 69 | 20 | శముదాయు | సముదాయ |
| 69 | 23 | జోరూప | తేజోరూప |
| 69 | 26 | మేర్పచుని | మేర్పరుచుకొని |
| 70 | 15 | మారఖ | మారణ |
| 70 | 27 | చెవిబాన | చెవిస్థాన |
| 70 | [illegible]0 | జగజ్జీవప్వం | జగజ్జీవత్వం |
| 71 | 6 | జీరి | జేరి |
| 71 | 28 | జే | జేరి |
| 72 | 4 | కారత్వం | కారుణ్యత్వం |
| 72 | 10 | పావసత్వం | పావనత్వం |
| 73 | 4 | చిచ్చు | నిచ్చు |
| 75 | 5 | అవ్యాకృతుని | అవ్యాకృతుని |
| 78 | 13 | మనోమకోశము | మనోమయకోశము |
| 70 | 18 | గులో | గుహలో |
| 79 | 30 | విపమయ | విషమయ |
| 81 | 28 | వ్రతి | ప్రకృతి |
| 82 | 25 | నుభవించిన | అనుభవించిన |
| 83 | 3 | రానీ | కానీ |
| 83 | 6 | నందములో | ఆనందములో |

| పేజి నం॥ | వరుస నం॥ | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 85 | 23 | సమిషి | సమిష్టి |
| 86 | 7 | విడద | విడచి |
| 89 | 26 | సృష్టిపితి | సృష్టిస్థితి |
| 94 | 16 | ఉనాన | ఉదాన |
| 96 | 27 | నాతపిత్త | వాతపిత్త |
| 98 | 4 | మహకాశ | మహాకశ |
| 98 | 11 | అన్యోసహకారము | అన్యోన్యసహకారము |
| 100 | 25 | ఆలోచళ | ఆలోచన |
| 104 | 21 | దావనటి | పావకటి |
| 104 | 26 | కలముఃలన్నియు | కులములన్నియు |
| 105 | 5 | వివరించునాన్నదము | వివరించుచున్నారము |
| 106 | 9 | ధృష్టాంతము | దృష్టాంతము |
| 106 | 22 | నిర్మంము | నిర్మలము |
| 107 | 15 | కోనదాదు | కానరాదు |
| 114 | 29 | లేటి | లేనట్టి |
| 115 | 10 | కలలోతలి | కలలోపలి |
| 115 | 14 | నిందాస్తుకుల్ | నిందాస్తుతులన్ |
| 115 | 29 | పితృండును | పుత్రుండును |
| 115 | 12 | వేదన్నను | లేదన్నను |
| 116 | 17 | పూరబోధవే | పూర్ణబోధవే |

# ప్రస్థానత్రయ భాష్య రహితమునకు దారి

## బ్రహ్మము




మహేశ్వర ప్రింటింగ్ ప్రెస్, నరసరావుపేట